మూడవ ముద్రణము

● త్వరపడుడు ●

ఆంధ్రమహాజనులు చాల నాళ్లుగా ఎదురు చూచు చుండిన ఈ ముద్రణము కాపీలు అయిపోవుచు న్నవి. కాగితంకరవులో గూడ చక్కని కాగిత ములపై ముచ్చటగా ముద్రింపబడినది. వెనుకటి ముద్రణ ములకంటె ఇది అన్నివిధాల అంద మై యున్నది. అక్కరగల వారు త్వరపడ వలెను.

● ఆలసింపకుడు ●



వెల రెండు రూపాయలు

# శ్రీమద్భగవద్గీత

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు

ప్రకాశకులు :

ఆంధ్ర గ్రంథమాల -- తపాలా పెట్టె 212 -- మద్రాసు




★ శ్రీమతి భానుమతి ★ కృష్ణకుమారి

★ బాలత్రిపురసుందరి ★ వి. జే. వర్మ

ఎం. ఎన్. రామారావు పాడినవి **N. 18749-5**

## సూదుల క్రొత్త ధరలు

"హెచ్. ఎం. వి." హైఫిడెలిటి 10 సూదుల పాకెట్ 1-కి రూ. 1/8/-

"హెచ్. ఎం. వి." ఉక్కు సూదులు 200 సూదుల డబ్బీ 1-కి రూ. 1/8/-

"ట్విన్" ఉక్కు సూదులు 200 సూదుల డబ్బీ 1-కి రూ. -/14/-



# విషయానుక్రమణిక

జనవరి, 1945



**చిత్రములు**

కవిసార్వభౌమ ములుగు పాపయారాధ్యులవారు (త్రివర్ణము); ఉదయకాంతులు (ద్వి
వ్యంగ్యచిత్రములు; తదితర చిత్రములును.




సంపుటము 22 | జనవరి, 1945 | సంచిక 1

తారణ - పుష్యము

# స్వవిషయము

భగవదనుగ్రహమువల్ల భారతికి మరొక్క యేడు నిరాతంకముగా గడచిపోయినది. దీనితో భారతికి ఇరువదియొక యేండ్లు పూర్తియై ఇరువదిరెండవ యేడు పైబడినది.

నేటి యీ కర్కోటక కాలములో ఈ మహాభాగ్యలబ్ధికి మా యానందమునకు మేర లేదు. ఆత్మీయులయిన ఆంధ్రమహాజనుల ఆదరాభిమానములు మా కిప్పట్టున సమృద్ధిగా తోడ్పడినవి. కాల మెంత అనుకూలము కాకపోయినను అయినవారి ఈ ఆశీర్వాదబలమే మాకు అమోఘమైన అంగరక్షయై నిల్చినది. భారతి దినదినాభివృద్ధికి హేతువైనది.

ఈరీతిగా ప్రత్యక్షముగాను, పరోక్షముగాను మా శ్రేయస్సునకు దోహదముకల్పించిన యావన్మందికిని, ఈ జన్మదినోత్సవసందర్భమును పురస్కరించుకొని, యిందుమూలమున మా నమోవాకము

లర్పించుచున్నాము; అపారమయిన మా కృతజ్ఞతను వెల్లడించు చున్నాము.

దేశకాలపరిస్థితు లనుకూలించినంతవరకు, లభించిన సాధన సంపదతో, ఉన్నంతలోనే ఓపినంతమట్టుకు భారతి యింతవరకు కర్తవ్యపాలన సాగించుకొనివచ్చినది. ఇకముందుకూడ సాగించుకొని రాగలదు. పాతక్రొత్తల మేలు కలయికతో ఆంధ్రసాహిత్యవికాసా భ్యుదయములను సాధించుటయే మా పరమలక్ష్య మనుట సార్వజనీ నము. తదనురోధముగా భారతి యింతవరకు ఏమేమి చేసినదో, ఏమిచేయుచున్నదో తెలుపుట మాకు తగని పని. తన్నిర్ణయములో సహృదయులే ప్రమాణము.

మా ఉద్యమములో మామట్టుకు మాకు ఇంకను తృప్తిలేదు. చేసినది స్వల్పము, చేయవలసినది బహుళముగా మాకు తోచు చున్నది. ఏమేమో చేయవలెనని కొండంత ఆశ యున్నది. ఎప్పటి కప్పుడు ఎన్నెన్నో క్రొత్తక్రొత్త కోరికలు ఊరిక లెత్తుచున్నవి. మన సులో ఎన్నెన్నో ఊహాలు ఉజ్జృంభిత లూగుచున్నవి. యథాసావ కాశముగా వానిని క్రియారూపమున పెట్టుటకే మా అనునిత్య ప్రయత్నము.

ఆంధ్రమహాజనుల అవ్యాజాదరముతో మున్ముందు ఇతోధి కమైన సేవ చేయగల మనియే మా దృఢవిశ్వాసము.



# టియూరోపులోని విద్యావిధానాలు

= శ్రీ డి. యస్. శర్మ =

నేటి నవీనకాలంలో యూరోపునందలి విద్యావిధానసూత్రక్రమమందు విచిత్రమైన పరిణామం గోచరముకాజొచ్చింది. యూరోపుచరిత్రలో ఆధునికయుగమన్నది ౧౪-వ శతాబ్దంనాటి సంప్రదాయవిద్యాపునరుద్ధరణతో ప్రారంభమయినట్లు చెప్పవచ్చు. నాటి మొదలుకొని యింతవరకు వరుసగా (కావలసినంత కలగాపులగంగానే అనుకోండి) నాలుగుసూత్రపద్ధతులు చూపట్టాయి. వాటిని మనం మానవీయసూత్రపద్ధతి అనీ, వాస్తవికసూత్రపద్ధతి అనీ, ప్రాకృతికసూత్రపద్ధతి అనీ, సామాజికసూత్రపద్ధతి అనీ నాల్గింటినీ నాలుగు పేర్లతో పిలవవచ్చు.* ఆ చతుస్సూత్రి ఊదిఉద్ఘాటిస్తూవున్న విద్యావిశేషాలను సమ్యగ్విచారణచేసి, వాటిని మన ప్రాచీనభారతదేశంలోని విద్యాసూత్రక్రమాలతోనూ, ఆచరణప్రచారణలతోనూ పోల్చిపరిశీలించడం అతి ఆహ్లాదకారిగా ఉండగలదని నా విశ్వాసం.

యూరపులో పైన చెప్పిన మానవీయ విద్యాసూత్రక్రమమన్నది సంప్రదాయబద్ధమైన కావ్యవిద్యాపునరుద్ధరణకు సాక్షాత్ఫలితంగా ఏర్పడింది. ఈ పద్ధతి ప్రకారంగనక చూస్తే సలక్షణమైన కావ్యవాఙ్మయాన్ని పిల్లలచేత లక్షణంగా చదివింపజేసి, వారి కవి చక్కగా బోధపడేటట్టుచేయడమే పిల్లల విద్యాబోధనకు ప్రశస్తమైన మార్గంగా ఏర్పడుతున్నది. ఎందుకంటారేమో! కావ్యవాఙ్మయమనేది మానవీయ మహిత అనుభవాలకు మహోత్తమమైన ఆకరంవంటిది. కావ్యవాఙ్మయంలో యుగయుగాలనాటి జ్ఞానపుంజమంతా నిండి నిబిడీకృతమై వుంటుంది. ఏతావతా ఏమిచేయవలసివుంటుందంటే, పసిపిల్లలు చదువనూ వ్రాయనూ నేర్చిన వెనువెంటనే వారు గ్రీకు లాటిను గ్రంథాలను చదివి అర్థం చేసుకొని సరిగా సమన్వయపరచుకొనేటట్టు వారికి నేర్పవలసి వుంటుంది. ఈపని నెరవేర్చవలెనంటే, మరి వారికి ఆ భాషల వ్యాకరణపరిజ్ఞానం అత్యవసరంగా ఏర్పడింది. దాని ఫలితంగా లెక్కలేనన్ని వ్యాకరణపు బళ్లు బయలుదేరాయి. వాటిలో కావ్యకలాపం క్రమానుక్రమణికగా నేర్పుతూవచ్చారు. శిక్షణ సమస్తమూ భాషావాఙ్మయాలకుమాత్రమే నియంత్రితమవుతూవచ్చింది. పిల్లలందరూ ఈ ప్రాచీనభాషల వ్యాకరణాల్లోని వివిధసూత్రాలనూ కంఠాపాఠంగా విధిగా నేర్పవలసివచ్చింది. ఆ నేర్పడంకూడా వట్టినేకాదు. ఉదాహరణ ప్రత్యుదాహరణలతోనూ, అపవాద ప్రత్యపవాదలతోనూ సహా నేర్పవలసివచ్చింది. పురాణకావ్యవాఙ్మయంలోని గాథోపగాథల వివరాలనన్నిటినీకూడా వారు వాటి భూగోళ విశేషాలతోనూ, చారిత్రిక సన్నివేశాలతోనూ సహా సక్రమంగా తెలుసుకోవలసివచ్చింది. ఈరీతిగా వారు పాత్రపరిశీలనచేసి ప్రస్తుతించడమో, లేక జీవితంలోని ఉన్నతోన్నతమైన ఆదర్శాలతో సానుభూతి కనపరచడమో చేయగలిగేలోపుగానే వారి మనస్సులు వట్టి నిష్ప్రయోజనమైన జ్ఞానపుంజంతో తలమునకలుగా క్రుంగిపోవలసివచ్చింది. ఇంతకూ ఆమానవీయవిద్యావిధానం మనసులో పెట్టుకొని యుండిన ఆదర్శమేమో తెలుసునా? కావ్యవాఙ్మయనిష్ణాతుడే ఆవిధానానికి ఆదర్శమూర్తి. కాని ఆ ఆదర్శాన్ని అందుకొని ఆదరించడానికి పూర్వం ఈ విద్యావిధానప్రయత్నాల్లో బోలెడంత దండగమారి వ్యవహారం జరుగుతూవచ్చింది. ఆదర్శాన్ని అందుకోగలిగినపిమ్మటకూడా అందులో ఏవో

**Humanistic Theory; Realistic Theory; Naturalistic Theory; Sociological Theory.*

అనేక జీవితావసరాలు లోటుపాటుకు లోనైయున్నట్టు ద్యోతకమయ్యేది. ఈపద్ధతిమీద సంపూర్ణంగా ఆధారపడిన విద్య గట్టిగాచేయగలిగితేగనక చిత్తసంస్కారంగల చిన్మయవ్యక్తిని—సౌందర్యమంటే చెవి కోసుకొనే సహృదయుణ్ణి — మానసికవాసనలలోని మహితచ్ఛాయలను ప్రస్తుతింపగలిగే మహితాత్ముణ్ణి — మానవప్రకృతినిగురించిన పరిజ్ఞానం ప్రకృష్టంగాగలిగిన ప్రబుద్ధుణ్ణి సృష్టింపగలిగేమాటయేమో వాస్తవమే. కాని, అత్యధికసంఖ్యాకమైన సందర్భాల్లో ఈపద్ధతి నిజానికి మాటలు, మాటలు, మాటలు వట్టి మాటల పోగులైన మనుష్యులను మాత్రమే— తాము సాక్షాత్తుగా నివసిస్తున్న ఈప్రపంచమంటే యేమిటోకూడా సరిగాయెరుగని శుద్ధబుద్ధస్వరూపులను మాత్రమే — వాస్తవ జీవితంతో అణుమాత్రమయినా సంబంధ సంపర్కాలకు నోచుకోని ఛాందసులను మాత్రమే సృష్టింపగలిగింది.

ఈమానవీయ విద్యావిధానానికి పరిణామఫలంగా వచ్చిపడింది రెండవదయిన వాస్తవికవిధానం. ఏతత్సంప్రదాయవాదులు వాదిస్తూవచ్చిం దేమిటంటే ? వారి ప్రకారం మనము మన పిల్లలకు నేర్పవలసింది, అసలయిన వస్తువులనుగురించికాని వట్టిమాటలుకాదు; గ్రంథాల్లోని వ్యక్తులనుగురించి చెప్పవలసింది వారి జీవితాల్లోని వస్తుస్థితిగతులనేకాని వాటి క్రనీడలను కానేకాదు. ఈ వాస్తవికప్రపంచంలో బ్రతికి బాగుపడవలసిన బాలకులకు ఎంతమొత్తుకున్నా బుర్రకెక్కని వ్యాకరణాలతో సంకులమైన ఆ మృతభాషలు (గ్రీకు లాటినులు) ఏమి అక్కరకువస్తాయి ? దేవుళ్లూ, దేవతలూ అని లేనిపోని కల్లబొల్లికబుర్లతో నిండిన ఆ పాత పురాణగాథలుమాత్రం ఏమి ఉపయోగపడుతాయి ? ఇటువంటి చదువుకొన్న చట్టుబండల పరిజ్ఞానంకంటె మబ్బులెలా ఏర్పడుతున్నాయి, ఋతువులెలా ఏర్పాటయినాయి, పంటలెలా పండుతున్నాయి మొదలైనటువంటి సర్వసాధారణమైన ప్రకృతిసూత్రాల పరిజ్ఞానమే ఎన్నోరెట్లు ఎక్కువ ఉపయోగకారిగా ఉంటుంది. చచ్చినభాషలను పట్టుకొని, క్రియలేవి, కర్మలేవి—ప్రకృతులేవి, ప్రత్యయములేవి—వచనములేవి, విభక్తులేవి ఇత్యాది అనవసర ప్రసంగంకంటేనూ, స్వప్నసామ్రాజ్యసమానమైన పురాణోక్తస్వర్గంలోని కిన్నరకింపురుషాది దేవతాగణంయొక్క వంశావళీనామావళీల పారాయణకంటేనూకూడా నేటికాలపు బాలకులకు భౌతికరసాయనాది శాస్త్రాల (పరినిష్ఠితజ్ఞానం లేకపోతేపోయింది. పట్టుమని) ప్రాథమికపరిజ్ఞానం ఏర్పడ్డాచాలు ఎంతో లాభకారిగా ఉంటుంది. మూడేమూడుముక్కల్లోగనక చెప్పవలసివస్తే —విద్యావిధానానికి పరమప్రాప్యం శాస్త్రపరిజ్ఞానమూ, శాస్త్రీయపద్ధతుల పరిజ్ఞానమే అయివుండవలెకాని భాషాసాహిత్యాలు వాటి ప్రాప్యం కారాదు; వస్తువులూ, వస్తువుల వాస్తవికజ్ఞానమే దాని లక్ష్యం కావలెకాని కల్లబొల్లికట్టుకథలూ, కోటలకెక్కే వట్టిమాటలూ దాని లక్ష్యం కారాదు. ఈరీతిగా ఈవాస్తవికపద్ధతి హృదయంలో ఆరాధిస్తూవచ్చిన ఆదర్శమూర్తి మనప్రకృతి పరిజ్ఞానసీమావధులను విస్తరింపజేయడానికి బద్ధకంకణుడైన శాస్త్రపురుషుడు. ప్రత్యేకదీక్షతో గనక పూనుకొని పనిచేసేటట్టయితే ఈపద్ధతి సదా సత్యశోధనకు సాహసించే వివేకానందులనూ, మొక్కవోని ఉపకరణాలతో ప్రకృతి కార్యకలాపాలనుగురించిన నిర్దుష్టజ్ఞానంగల మేధావంతులనూ సృష్టింపగలిగేమాట యేమో వాస్తవమే. కాని, ఆదరాబాదరాగా పనిచేసేటట్టయితే ఇది అనేకసందర్భాల్లో కేవలమూ స్తబ్ధచైతన్యంతోకూడి చిత్తవికాసశూన్యమైనట్టి, నైతికనిష్ఠలేని, ధర్మాధర్మపరిజ్ఞానరహితమైన యంత్రమూర్తులను మాత్రమే కనిపారవేస్తుంది.

ఇక మూడవదానికి వద్దాము. అది ప్రాకృతికసూత్రపద్ధతి. ఈపద్ధతిమూలంగా జ్యోతిశ్శాస్త్రంలో కోపర్నికస్ సూత్రపద్ధతి తెచ్చిపెట్టినంత విప్లవానికి సరిగ్గా దీటురాగల విప్లవమొకటి విద్యావిధానచరిత్రలో బయలుదేరింది. మానవీయసూత్రవాదు లేమన్నారు ? సారస్వతశిక్షణ కావలెనన్నారు. వాస్తవికవాదు లేమన్నారు ? శాస్త్రశిక్షణ కావలెనన్నారు. ఆ ఉభయసంప్రదాయవాదులూకూడా నేర్పవలసింది

# నేటి యూరోపులోని విద్యావిధానాలు

పదములా, లేక వస్తువులా అనే ఒక్క ప్రశ్నమీదనే వాదవివాదలు పడుతూవచ్చారు. ఇక ఈతృతీయపద్ధతి ఏమిచేసిందో చూడండి. నేర్పవలసినదేదో ఎలాగయినా కొల్లబోనివ్వండి, ఎవరికి నేర్పవలెనో వారిని ముందుకొత్త గట్టిగా గమనించండి అని అసలు విషయాన్నే పూర్తిగా మార్చివేసింది. దీనిప్రకారం చూడబోతే ఉపాధ్యాయుని లక్ష్యం పిల్లల పసిమనస్సుల్లో యోగ్యతకు మించిన విషయాలను (పదాలనుగురించే కానివ్వండి, లేదా వస్తువులనుగురించే కానివ్వండి) బలవంతంగా నూరినూరిపోయడం కారాదు. ఆ పసిమనసుల్లోవుండే సహజశక్తులను నెమ్మదిగా బయటికి లాగడమే వారి ప్రధానలక్ష్యం కావాలి. అందరు పిల్లల్లోనూ ఒకేవిధమైన మానసికశక్తు లుండవు. ఒక్కొక్కపిల్లవానికి ఒక్కొక్కవిధమైన సొంత అభిరుచులూ, సొంత అభిప్రాయాలూ, సొంత వాంఛలూ ప్రత్యేకంగా వుంటాయి. ఒక పిల్లవానికి సారస్వత శిక్షణ అవసరమై వుండవచ్చు. ఇంకొకనికి శాస్త్ర శిక్షణ కావలసివుండవచ్చు. ఒకనికి భాషలను నేర్చుకోవలెననే అభిలాష ఉండవచ్చు; ఇంకొకనికి సారస్వతంమీద శ్రద్ధాసక్తు లుండవచ్చు; మరో మూడో వ్యక్తికి ప్రయోగాలుచేసి చూడడంలో ప్రత్యేకవాంఛ ఉండవచ్చు; అదీ ఇదీకాక నాలుగోవానికి కొత్త కొత్త పరిశోధనలు సాగించడంలో ఎక్కువకోరిక ఉండవచ్చు. కాబట్టి ఇందువల్ల ఏమితేలుతున్నదంటే? అధ్యాపకుడైనవానికి పిల్లలమనస్సే ఎక్కువముఖ్యం కాని, వారికి నేర్పవలసిన విషయాలు అంత ముఖ్యమైనవి కావు. ఉపాధ్యాయులైనవారు పిల్లల మానసిక తత్వాలను బహుశ్రద్ధగా పరిశీలించాలి. ఒక్కొక్కపిల్లవానిలోనూ గుప్తంగా అణగియున్న శక్తులను బయటికి జాగ్రత్తగా లాగి, వాటిని యథోచితంగా పెంచి పెద్దచేసి, ప్రతిపిల్లవానియొక్క ప్రత్యేక వ్యక్తిత్వాన్ని పోదిగా పోషించడమే ఉపాధ్యాయులు ముఖ్యలక్ష్యంగా పెట్టుకోవాలి. ఈపద్ధతివాదులు ఆదరించి ఆరాధించే ఆదర్శమూర్తి యెవరంటే? సర్వాంగీణంగా అభివృద్ధిపొందిన తన ఖాసాసహజశక్తులతో విలసిల్లే అసాధారణవ్యక్తియే వారి ఆరాధ్యమూర్తి. ఒకవిధంగా చూడబోతే నేమో ఈపద్ధతి వారివారికి దేవుడు ప్రసాదించిన శక్తిసామర్థ్యాలకు చక్కని దోహదం కల్పించి పెట్టింది; విద్యాశిక్షణను అవరోధం లేని పద్ధతులమీద నడపనూ నడపగలిగింది. కాని ఇంకొకవిధంగా చూడబోతే ఇది మనుష్యులను ఇంతవారిని అంతవారినిగా పేర్కొని, వారు ఉబ్బి తబ్బిబ్బు లయేటట్టు చేసింది; వారి వెర్రివేషాలకూ, పిచ్చిపిచ్చితలపులకూ ప్రోత్సాహమిచ్చింది; మీరు ఈయీ ఆదర్శాలు సాధించండర్రా అని వారికి ఏ ఆదర్శాలూ చూపించకపోయింది. అది అహంప్రత్యయాన్ని నేర్పగలిగిందే కాని వికాసాన్ని నేర్పలేకపోయింది

౧౯-వ శతాబ్దంలో ఈ ప్రాకృతిక సూత్ర పద్ధతియందు వ్యక్తిత్వం విషయమై కనపరచిన అతిమాత్రమైన ఊతంతో ౨౦-వ శతాబ్దమందు ఇంకొక కొత్తపరిణామం ఏర్పడింది. ఒకనిలోని ఒక వ్యక్తిత్వాన్ని మనం పెంచి పోషించవలెననుకొంటే ఆ మనిషి యే సంఘానికి చెందుతాడో ఆసంఘువిషయం కూడా మనం జ్ఞప్తిలో పెట్టుకోవలసివుంటుందని ఒక కొత్తసిద్ధాంతం వెల్లడిచేయబడింది. వ్యక్తిత్వాన్ని పట్టుకొని విద్యాసంబంధమైన ఒక శూన్యాకాశంలో పోషించడానికి సనేమిరావల్లకాదు. ఒక పిల్లవానిని ఒక ఉపాధ్యాయుడు తరిఫీదు గనక చేయవలెననుకొంటే ఆపిల్లవాని కర్మకాండ అంతా ఏసంఘానికోసమయితే ఉద్దిష్టమైయున్నదో ఆసంఘంలో వాడు సమ్మ్రసరిగా అతుకుకొని పోయేటట్టుగా వాని నతడు తరిఫీదుచేయాలి. తాను తరిఫీదుచేయదలచుకొన్న పిల్లవాడు ఒక ప్రజాస్వామికసంఘానికి చేరినవాడైవుంటాడనుకోండి. అప్పుడు వానికి ప్రజాస్వామికసూత్రాలను బాగుగా మప్పి అందులో వానిని బాగా తయారుచేయాలి. లేక వాడు ఒక వ్యవసాయకుటుంబానికి చేరినవాడైవుంటాడనుకోండి. అప్పుడు వానికి వ్యావసాయికజ్ఞానాన్నే విస్తారంగా నూరిపోయాలి. వర్తకవాణిజ్యాలబాపతయితే వాటిలోనే వానిని సవ్యంగా తయారుచేయాలి. ఏతావతా, ఏమితేలుతున్నదో

తెలుసునా? మనం పెంచి పోషించవలసింది కేవల నిరంజనమయిన వ్యక్తిత్వం కాదు. మరి యేమంటే? సాంఘిక వ్యక్తిత్వం. సాంఘిక వ్యక్తిత్వమంటే, మన వ్యక్తి ఏసంఘాని కయితే చేరివుంటాడో ఆసంఘం యొక్క సంబంధబాంధవ్యాలతో సమేతమైన వ్యక్తిత్వ మన్న మాట. ఈ సాంఘిక సమన్వయ సూత్రక్రమమే ఇటీవల ఇటీవల కేవలసాహిత్య, కేవలశాస్త్రీయ విద్యాస్థానాల్లో వృత్తి,సాంకేతికవిద్యలు తావేర్పరచు కోవడానికి ఆస్కారం కల్పించింది. సాంఘికయం త్రంలో తన స్థానమందు తాను కూర్చొని, అది సక్ర మంగా, సవ్యంగా ఆడేటట్టు చేయగల పూర్ణపురుషు డైన పౌరుడు ఈ సంప్రదాయవాదులకు ఆదర్శమూర్తి. అందువల్లనే ఈమధ్య కొన్ని సంవత్సరాలబట్టి ఎక్కడ చూచినా మనకు 'పౌరత్వానికి శిక్షణ, పౌరత్వానికి శిక్షణ' అనే కేకలు పదేపదే వినిపిస్తూవున్నాయి. ఈ సాంఘిక సూత్రపద్ధతి సర్వదుంబాలా రాజ్యాలలో దాని పరమావధిప్రమాణానికి వెళ్లింది. నాజీఫాసిస్టు రాజ్యాలలోనే చూడండి కావలిస్తే. అక్కడ పౌర త్వంకోసమై వ్యక్తులను తరిఫీదు చేయడ మనేది ఎంత సలక్షణంగా సాగిస్తూవున్నారో కొంత గమనిం చండి. వ్యక్తులనబడేవారందరూ రాజ్యాంగంలో తదే కంగా తన్మయు లయిపోతున్నా రనడమే అందుకు తగిన తార్కాణ. అక్కడ వ్యక్తులకు నావి అంటూ వేరే అభిప్రాయాలు లేవు; వేరే విశ్వాసాలు లేవు; వేరే ఆదర్శాలు లేవు. రాష్ట్రీయ అభిప్రాయాలే, రాష్ట్రీయవిశ్వాసాలే, రాష్ట్రీయాదర్శాలే వారి అభి ప్రాయాలూ, వారి విశ్వాసాలూ, వారి ఆదర్శాలున్నూ. ప్రత్యేకవ్యక్తులనేవారు బ్రహ్మాండమై, మహాగందర గోళమైన రాజ్యాంగయంత్రంలో నిర్దుష్టమైన చిన్న చిన్నచక్రాలుగా ఉండవలసినవారుమాత్రమే.

ఈసాంఘికసూత్రపద్ధతిమూలాన తలవనితలం పుగా వచ్చిపడ్డ ఈఫలితం ఇప్పుడు మళ్లీ కొత్తగా ఒక విద్యాహృదయాన్వేషణకు దారితీస్తున్నది. విద్య యొక్కలక్ష్యం కేవలమూ ఉన్నపాళానఉన్న వ్యక్తి త్వమూకాదు; ఉన్నపాళానఉన్న రాజ్యాంగపౌరత్వ మూకాదు అనిన్నీ, మరేమంటే, ఉండవలసినవ్యక్తిత్వ మూ, ఉండవలసినపౌరత్వమూ అనిన్నీ మళ్లీ క్రొత్త వక్కాణింపులు బయలుదేరాయి. అంటే, మరొక సూత్రపద్ధతికి—అయిదవదానికి అంకురార్పణ ఏర్పడిం దన్నమాట. ఈక్రొత్తదానిని ఆదర్శసూత్రపద్ధతి (Idealistic Theory) అనేపేరుతో పిలువవచ్చు. దీని అస్పష్టమైన నూతన స్వరప్రస్తారము ఇప్పటి కప్పుడే ఈ యుద్ధపు మసకచీకట్ల వెనకలనుంచి వినవస్తూవున్నది. మానవుడు కేవలమూ రాజ్యాంగం లోని ఒక పౌరుడుమాత్రమే కాడని తెలివిడి చేయబడింది. అతడు రాజ్యాంగంలోని ఒక పౌరు డయ్యేముందర మొట్టమొదట అతడు ఈవిశాలవిశ్వంలో ఒక కాపురస్థుడు. కాబట్టి ఈవిశ్వంలో తన స్థాన మేదో అతడు తెలుసుకోవాలి. జీవితానికి నిజమైన లక్ష్యమేమిటో, దానిని అందుకోవడానికి తాను ఏయే సాధనోపాయాలను అవలంబించవలెనోకూడా అతడు తెలుసుకోవాలి. వట్టి జీవితోపాయాలనుమాత్రమే కాక సుఖసుందరజీవితోపాయాలనుకూడా అతడు బడిచదు వులక్రింద నేర్చుకోవాలి. విద్యవల్ల వృద్ధిచేసుకోవలసి నవి అతని ప్రాకృతిక శక్తు లొక్కటిమాత్రమే కావు. ధర్మాధర్మవివేచన చేయగలగడానికిన్ని, ఎక్కువ తక్కువవిలువలు రూపించగలగడానికిన్ని, మలిదాన్ని కాకుండా తొలిదాన్నే అనుసరించగలగడానికిన్ని సాధనభూతమైన ఆధ్యాత్మికశక్తులనుకూడా వాటితో సరిసమానంగా వృద్ధిచేసుకోవాలి. వ్యక్తిత్వం అన్నంత మాత్రంచేత ఒక్క నైసర్గికమానవుని మహితస్వరూప కీర్తనమేకాదు; వానితో సరిసమానంగా ఆధ్యాత్మిక మానవుని మహితస్వరూపకీర్తనంకూడా దీని కిందికే వస్తుంది. మానవుడన్న ప్రతివానిలోనూ కొద్దోగొప్పో దైవికాంశ లేశమాత్రమయినా వుండనేవుంటుంది. ఏ రాజ్యాంగమయినా సరే, లేక ఏసంఘమయినా సరే దాన్ని తనతన అవసరానుకూలాలకు అనుగుణంగా లొంగదీసుకోవడానికి సుతరామూ సాధ్యంకాదు. సాంఘికవ్యక్తిత్వాన్ని తప్పక సమకూర్చుకోవలసిందే; అందుకు సందేహం ఎంతమాత్రమూ పనిలేదు నిజమే.

# నేటి యూరోపులోని విద్యావిధానాలు

కాని, ఆ సాంఘికవ్యక్తిత్వం సదా ఆధ్యాత్మికవ్యక్తిత్వానికి లోబడిందిగానే వుండిపోవాలి. రాజ్యంలో కొంతమందివ్యక్తులు రాజ్యాంగానికంటె ముందుదారి పట్టినవారు ఉండి, భావస్వాతంత్ర్యమూ వాక్స్వాతంత్ర్యమూకలవారై, రాజ్యాంగచక్రప్రవర్తకుల నిర్ణయాల సందర్భంలో తాము వారితో సమానంగా కూర్చోగలిగినవారు ఉంటేనే ఆరాజ్యం సక్రమపరిస్థితులమీద ముందుకు వెళ్లిపోగలుగుతుంది; శ్రేయస్సౌఖ్యాలకు ఉపకరణమూ కాగలుగుతుంది. కాబట్టి రాజ్యాంగం అనేది ఎన్నటికీ విద్యమీద గుత్తకు పుచ్చుకొన్నట్టుగా సంపూర్ణ పెత్తందారీ పెట్టుకోరాదు. అది చేయవలసిందల్లా ఏమిటంటే? కావలసింది కావలసినట్టు ద్రవ్య సహాయంచేయడమూ, జాతిమొత్తాని కంతటికీ చదువు సంధ్య లబ్బేటట్టు చూడడమూ, విద్యాసంస్థలు సక్రమంగా, చక్కగా, నేర్పుతో నిర్వహింపబడేటట్టు నిగా పెట్టివుండడమూ ఇవే వారు చేయవలసిందల్లా. లక్ష్యాలేమిటో, లక్షణాలేమిటో, పద్ధతులేవో, మార్గాలేవో మొదలైన తక్కిన తతంగాన్ని నిర్ణయించే పూచీ యావత్తూ వారు సమాజంలోని విషయజ్ఞులయిన పెద్దలబుద్ధులకే విడిచిపెట్టాలి.

పరిశీలన చేసి చూస్తే ఈ అన్ని పద్ధతుల్లోనూ సత్యాంశలు ఉన్నట్టే కనబడుతున్నది. కాని, మనకే గనక నిజంగా చక్కని విద్యాప్రణాళిక కావలసివున్నట్టయితే ఈ అన్నింటినీ ఏకసూత్రానికి తెచ్చి కలిపి వేయాలి. కేవల సారస్వతవిద్యగాని, కేవల శాస్త్ర విద్యగాని, కేవల సాంకేతికవిద్యగాని, కేవల పారిశ్రామికవిద్యగాని, లేదా కేవల మతనైతికవిద్యలుగాని మన కార్యసాధనకు ఉపకరించేవి కావు. పాక్షికమైన ఈ అన్ని పద్ధతుల్లోనూ చెప్పినట్టి యావత్తు విద్యాప్రణాళికల విశేషాలనూ ఒక్కసూత్రానికి తెచ్చి సమన్వయపరచి ఆచరణలో పెట్టవలసివున్నది.

ఆధునిక యూరోపీయవిద్యావిధానాల బాగోగులనుగురించి ఇంతవరకూ సవివరంగా చర్చించడమయింది. ఇప్పుడు ఈ యూరోపీయపద్ధతులనూ, భారతీయుల ఆచరణప్రచారణలనుబట్టి ఊహింపనయ్యన్న ప్రాచీనభారతీయవిద్యాపద్ధతులనూ పరస్పరంగా పోల్చిచూచి మంచి చెడ్డలను తేలుద్దాము. బాగా పరీక్షచేసి చూస్తే, బహుశా ఒక్క ప్రాకృతిక పద్ధతినిమాత్రం తప్పనిచ్చి మిగిలిన ఈ యావత్తు ఆధునిక పద్ధతులూ అలనాడు మన దేశంలో ఆదరించి అంగీకరించి ఆచరణలో పెట్టిన బాపతుగానే గోచరమవుతున్నది. ఇంకా ఒక మిక్కిలి ముఖ్యమైనవిషయ మేమిటంటే, యూరోపులో ఇటీవల ఇటీవలనే పొడచూపిన ఆదర్శపద్ధతి, సాంఘికపద్ధతు లనేవి ప్రాచీన భారతదేశంలో ఏనాడో అసలు విద్యాప్రణాళికకే మూలకందంగా వుంటూవచ్చాయి. తమ ఆశ్రమాలకో, లేక తమ గృహాలకో మూలమూలలనుంచి శిష్యగణాలను ఆకర్షించుకొంటూవచ్చిన మన సుప్రసిద్ధగురుకులపతులందరూ రాజ్యాంగసంబంధాలకు దూరులై సర్వస్వతంత్రులైన వ్యక్తులుగానే తమ గురుకులాలను నడుపుకొంటూవచ్చారు. ధర్మమే వారి అధ్యాపనలో కెల్లా సారములో సారముగా వుంటూవచ్చింది. శిష్యులుకూడా వారివారి కులానుసారంగా వారివారి పరిసరాల్లో సమ్మసరిగా ఇమిడిపోయేటట్టుమాత్రమే కాక అవసరమయితే ఆపరిసరాలను అభివృద్ధిచేసుకొనేటట్టుకూడా తరిఫీదు పొందుతూ వచ్చారు. బ్రాహ్మణజాతిఛాత్రులకు పురోహితులుగానో, లేక ఉపాధ్యాయులుగానో అయ్యేందుకు తగిన శిక్షణ ఇవ్వబడుతూవచ్చింది. అలాగే క్షత్రియశిష్యులకు యుద్ధవీరులుగానో, లేక పరిపాలకులుగానో అయ్యేందుకున్ను, వైశ్యశూద్రశిష్యులకు వారివారి వర్తక వాణిజ్యకృషి పరిశ్రమలలోనూ దానిదానికి తగిన శిక్షణ ఇవ్వబడుతూవచ్చింది. కాని, అందరి విషయంలోనూ అన్నిటా ధర్మమే సకలశిక్షణకూ మూలకందంగా వుంటూవచ్చింది. ప్రతివిద్యార్థికీ వృత్తిశిక్షణ ఇస్తూవచ్చారు. కాని, ఆ ఇవ్వడంమట్టుకు సర్వదా ఒక ఆదర్శాత్మకలక్ష్యంతోనే ఇస్తూవచ్చారు. ఉపనిషత్తులో మనము చూస్తూవున్నరీతిని ఆనాడు బ్రాహ్మణబాలురకు నేర్పుతూవుండిన విషయాల

పట్టీలనూ, రామాయణమహాభారతాల్లో మనము చూస్తూవున్న రీతిని క్షత్రియబాలురకు ఆనాడు నేర్పుతూవుండిన విషయాలపట్టీలనూబట్టిచూస్తే ఆ పాఠ్యప్రణాళికలలో వారివారి వృత్తివిద్యలేకాక వాటికి తోడు సారస్వతవ్యాసంగమూ, ఆనాటి శాస్త్రాల చదువూ కూడా కలిసియుండినట్టు కనబడుతున్నది. ఉదాహరణకు కావలిస్తే ఛాందోగ్యోపనిషత్తులోని ఈకథను చిత్తగించండి.

ఒకనాడు నారదుడు సనత్కుమారునివద్దకు వెళ్లి తనకు చదువు చెప్పమని అడిగాడట. అడిగితే, ఇంతవరకూ నీవేమేమి చదువుకొన్నావో, ఏయేవిషయాలు తెలుసో చెప్పమన్నాడట సనత్కుమారుడు. నారదుడు తనకు తెలిసినవన్నీ ఒక పట్టీకట్టి చెప్పాడట. ఆపట్టీలో ఒక్క వేదాలుమాత్రమేకాక ఆనాటికి సారస్వతగ్రంథాలుగా ఉంటూవచ్చిన ఇతిహాసాలూ, పురాణాలూ, ఆనాటికి శాస్త్రాలుగానూ, ఇతరకళలుగానూ వుంటూవచ్చిన జ్యోతిర్గణితాలూ, తదితర అనేకవిద్యలూకూడా కనిపించాయి. ఇన్ని విద్యలు నేర్చి, ఆనాటి సారస్వతంలోనూ, ఆనాటి శాస్త్రాల్లోనూ ఇంతపరిజ్ఞానం సంపాదించీకూడా తనకు ఆత్మజ్ఞానమనేది ఒకటి లభించకపోబట్టి తన చదువు పూర్తిగా ముగియనట్లే నారదుడు తలపోశాడు.

జ్ఞానం అబ్బినవారికి మరి దుఃఖాలే వుండవని ఆయన ఎవరో చెప్పగా వినివున్నాడు. ఇన్నిచదువుల్లో ఆరితేరి ఇంత జ్ఞానభాండారం ఆర్జించివున్నా ఆయన ఇంకా దుఃఖాలకు దూరుడు కాలేకపోయినాడు. అందుకోసమని ఆయన విద్యలలోకెల్లా విశిష్టవిద్య అయిన ఆత్మవిద్య నేర్చుకొందామని వెళ్లి సనత్కుమారుని ఆశ్రయించాడు.

ఈకథవల్ల మనకు ప్రాచీనభారతదేశంలోని విద్యాప్రణాళిక ఆదర్శాలన్నీ స్పష్టంగా తెలియవస్తున్నాయి. ఆనాటి విద్యాప్రణాళికలో కనిపించిన లోపమల్లా ఒక్కటే. అది యావద్దేశప్రచార దృష్టితో సాగకపోయింది; పూర్తిగా కులవిచక్షణలతో కొనసాగింపబడింది. అందువల్ల అది ఇంచుమించు అనేకసందర్భాల్లో తొంభైతొమ్మిదిపాళ్లు వృత్తివిద్యలతోనే పర్యవసిస్తూవచ్చింది. అది యెల్లాగయినా పోనివ్వండి కాని ప్రాచీనభారతదేశంలోని విద్యాప్రణాళిక తన ఆదర్శాత్మకమైన గాడినుండికాని, వృత్తివిద్యాప్రధానమైన మూలసూత్రంనుంచికాని ఏనాడూ దాటిపోయి దారితప్పి యెరిగింది లేదు. కుంఫిణీప్రభుత్వం బ్రిటిషుఇండియాలోని విద్యావిషయకసమస్యలను స్వయంగా చేపట్టడానికి పూర్వం—మొన్నమొన్నటి ౧౯-వ శతాబ్ది ప్రారంభంలోకూడా మన యావత్తు గ్రామాలయందూ చిరకాలంగా నెలకొనిపోయివుండిన ప్రాచీనపాఠశాలలు తమ పాతసంప్రదాయాలను లేశమయినా వదలకుండా ఆ వెనుకటి పాఠ్యక్రమాన్నే గట్టిగా అంటిపెట్టుకొని, పల్లెటూరి పిల్లలకు యథాప్రకారంగా వ్రాతా, చదువూ, పల్లెటూరి లెక్కాచారాలూ, గ్రామసీమలను గురించిన లోకజ్ఞానమూ, ఈ అన్నిటికీ మించి ఇతిహాసపురాణాలమూలంగా ధర్మబోధా ఇత్యాది విషయాలను నిరాఘాటంగా సాగిస్తూనేవుండినాయి. అటుపిమ్మట మన దేశచరిత్రలో బ్రిటిషుయుగం ప్రారంభమయింది; ప్రాచీనకాలపు విద్యాబోధనపద్ధతులన్నీ అడుగంటిపోయాయి. నేటి మన పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ నేర్పబడుతూవున్న విద్య (ఇతరలక్షణాలు ఎన్నివుంటేనేమిగాక) వృత్తివిద్యాత్మకమూ, ఆదర్శస్వరూపమూ అయిన తన ఆధారంనుంచి పట్టుతప్పిపోయి వేరుదారిపట్టింది. నిర్జీవమైన ప్రణాళికలతో వేలారుమంది నిరుద్యోగియువకులను తయారుచేసి, వారి సెందుకూకొరగానివారినిగా, ఏలాంటి జీవితతత్వాలూలేనివారినిగా తరిఫీదుచేసి పాడుచేసింది.

# దాశరాజ్ఞ యుద్ధము

## ఋగ్వేదకాలమునా సమరసన్నాహ సూత్రపద్ధతులు

•

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

భారతీయ సంగ్రామ చరిత్రను వివేచించుచున్నప్పుడు ఋగ్వేదమునందలి దాశరాజ్ఞ యుద్ధము ప్రప్రథమమున మన దృష్టిని ఆకర్షించుచున్నది. ఆర్యజాతుల విజ్ఞానమునకు ఋగ్వేదము ఓంకారప్రాయమైనది. దీనిలో ప్రశంసింపబడిన దాశరాజ్ఞయుద్ధము ఆర్యుల చరిత్రలో మనకు లభించుచున్న మొదటి గొప్ప సంగ్రామ మగుచున్నది. ఇది చారిత్రకమైన యుద్ధమనుటలో పాశ్చాత్యవిద్వాంసులు కూడ ఏకీభవించుచున్నారు. దాశరాజ్ఞవృత్తాంతము ఇంద్ర వృత్రుల విరోధమువలె రూపకల్పనామాత్రము కాదు. ఆ యుద్ధాంశములు నేడు మనకు సంపూర్ణముగా అవగతము కాకపోవుచున్నను ఇట్టి సంగ్రామము జరిగె ననుటలో భేదాభిప్రాయము లేదు. ఇందు వర్ణింపబడిన సన్నివేశములు, ఉభయకక్షలయందలి సాంయుగీనులు వేసినఎత్తుపై యెత్తులు, తత్ఫలితములు అన్నియు మానవవ్యాపారములుగానే కన్పించుచున్నవి, వానియందు అతీంద్రియశక్తులు, అమానుష వ్యాపారములును లేవు. కావున దాశరాజ్ఞయుద్ధము కేవల వాస్తవికచరిత్రగా మనము చర్చించి ఋగ్వేదకాలమునందలి యుద్ధసంప్రదాయములను కొంతవరకైనను మనసా దర్శింపవచ్చును.

దాశరాజ్ఞయుద్ధమును "దశభి రాజభి స్సహ యుద్ధం- పదిమంది రాజులతో నైన యుద్ధ"మని సాయణాచార్యుల వారు నిర్వచించిరి. ఇందు సుదాసు డను జయశీలియైన ఆర్య ప్రభువు ఒక వంకను, అతని ప్రతికక్షులైన దాశరాజ్ఞమండలి యొకవంకను సాంయుగీను లై యుండిరి. ఋగ్వేదము సప్తమ మండలమందలి ౧౮,౩౩,౮౩ సూక్తములలో ఈ యుద్ధ ప్రశంస కలుగుచున్నది. ఋగ్వేదభాష అత్యంతప్రాచీనమై జటిలముగా నుండుటచే ఆసూక్తములందలి నిగూఢార్థము విద్వాంసులనుకూడ చాల చిక్కుపెట్టుచున్నది. అదిగాక ఈ యుద్ధవృత్తాంతము అక్కడ ప్రకరణవశమువలన వచ్చినదే కాని సాక్షాత్తుగా దాశరాజ్ఞ యుద్ధమును వర్ణించుట ఋషియభిమతము కాదు. వసిష్ఠవంశీయుడైన ఋషి ఇంద్రుని స్తోత్రము చేయుచున్నాడు. ఆ సందర్భములో దాశరాజ్ఞ యుద్ధమందు సుదాసునికి లభించిన యఖండ విజయము ఇంద్రప్రసాదలబ్ధ మని సూచించుట, ఆ ఇంద్ర ప్రసాదము వసిష్ఠమహర్షియొక్క ఆమోఘ ఋక్కుల ఫలిత మని చెప్పుట కవియొక్క ప్రధానోద్దేశము. ఇక్కడ కవిప్రయోగించిన ఉపమానము మిక్కిలి మనోజ్ఞముగానుండుటచే విడుచుటకు మనసు ఒప్పకున్నది. "ఓ ఇంద్రుడా ! తృణసమృద్ధమైన గోష్ఠములో నున్న ధేనువువలె సుహవిష్కమైన యజ్ఞశాలయం దున్న నిన్ను (ధేనువువంటివానిని) కోర్కెలు పితుకుటకై వసిష్ఠమహర్షి వత్సస్థానీయములైన స్తోత్రములను ( ఆవు చేపుటకు దూడ అవసరము గదా ! ) నిర్మించెను." అస్తు. దాశరాజ్ఞ యుద్ధమును గురించి ప్రాసంగికముగా దొరికిన ప్రశంసలను ఏకత్ర అన్వయించి ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసులు ఈ యుద్ధక్రమమును మసకమసకగానైనను ఊహించ గల్గిరి. అసంపూర్తియైన ఈ చిత్రమే ఋగ్వేదకాలమునందు యుద్ధకౌశల్యము ఎంత నిశితముగా ఉండెడిదో చూపుటకు చాలును.

సుదాసు డను రాజు ఋగ్వేదమునందు మిక్కిలి ప్రసిద్ధి వహించి యున్నాడు. ఆకాలపు గొప్ప విజేతలలో సుశ్రవుడు, త్రసదస్యువు మున్నగువారి పేళ్లు వినవచ్చుచున్నవి. సుశ్రవు డను రాజుపై ఇరువదిమంది శత్రురాజుల సమూ

హము కత్తిగట్టి పోరాడి అతనిని జయించలేక పరాజయ మొందెనట. పురుకుత్సుని కుమారుడు త్రసదస్యువు అసహాయశూరుడు. అతడు పరాక్రమమునందు రెండవ ఇంద్రుడని, అర్ధదేవుడని అతని సమకాలికులు తలచు చుండిరి. సుదాసుడుకూడ ఈ మహావీరుల శ్రేణికి చెందిన వాడే. సుదాసుని పూర్వుడైన దివోదాసుడు మహా యుద్ధ లంపటుడు. ఆతడు ఆర్యానార్య వర్గములపై అనేక విజయ ములను సాధించెను. యదువులతోను, తుర్వశులతోను దీర్ఘ కాలము పోరి వారిని జయించుటయే కాక శంబరు డను అనార్య నాయకుని నిర్జించి అతని దుర్గశతమును విధ్వంస మొనర్చెను. ఆర్యవిజేత లందరును తాము ఇంద్రుని ప్రత్యే కానుగ్రహమునకు పాత్రుల మని తలంచుచు తమ విజయము లను ఇంద్రుని కారోపించుచుందురు. దివోదాసుని ఘనకార్య ములలో పణిజాతివారిని, పారావతులను జయించుట పేర్కొన దగినవి. దివోదాసుడు మహావిజేతయేకాక గొప్ప దాత యై అతిథిసత్కారమునకు పేరొంది 'అతిథిగ్వు'డని బిరుదు గాంచెను. అనేక సంగ్రామ విజయియైన దివోదాసుడు ఒక పర్యాయము వర్షను లను గణమువారి ప్రభువైన తుర్వయాను నిచే ఓటమిని పొందెనట.

సుదాసుడు దివోదాసుని కుమారుడని కొందరును, మనుమ డని కొందరును తలంతురు. ఈతనికి పైజవను డని నామాంతర ముండుటచే అతడు పిజవనుని పుత్రు డని తోచు చున్నది. పిజవనునకే దివోదాసు డని మరియొక నామ ధేయముగా సాయణాచార్యులు వచించిరి. మరియు ఋగ్వే దము ౭-౧౮ లో 'దివోదాసం న పితరం సుదాసః' అని యుండుటచే ఈతడు దివోదాసుని కుమారుడే యని నిశ్చ యించుట యుక్తము. సుదాసుడు ఉత్సాహశాలియైన రాజ న్యుడు. దివోదాసు డారంభించిన విజయపరంపరను అతడు అందుకొని తన విజయధ్వజమును శుతుద్రి నదికి తూర్పున ప్రతిష్ఠించెను. ఋగ్వేద కాలమున సప్తసింధుదేశములో పెక్కు స్వతంత్రులైన ప్రజాసమూహము లుండెను. వారిలో పంచజను లనబడు యదు, తుర్వశ, అను, ద్రుహ్యు, పూరు సంఘములు ముఖ్యము లైనవి. వీ రందరును స్వతంత్రులై, దేశము బహునాయకముగా నుండెను. వీరు గాక అనేక మంది అనార్య తెగలవారు స్వతంత్రాధిపత్యము కలిగి యుండి ఆర్యులతో ఒక్కొక్కప్పుడు సమఉజ్జీగా పెనగు లాడుచు ఆర్యులకు ఉపద్రవము కల్గించుచుండిరి. వీరిని య్యులు దాస, దస్యు అని పిలుచుచుండిరి. దేశమున శాంతి నిష్పచ్చరమై అంతఃకలహములు, రక్తపాతము దైనం దిన వృత్తాంతముగా ఉండెను. ఎంత శాంతుడైన ఋషి కైనను ఆత్మరక్షణకై, స్వధర్మ రక్షణమునకై వీరచరితము విధిగా అనుష్ఠింపవలసియుండెను. రణకండూతి గల క్షత్రియ కుమారులకు అకాలమున చేతినిండ పని యుండి యుండును. దూరదృష్టి గల కొందరు రాజన్యులు తమ బాహుబలముచే చిల్లరప్రభుత్వములను అంతమొందించి ఏకచ్ఛత్రాధిపత్యము నెలకొల్పుటకు యత్నించుచుండిరి. దివోదాసుడు, సుదాసుడు మున్నగు ఆర్యవీరులు సప్తసింధుదేశమునందు ఏకైకప్రభు త్వము స్థాపించు వ్యవసాయము చేయువారివలె కాన్పింతురు. సుదాసదివోదాసులు తృత్సుతెగకు అధిపతులు. తృత్సులకే భరతు లని మరియొక పేరని సాయణులవారి నిశ్చయము. తృత్సుభరతులు వేర్వేరు గణములని కొందరు ఆధునిక విద్వాంసు లభిప్రాయపడుచున్నారు. సుదాసదివోదాసుల యాధిపత్యమున తృత్సుభరతగణమువారు బలవంతులై ఏకై కాధిపత్యమును స్థాపింపజూచుట తదితరపంచజనులకును, పలువురు అనార్యతెగలవారికిని సహింపరానిదిగా నుండెను. తృత్సుభరతులు మొట్టమొదట 'పూరు' తెగవారిలో ఒక ఉపశా ఖగా నుండి క్రమముగా విజృంభించిరి. వారు తమ జనక శాఖను వెనుకత్రొక్కిపైచి స్వతంత్రులై దేశవిజయము చేయుచుండుట పూరుగణమునకుకూడ కంటకముగానే యుండెను.

ఆర్యసంస్కృతిని సప్తసింధుదేశమునకు తూర్పున ఉన్న జనపదములలో వ్యాపింపజేయుటయు ఆర్యవిజేతల ప్రధానోద్దేశములలో ఒకటి. అక్కడ నివసించు ఆర్యేతర జాతులవారిని ఓడించి వారి సంపదను ఇంద్రకైంకర్యముగ తాము చూరగొనుట సహజమనియే ఆనాటి యార్యులు విశ్వసించిరి. "యువాం నరా పశ్యమానాస ఆప్యం ప్రాచా గవ్యంతః పృథు పర్శవో యయుః"-ఓ ఇంద్రావరుణులారా, మీ బంధుభావమును చూచుకొని గోవులను ఇచ్ఛించుచు (జనులు) పృథుపర్శవులై తూర్పు దిక్కునకు పోవుచు న్నారు అని వసిష్ఠుఃస్తుతించుచున్నారు. విశ్వామిత్రమహర్షి ఇంద్రు నిట్లు సంబోధించినాడు: "ఓ ఇంద్రా! కీకటములలోని ఆవులు నీ కెట్లు ఉపచరించుచున్నవి? సోమరసముతో కలు పుటకు అవి పాలను ఇచ్చుటలేదు. వానిని మాకు ఇమ్ము" కీకటములు అనార్యదేశములు, ఆదేశవాసులు నాస్తికులు. యజ్ఞముచే ఇంద్రుని కొలువరు. కావున వారి దేశములను, సంపదలను జయించుటకు ఆర్యులు ఉవ్విళ్లూరుచుందురు.

సుదాసు డిట్టి విజయయాత్రికులలో మొనగాడు. పైకారణము లచే ఆతనికి ఆర్యసంఘమునందును, అనార్యులందునుకూడ పెక్కుమంది శత్రువు లైరి, వారందరు కలిసి యాతని విజృంభణమును తలద్రుంచవలెనని చేసిన ప్రయత్నమే దాశరాజ్ఞయుద్ధముగా పరిణమించినది. సుదాసుని విజయప్రవాహము నరికట్టుటకై పదిమంది రాజులు ఒక బలవత్తరమైన కూటమిగా ఏర్పడిరి. వీరిలో ఆర్యులును, అనార్యులునుకూడ గలరు. "దశ రాజానః సమితా అయజ్యవః సుదాసమింద్రావరుణా నయుయుధుః" (౭-౮౩-౭) దాశరాజ్ఞులందరు అయజ్యువులు. అనగా యాగము చేయనివా రని చెప్పబడినది. కాని శత్రువులగుటచే వారందరు అయజ్యులని పిలువబడియుండవచ్చును. దాశరాజ్ఞమండలిలో యదువులు, తుర్వశులు, పూరులు, శిమ్యులు, అజులు, శిగ్రులు, యక్షువులు మున్నగు పలుగణములవారు పాల్గొనినట్లు తెలుచున్నది. భేదనామకుడగు అనార్యనాయకుడు సుదాసుని శత్రువర్గములో ప్రముఖుడుగా కన్పించుచున్నాడు.

దాశరాజ్ఞకూటము ఏర్పడుటకును, తత్ఫలితమైన మహాయుద్ధమునకును ప్రత్యక్షకారణ మేమి టను విషయముపై వైదికవిద్వాంసులు భిన్నాభిప్రాయులై యున్నారు. మాగ్డొనెలు, కీతు మున్నగు పాశ్చాత్యవిద్వాంసులును, అవినాశ చంద్రదాసు మున్నగు భారతీయవిద్వాంసులును విశ్వామిత్ర మహర్షియే దాశరాజ్ఞమండలి ఏర్పడుటకును, తద్వినాశమునకును కారణభూతు డని నిశ్చయించియున్నారు. విశ్వామిత్ర మహర్షికి సుదాసునిపై క్రోధ మెందుకు జనించెను? ఆతని వినాశమునకై విశ్వామిత్రుడు దాశరాజ్ఞుల నేల సంగతము చేసెను అనుదానికి వారి సమాధాన మిది. విశ్వామిత్రుడు మొదట సుదాసుని పురోహితుడు. ఏకారణముచేతనో ఆరాజు ఈతనిని పౌరోహితినుండి తొలగించి ఆపదవియందు వసిష్ఠ మహర్షిని ప్రతిష్ఠించుటచే కుపితుడైన యాఋషి సుదాసుని శత్రువులపక్ష మూని యాతనిని శిక్షించుటకై కడగెను. దాశరాజ్ఞయుద్ధము నడచునప్పుడు వసిష్ఠులే సుదాసుని పురోహితులు. వసిష్ఠద్వేషియైన విశ్వామిత్రుడు సుదాసుని శత్రువుల వంక మరలుటయు సహజము. ఈవాదము పైకి యుక్తియుక్తముగానే తోచినను లోతుగా తరచిచూచినయెడల నిరాధారమైన దని తేలును. సుదాసుని పౌరోహిత్యమునందు వసిష్ఠులు ముందువారా, విశ్వామిత్రుడు ముందువాడా యని విచారించుట యావశ్యకము. సుదాసుని తండ్రి దివోదాసునకు భారద్వాజులు పురోహితులు. సుదాసుడు ఏకారణముననో వీరిని తప్పించి వసిష్ఠులను పురోహితులుగా వరించెను. ఈ పదవిలో విశ్వామిత్రుడు మొం దున్నట్లు నిదర్శనము లేదు. దివోదాసునకు ప్రతర్దను డను మరియొక కుమారు డుండె ననియు, భారద్వాజ ఋషులు తండ్రిసింహాసన మాతని కిప్పించుటకు పాటుబడి రనియు, ఆకారణముచే సుదాసుడు వారిపై అలిగి వారిని తన పురోహితులుగ స్వీకరింపలే దనియు, ఆచార్యక్షేత్రేశ చట్టోపాధ్యాయగారు వివరించినారు. కాలాంతరమున సుదాసుడు వసిష్ఠులనుకూడ త్రోసిరాజని విశ్వామిత్ర మహర్షిని తనకు పురోహితునిగ జేకొనెను. ఇట్లు బ్రహ్మర్షిని అవమానించినందుకే మనుస్మృతికారుడు మున్నగువారు సుదాసుని బ్రాహ్మణనిందకులలో చేర్చుట తటస్థించెను. దీనినిబట్టి విశ్వామిత్రుడు ఆనంతరికు డగుచున్నాడు కాని సుదాసపౌరోహిత్యమునందు వసిష్ఠపూర్వుడు కాడు. అట్టిచో నాతడు దాశరాజ్ఞమండలిని రేపుటయు పొసగదు.

విశ్వామిత్రమహర్షికి దాశరాజ్ఞకూటములో చేయి లేదనుటకు మరికొన్ని ఉపపత్తులను చట్టోపాధ్యాయ పండితుడు పేర్కొనెను. ఈ ఋషి తాను స్వయముగ భరతుల శాఖకు చెందినవాడు. తన పౌరోహిత్యమున భరతపుత్రులు విశేషశూరులై మహావిజేతలై నెగడిరని చెప్పుకొన్నాడు. తాను సుదాసుని పురోహితుడు కాకముందు భరతులు వెనుకంజ వేయుటే గాని ముందుకు చొచ్చుకు పోవుట ఎరుగరనియు, తాను ఆపదవి స్వీకరించగనే వారు యుద్ధమందు గుఱ్ఱములను ముందుకు పరుగెత్తించుచు ఎక్కుపెట్టబడిన యల్లెత్రాడువలె విహరింతు రనియు చెప్పెను. వసిష్ఠులును తమ పౌరోహిత్య మాహాత్మ్యమును ఇట్లే యుగ్గడించుకొనిరి, "దండా ఇవోద్గో అజనాస ఆసన్ పరిచ్ఛిన్నా భరతా అర్భకా సః, అభవచ్చ పురాఏ తావసిష్ఠ ఆదిత్తృత్సూనాం విశో అప్రథంత". భరతప్రజలు అవుంకాపరుల చేతి కఱ్ఱలవలె అర్భకులై శత్రువులచే పరిభవింపబడుచుండిరి. వసిష్ఠులు పురోహితత్వము స్వీకరించగనే తృత్సులు అభివృద్ధి నొందిరి, విశ్వామిత్రుని ఆధ్వర్యమున భరతులు విజృంభించినచో ఆతడు వారిని దాశరాజ్ఞయుద్ధములో నాశము చేయుట పొసగదు. విశ్వామిత్రుడు తన భరతవీరులను సుదాసునిపై నడిపించినచో ఆతడు తూర్పు నుండి పశ్చిమాభిముఖముగ వెడలవలసియున్నది. ఏలన దాశరాజ్ఞమండలి తూర్పునుండి పశ్చిమముగా నడచినది. సుదాసుని వీరులు ప్రాఙ్ముఖముగా పోవుచున్నారు.

'ప్రాచా గవ్యంతః యయుః' అని చెప్పబడుటచేత విశ్వామిత్రుడు భరతపుత్రులను ప్రాఙ్ముఖముగ కొనిపోయినట్లు ఋగ్వేదము (౩-౩౩) లో చెప్పబడినది. ఈ సూక్తమునందు ఆఋషికిని విపాశ, శుతుద్రినదులకును జరిగిన మనోజ్ఞమైన సంభాషణ వర్ణింపబడినది. సుదాసుని భరతవీరులకు అగ్రేసరుడై విశ్వామిత్రు డీనదీద్వయమును దాటఁగోరి వానిని స్తుతించెను. ఈవిధముగ చూచినను ఆతడు ప్రాఙ్ముఖముగ భరతులను నడపెనేగాని పశ్చిమాభిముఖముగ, సుదాసునికి వ్యతిరేకముగా సైన్యములను నడపలేదు. కావున దాశరాజ్ఞమండలితో నాతనిని ముడిపెట్టుటకు ఆధారములు లేవు. అయితే దాశరాజ్ఞులను రెచ్చగొట్టిన దెవరు? బహుశః సుదాసుని పూర్వపురోహితులైన భారద్వాజులే మో.

ఇట్లు జిగీషులైన సుదాసునకును, ఆతని ప్రతికక్షులకును వైరము రగిలిరగిలి యుద్ధాగ్నిగా ప్రజ్వరిల్లెను. దాశరాజ్ఞ మండలివారు మహాసన్నాహముతో ప్రచండసైన్యములను గూర్చుకొని పరుష్ణి(రావి)నదికి దక్షిణతీరమున విడిసిరి. సుదాసుడు తన సైన్యములతో అసిక్ని (చీనాబ్) పరుష్ణి నదుల యంతర్వేదిని జేరెను. ఆతనిని ఇట్లు దూరదూరముగ ముందుకు ఆకర్షించుటకు దాశరాజ్ఞీయులే ఒక ఎత్తు పన్ని యుండవచ్చును. ఋగ్వేదము (౭-౧౮-౬) లో తుర్వశుడను రాజు మత్స్యజనపదములను బాధించె ననియు, సుదాసుని గోధనమును హరించుటకు యత్నించె ననియు సూచింపబడినది. ఆతనిని భృగువులు, యక్షువులు అనుగమించిరి. మహాభారతమునందు కౌరవులు పాండవుల నజ్ఞాతవాసమునుండి బయలుపరచుటకై మత్స్యదేశముపై దాడి సల్పి గోవులను బట్టుకొనిరి. పైన చెప్పబడిన మాత్స్యులు సుదాసుని మిత్రులైయుందురు. వారి సంరక్షణమునకై సుదాసుడు తన రాజ్యముయొక్క కాపుదలనుండి దూరమయి అసిక్నిపరుష్ణినదుల నడిమిదేశమున విడిసియుండును. కౌరవులు విరాటునిపై సుశర్మను ప్రయోగించినట్లే దాశరాజ్ఞనాయకులు మాత్స్యులపై తుర్వశుని గవియించిరి. భృగువులును, యక్షువులును నీళ్లలోని చేపలవలె తుర్వశునితో ఆశు ప్రాప్తిని గావించిరట. అనగా చేపలవలె అవిదితసంచారులై మత్స్యదేశముపై పడియుందురు. కాని ఈప్రయత్నము విజయవంతము కాలేదు. మాత్స్యుల గోధనములను ఇంద్రుడు శత్రువులనుండి విడిపించినట్లు ౭-౧౮-౭ లో సూచన గలదు. ఈఋక్కులో పేర్కొనబడిన పక్థసులు, అవినాసులు, భలానసులు. విషాణినులు మున్నగువారు సుదాసుని మిత్రకక్షీయులగు గణము లని ఆధునికవిద్వాంసు లూహించుచున్నారు. వీరందరును యాగమునందలి ఋత్విక్కులని సాయణులవారు అన్వయించిరి. ఇంద్రుడు తన కిష్టమిత్రుడైన సుదాసుని రక్షించె ననుటచే తుర్వశుని సంహరించెనని యూహింపబడుచున్నది. తుర్వశుడుబయలుదేరిన గోహరణయాత్ర ఆతని పరాజయముతోను, మృతితోను పర్యవసించి యుండును.

అట్లు అసిక్నిపరుష్ణినదులనడుమ విడిసి బహుశః తన సైన్యముతో ముందుకు నడువదలచిన సుదాసునిపై ఆతని శత్రువర్గమువారు వజ్రాయుధమువంటి గొప్ప పన్నుగడను ప్రయోగించిరి. పరుష్ణినదీ ప్రాంతభూములు పల్లములో నుండెను. ఆనదీప్రవాహములచే దేశోపద్రవము కలుగకుండ ఎత్తైన గట్లు పోసియుందురు. ఆ గట్లను తెగగొట్టినచో నదీజలములు పరిసర ప్రాంతములపై పడి ముంచెత్తి మహోపద్రవము కల్గించును. పల్లపు ఊళ్లన్నియు కొట్టుకొనిపోయి మనుష్యులకును, జంతువులకును నిలువ నీడ లేకపోవును. వెల్లువలచే గోదావరినదిగట్లు త్రెంచి ప్రవహించినప్పుడు గలుగు ప్రాణనష్టము ఇప్పటికిని ఎల్ల రెరుంగుదురు. కావున పరుష్ణినదియొక్క గట్టులను తెగగొట్టి దేశమును జలార్ణవము చేసి సుదాసుని, ఆతని సైన్యమును ఉవ్వెత్తుగ అపోశనముపట్టవలెనని దాశరాజ్ఞప్రభువులు నిశ్చయించిరి. మానవజాతియొక్క శైశవమునందే ఇంతటి గొప్ప పన్నుగడను పన్నిన దాశరాజ్ఞనాయకుల కూటయుద్ధ సామర్థ్యమునకు ఆశ్చర్యపడమా! మానవు డప్పుడు. ఇప్పుడుకూడ శత్రువినాశమునకై ఎంతటి ఘోరమునకైనను వెనుదీయడని సమాధానము చెప్పుకొనమా? సుదాసుని వినాశమునకై దాశరాజ్ఞీయులు నిరపరాధులైన ప్రజాసమూహములను కూడ ముంచెత్తుటకు వెనుదీయలేదు. దాశరాజ్ఞ యుద్ధముకూడ "టోటల్‌వార్" కాబోలును! "దుష్టాభిసంధులును, మందమతులును అగు సుదాసుని శత్రువులు అదీనమైన పరుష్ణీనదియొక్క కూలభేదమును గావించిరి. సుదాసుడు మాత్రము ఇంద్రప్రసాదలబ్ధమైన మహిమచే వెంటనే పృథివిని పొందెను. అనగా ప్రవాహములో కొట్టుకొనిపోలేదు. చయమానుని కొడుకు కవి యనువాడు యజ్ఞపశువువలె సుదాసునిచే చంపబడి దీర్ఘనిద్ర నొందెను" (౭-౧౮-౮)

దాశరాజ్ఞీయులు అమోఘమని ప్రయోగించిన ఎత్తుగడ వా రనుకొన్నంత ఉపద్రవమును సుదాసునకు గాని, ఆతని సైనికులకుగాని కలించినటు తోచదు. దీనికి కారణ మేమె

యుండునో. సుదాసుడు వారి ఉద్యమమును ముందే ఎఱిగి వెనుకకు సుదూరము తగ్గియుండును. ఇదియే ఆతని పురోహితుడైన వశిష్ఠు లొసంగిన సలహాయైయుండును. మరియు తమ స్తోత్రములచే ప్రసన్నుడై ఇంద్రుడు సుదాసుని రక్షించెనని వసిష్ఠులవారు చెప్పుచున్నారు. మరియొక కారణము అది వర్షాకాలము కాకపోయి ఉండవచ్చును. పరుష్ణీనదిలో గంభీరమైన ప్రవాహము లేదేమో. కావుననే మరియొక ఋక్కులో ఇట్లు వర్ణింపబడినది: "ఇంద్రుడు పరుష్ణీనది గట్టులను తిరిగి సంధించెను. నదీజలములు తమ యథాస్థానమైన నదీ గర్భమునే ఆశ్రయించెను గాని ప్రక్కన ఉన్న పల్లపుప్రదేశములపై పోలేదు. వాచాలురైన శత్రువులు సపుత్రకముగా ఇంద్రప్రసాదముచే సుదాసునికి వశులైరి." సుదాసుడు సకాలములో తిరోగమనము చేసి తనను, తన సైన్యమును సర్వనాశమునుండి తప్పించుకొనెను. దీనిని యుక్తితిరోగమన మని చెప్పవచ్చును. వసిష్ఠులవారి సలహాపై ఇట్లు వెనుదిరిగినందుకే కాబోలు అనంతర కాలములో పురోహితుడైన విశ్వామిత్రుడు వారిని ఆక్షేపించుచు "భరతపుత్రులు నేను రాకముందు తిరోగమనమునే గాని పురోగమనమును ఎఱుగరు" అని సగర్వముగ చాటెను.

దాశరాజ్ఞయుద్ధము అనంతర మేరీతిని పరిణమించెనో నిర్ణయించుట సులభము కాదు. వాసిష్ఠులు తమకు యాజ్యుడైన సుదాసుని విజయమునే వర్ణించిరి గాని ఆవిజయ మెట్లు కలిగెనో సక్రమాంశములతో నిరూపించలేదు. అనంతర యుద్ధగతిని గురించి డాక్టరు అవినాశచంద్రదాసుగారు ఇట్లు ఊహించుచున్నారు: "సుదాసుడు పరుష్ణీనదికి దక్షిణతీరమందున్న శత్రువుల కనుబ్రామి హఠాత్తుగా నదిని దాటి దాశరాజ్ఞ ప్రభువులను వెనుకనుండి చుట్టుముట్టెను. శత్రువర్గము పరాకుగ నుండుటచే సమూలముగా సంహరింపబడెను. అలెగ్జాండరు జీలము యుద్ధములో పురుషోత్తమునిపై ప్రయోగించిన హఠాద్విక్రాంతినే సుదాసుడు దాశరాజ్ఞమండలిపై ప్రయోగించెను" కాని శ్రీ దాసుగారి యూహ సయుక్తికముగ తోచదు. సుదాసుని ప్రస్తుతస్థితి విక్రాంతి సలుపుటకు తగినంత బలవత్తరముగా లేదు. కావున అలెగ్జాండరుయుద్ధసాదృశ్యము ఇక్కడ పొసగదు. సుదాసుని పార్ష్ణిదేశము (Rear) నిరుపద్రవముగ నుండలేదు. సుదాసుని శత్రువర్గములోనివాడును, బలవత్తరుడును అగు భేదుడను అనార్యనాయకుడు యమునాతీరమునందు ఇంకను ప్రబలుడైయుండెను. ఈనది మధ్యదేశమందలి యమునానది కాదు. అసిక్ని (చీనాబ్) నదికే ప్రాచీన[illegible] ఉండెనని హాప్కిన్సుపండితుడు చక్కగా ఊహించెను. భేదుడు ఇంద్రుని [illegible]తము చేసినవారిని ఛేదించుచుండెను. ఈ అనార్యవీరుడును, అతని సైన్యమును ఇంకను క్షేమముగా ఉండగ సుదాసుడు పరుష్ణినది కావలియొడ్డున ఉన్న అరాతులపై విక్రమించియుండజాలడు. [illegible]సుని వామభాగము కూడ నిరపాయముగా లేదు. అచ్చట పరుష్ణినదియొడ్డున వైకర్ణజనపదములందు వైకర్ణు లను ప్రువర్గము కలదు. వారిని నిర్జించికాని సుదాసుడు పరుష్ణిని దాటియుండలేడు. మరియు దాశరాజ్ఞమండలినాయకులు సుదాసుని ప్రస్తుతవిషమ పరిస్థితులను, ఉపద్రవమును చూచియు చేతులుకట్టుకొని ఊరకుందురు. వెనుకకు తగ్గుచున్న ఆతనిని వెన్నంటి తరుముటకై పరుష్ణినదిని దాటి ఉత్తరతీరమునకు వచ్చియే యుందురు. వా రక్కడ తమ స్కంధావారమును నిర్మించి సుదాసుని అసిక్నినదివైపు తరుముటకై యత్నించుచుందురు. సుదాసుని స్థితి మిక్కిలి ప్రమాదభూయిష్ఠముగా నున్నది. ఆతని వెనుకభాగమున భేదుడు, ఎడమప్రక్కన వైకర్ణులు, ఎదుటిభాగమందు దూరమున దాశరాజ్ఞసైన్యములు. అతడు అడకత్తెరలో పోకవలె నున్నాడు. ఇట్టి మహాపదనుండి కాపాడినందులకే వసిష్ఠులు ఇంద్రుని మహత్త్వము నంతగా కొనియాడిరి.

ఈ విషమదశనుండి తప్పించుకొని ఆతడు వంటయింటి కుందేలువలె చిక్కినా డని విఱ్ఱవీగు అరాతిచమువులను మహావధతో నిర్మూలించగల్గుటకు సుదాసుని స్థిరచిత్తతయు, అతని పురోహితులైన వాసిష్ఠుల నీతిమంత్రబలములును కారణములుగా మనము ఊహింపవచ్చును. సుదాసుడు గొప్ప క్షాత్రప్రజ్ఞ గలవాడనుటలో సందేహము లేదు. శ్రీకృష్ణదేవరాయ చక్రవర్తికి తిమ్మరుసుమంత్రివలె ఆతనికి వసిష్ఠమహర్షి మంత్రరక్షకుడై యుండెను. సుదాసుని తరువాతి యుద్ధచర్యలను మనము ఈవిధముగా అన్వయింపవచ్చును. ఆతని సైన్యము మిక్కిలి నిరుత్సాహస్థితిలోను, భయములోను మగ్నమయ్యెను. సప్తమమండలము లోని సూక్తములో వారి ఆపన్నదశ సకరుణముగా చిత్రింపబడినది. "ఓ ఇంద్రావరుణులారా! భూమ్యంతములు శత్రుసైన్యములచే ధ్వస్తములై కనబడుచున్నవి. సైనికులయొక్క ఆక్రోశము మిన్నుముట్టెను. అమిత్రులు మమ్ము సమీపించుచున్నారు. ఆహ్వానశ్రవణశీలురైన ఓ ఇంద్రావరుణులారా! మీరు మమ్ము రక్షించుటకై మావంకకు రండు. ఎందు సైనికులు

ఎత్తబడిన ధ్వజములు గలవారై యుద్ధార్థమై ఒందొరుల కలియబడుదురో, ఏసంగ్రామమునందు సర్వము అప్రియ ముగానే పరిణమించునో, సమస్తమును దుష్కర మగుచున్నదో, ఏ ఆజియందు భూతజాతములు ఆకాశమువంక దృష్టులు మరల్చి భయభ్రాంతము లగుచున్నవో అట్టి సాంప రాయమునందు ఓ ఇంద్రావరుణులారా, మీరు మాపక్షపాత వచనులు కండు. అనగా మమ్ము ఉత్సాహవంతుల చేయుడు." సుదాసుని అదృష్టవశమున అతని మిత్రకక్షీయులైన కొన్ని గణముల జనులు బహుశః ఇదివరలో చెప్పబడిన పక్థసులు, అవినాసులు, భలానసులు మున్నగువారు ఈ ఆపత్సమయమున తమ సైన్యములతో ఆతని సహాయార్థమై వచ్చియుందురు. ఈయంశము ఋగ్వేదము ౭-౧౮-౧౦లో సూచితమైయుండును. దాశరాజ్ఞ యుద్ధమునందు మరుద్దేవతలు తామిదివరలో ఇంద్రసహాయార్థము వచ్చుటకు చేసిన సమయమును ఆదరించి తల్లియైన పృశ్నిచే ప్రేరితులై నియుతాశ్వముల నెక్కి సంహతులై జన్యాంగణమునకు వచ్చిరట. ఇంద్రసహాయార్థము మరుత్తులు వచ్చినట్లే సుదాసుని సహాయార్థము ఆతని మిత్రగణములవారు వచ్చియుందురు. దీనిచే ఆతనికి నూతనోత్సాహము కలిగినది. అంత సుదాసాదులు ప్రప్రథమమున తమకు పార్ష్ణియందు ప్రమాదము కల్గించుచున్న భేదనామక అనార్య నాయకునిపై బడి సంహరించియుందురు. భేదుడు ఎట్టి ఆయుధములకును లొంగనివాడట. అట్టివానిని వసిష్ఠ మంత్రములచే ప్రీతులైన ఇంద్రావరుణులు సంహరించిరి. భేదుడు యమునాతీరవాసులకు కంటకుడుగా నుండెను. జరాసంధునివలె వీడు కపటముచే చంపబడెనేమో. లేదా భయంకరయుద్ధమందైన మృతుడైయుండును. వీని చావునకు సంతసించి యమునాతీరవాసులు ఇంద్రుని మిక్కిలి స్తుతించిరి. తృత్సులును వీతభయులై నిట్టూర్చియుందురు. భేదబలమును భేదించుటచే సుదాసునకు వెనుకవైపు ప్రమాదము తప్పుటయేకాక ఆతనికి పెక్కులు యుద్ధాశ్వములు ఉపాయనముగా లభించెనట, అజులు, శిగ్రువులు, యక్షువులు అను ప్రజాగణములు సమరాంగణములో లభించిన ముఖ్యాశ్వములను ఇంద్రునికి సమర్పించినట్లు ఋగ్వేదము ౭-౧౮-౧౯ లో చెప్పబడినది.

భేదనిర్మూలనముతోను, మిత్రబలముల ఆగమనముతోడను సుదాసుని సైన్యములు ఆపదనుండి కొంతవరకు విడుమర నొందెను. ప్రధానశత్రువులైన దాశరాజ్ఞబలములు ఇంకను యుద్ధరంగమం దుండుటచే సుదాసునకు క్షేమము లేదు, ఆతడు రిపుసైన్యములకు తనపైబడుటకు ఎంత మాత్రము అవకాశ మీయదలచలేదు. వారిని అగ్రభాగము నుండి తలపడుట న్యూనబలుడైన తనకు విజయమార్గము కాదని గుర్తించి ఆతడు పార్శ్వయుద్ధముపై నిశ్చయించెను. వెంటనే యాతని చమువులు తమకు ఎడమరెక్కయం దున్న వైకర్ణజనపదములపై బడి దుర్బలములైన వానిని భయంకరముగ చిత్రవధ చేసెను. ఈకార్యమును సుదాసుడు అవలీలగా నెరవేర్చెను. దర్శనీయుడును, యువకుడును అగు అధ్వర్యుడు యజ్ఞగృహమందు అవలీలగా దర్భలు కోసినట్లు సుదాసుడు అసహాయశూరుడై వైకర్ణజనులను నురుమాడెనని చెప్పబడినది. వైకర్ణజనులు దాశరాజ్ఞసంఘాతములో చేరినవారై యుందురు. కావున సుదాసుడు వారిని రూపుమాపెను. పరుష్ణినదియోద్ధులను తెగగొట్టుటలో వీరు దాశరాజ్ఞసైన్యమునకు తోడ్పడియుందురు. వీరు నదికి ఎగువను నివసించువారు కావలెను. తమ జనపదములకు ప్రమాదము లేకుండ పరుష్ణినదికి దిగువభాగములో గండికొట్టి వరదలను సుదాసునివాహినులపై విడిచియుందురు.

వైకర్ణజనుల నిర్మూలనముతో దాశరాజ్ఞుల కుడిభుజము విరిగెను. సుదాసుని సైన్యములు పరుష్ణినదివెంబడి ఎగువనుండియు, పురోభాగమునుండియుకూడ దాశరాజ్ఞసైన్యముల నురుమాడజొచ్చెను. బహుశః సుదాసుడు అకస్మాత్తుగ శత్రువులపై విరుచుకుపడెను. సంగ్రామమునందు హఠాత్పతనము అమోఘమైన ఆయుధము. ఇప్పుడు దాశరాజ్ఞమండలివారికి కథ అడ్డముగా తిరిగెను. నిన్నటివరకును తమ చేతిలోని పిట్ట యనుకొన్న సుదాసు డిట్లు తమ దక్షిణభుజశ్రేణిని ఆక్రమించి పార్శ్వమునుండియు, ముందునుండియు అతర్కితోపనతముగ పైబడుటచే వారి సైన్యములు చెల్లాచెదరయ్యెను. సుదాసుడు అదను కనిపెట్టి తన సైన్యములను శత్రువులపై కవియించెను. దాశరాజ్ఞయుద్ధము జరుగబోవుచుండగా ఝంఝూవాతముతో తుపాను రేగియుండును. మరుద్దేవతలు ఇంద్రసహాయార్థమై సంహతులై వచ్చిరనుటకిదియే యర్థమని అవినాశచంద్రదాసుగారు చేసిన ఊహ యుక్తియుక్తముగా నున్నది. మరుద్దేవతలు గాలివానకు అధిదైవములుగదా. సుదాసునకు భేదయుద్ధములో లభించిన అశ్వికబలము ఇప్పు డాతనికి మిక్కిలి యుపయోగించియుండును. పెనుగాలివానను ఆసరా చూచుకొని, రిపుచమూపతులు ప్రమత్తులై యుందురని గ్రహించి సుదాసుడు దాశరాజ్ఞ స్కంధావారముపై బడియుండును. ఋగ్వేదము ౭-౩౩-౭

లో వాసిష్ఠులకు పృథివ్యంతరిక్షద్యులోకములందలి అగ్ని వాయుసూర్యుల సంబంధమైన రహస్యవిజ్ఞానము కల దని చెప్పబడినది. రాబోవు ఝంఝామారుతవాతావరణమును వారు సుదాసునికి జ్యోస్యముచెప్పిరేమో. ఎట్లయినను అది తమ మంత్రప్రభావముచే కలిగిన దని సూచించుట వారి యుద్దేశము. ఈలోపులో పరుష్ణినదికూడ జలపూరములచే నిండి యుండి దాటుటకు వీలులేని స్థితిలో నుండెను. హిమవత్పర్వత ప్రాంతములందలి నదులు వేసవికాలమునందు మంచు కరగుటచే వెల్లువలకు లోనగు విషయము పరిచితము. దాశరాజ్ఞ సైన్యములు ప్రమత్తతచేతను, ఝంఝావాతముచే కలిగిన విషమపరిస్థితులచేతను, సుదాసబలముల హఠాద్విక్రాంతి చేతను కలగుండువడి యుద్ధము చేయలేక ప్రాణములకై పరుగెత్త నారంభించెను.

ముందు నుయ్యి, వెనుక గొయ్యి అన్నట్లు పలాయితులైన శత్రుమూకలకు పురోభాగమునందు సుదాసుడు, పారిపోవుటకు వెనుకభాగమున జలార్ణవమువలె నున్న పరుష్ణినది. దక్షిణముగ పారిపోయినను పరుష్ణియసిక్నినదుల సంగమము దాపుల్లో ఉండుటచే అదియు సముద్రమువలె నుండి దుస్తార్యము. ఈ మహారణయజ్ఞములో దాశరాజ్ఞసైన్యములు ప్రచండసంహారమునకు లోనయ్యెను. అనేకులు వధింపబడిరి. పలువురు పరువెత్తుచు పరుష్ణీప్రవాహములందు బడి ప్రాణములను గోల్పోయిరి. గోహరణకాములై బయలుదేరిన 'అను, ద్రుహ్యు' గణముల వీరులు ౭౭ వేలమందికి పైబడి నిశ్శేషముగా యుద్ధభూమియందు వధింపబడి రని వర్ణింపబడినది. ఈ సంఖ్యాగణనములో ఋషి చమత్కరించెను. "నిగవ్యవో నవోద్రుహ్యవశ్చ షష్టి శ్శతానుషుపుష్షట్సహస్రా షష్టి ర్వీరాసో అధిషడ్డువోయు, విశ్వేదింద్రస్య వీర్యా కృతాని." ఈ సంఖ్యాపనములో కొంత యతిశయోక్తి యున్నను దాశరాజ్ఞదళములు అసంఖ్యాకములుగ నురుమాడబడుట నిస్సందేహము. శ్రుతుడు, కవషుడు, వృద్ధుడు అను దాశరాజ్ఞనాయకులను ఇంద్రుడు పరుష్ణిజలములలో ముంచివేసెను. స్రవించుచున్న నదులు సుదాసుని శత్రువైన యుధ్యామధి అనువానిని సంహరించెను. తృత్సువీరులు పల్లమునకు విడువబడిన నీటివలె ఇంద్రునిచే యుద్ధమునకు విడువబడి పరుగెత్తిరి. శత్రువులు పలాయనమార్గము భజించుచు తమ ధనధాన్యాదులను సుదాసునికై త్యజించిపోయిరి.

ఇంద్రసఖుడైన సుదాసుని హింసించుటకు వెడలినట్టియు, అనింద్రులును, క్షీరాదులను తామే త్రాగువారును (అనగా ఇంద్రుని కర్పింపనివారు), గర్వితులును అయిన రిపుదుర్మతుల ఔద్ధత్యమును ఇంద్రుడు రూపుమాపి భోగ్యములైన సమస్తధనములను సుదాసుని కిచ్చెను.

"ఓ యింద్రా, నీశత్రువు లందరు వశమైరి. ఇంక నిన్ను స్తుతించు మనుష్యులపై పాపము చేయు భేదనామకునిపై తీక్ష్ణమైన నీవజ్రమును విడువుము" అని ప్రార్థించుటచే భేదవధ దాశరాజ్ఞ యుద్ధానంతరమైనట్లు పండితు లూహింతురు. భేదుడను దుష్ప్రధర్షుడైన అనార్యనాయకుడు యమునాతీరవాసిగా కన్పించును. వీనిని చంపుటచే యమునాతీరవాసులును, తృత్సుప్రజలును ఇంద్రుని స్తుతించిరి, "ఆవదింద్రం యమునా తృత్సవశ్చ ప్రాత్రభేదం సర్వతా తాముషాయత్" (౭-౧౮-౧౯) ఈ యమునానది కురుక్షేత్ర ప్రాంతమందలి ప్రస్తుత యమునానది కాదు.* అసిక్నినదికే పూర్వమీపేరు ఉండెడిదని ఇదివరలో చెప్పినాను. అట్లు కానిచో ఎక్కడో దూరమందున్న యమునా నదిపై జరిగిన భేదవధ వృత్తాంతము దాశరాజ్ఞ యుద్ధప్రశంసలో వచ్చుటకు కారణము లేదు. వాడు అసిక్ని తీరవాసి యైనచో వాని బలము సుదాసునికి పార్ష్ణిభాగముననుండి ప్రమాదము గల్గించుచుండును. సుదాసుడిప్పుడు అసిక్ని పరుష్ణినదుల నడుమ నున్నాడు. యుద్ధనీతి కుశలురైన సుదాసవశిష్ఠులు వాని బలమును భేదింపకయే దాశరాజ్ఞసంఘాతము నెదుర్కొనియుండరు. కావున భేదనిర్మూలము దాశరాజ్ఞయుద్ధమునకు కొంచెము ముందే జరిగియుండును. దీనికి ఉపష్టంభకముగ ఋగ్వేదము ౭-౮౩-౪ పఠింపదగును, ఇక్కడ దాశరాజ్ఞవధకు ముందే భేదుని సంహారము స్తుతింపబడినది. "ఓ ఇంద్రావరుణులారా! వధకరములైన ఆయుధములచే మీరు అప్రతిగతులైన భేదనామకుడగు సుదాసుని శత్రువును చంపి మాయాజ్యుడైన సుదాసుని ప్రకర్షముగా రక్షించిరి." ఇది జరిగిన పిమ్మటనే దాశరాజ్ఞులతో యుద్ధమునందు విజయమునకై వాసిష్ఠులు ఇంద్రావరుణులను స్తుతించిరి. ఋగ్వేదము ౭-౩౩-౩ లో సూచింపబడిన క్రమము నా వాదమునకు చక్కగా సరిపడుచున్నది. "ఏవేన్నుకం సింధుమేభి స్తతారేవే న్నుకం భేదమేభి ర్జఘాన, ఏ వే న్ను కం దా శ రా జ్ఞే సుదాసం ప్రావదింద్రో బ్రహ్మణా వో వసిష్ఠాః" (ఓ వసిష్ఠులారా! మీ మంత్ర స్తోత్రమహిమచేతనే ఇంద్రుడు సుదాసుని జలప్రళయమునుండి సుఖముగా దాటించెను. వీనిచేతనే భేదుని సంహరించెను. మీస్తోత్రములచేతనే దాశరాజ్ఞ సంగ్రామమునందు సుదాసుని రక్షించెను.) ఇదియే సుదా

* *Vide Article: The Identification of Rigvedic River Saraswati by Prof. K. S. Chattopadhyaya.*

సుని విజయక్రమము. పరుష్ణీనదియొక్క గట్లను తెగగొట్టి శత్రువులు కల్గించిన జలప్రళయముతో ఆతని కష్టము లారంభమయ్యెను. ఈయాపద నాతడు సుఖముగా దాటినతరువాత భేదుడు అసిక్నీనదీతీరమునుండి తన పార్ష్ణిభాగమునకు ఉపద్రవము కల్గించకుండ వానిని రూపుమాపెను. వెనుక భయము లేకుండ చేసుకొని దాశరాజ్ఞవిభులపై బడి వారిని దారుణవధతో ఓడించెను.

సుదాసుడు సింధువును తరించెను అను సందర్భమున కొంత చర్చ పొడముచున్నది. ఋగ్వేదము ౭-౧౮-౬ లో ఇట్లున్నది. "పురోళా ఇత్తుర్వశో యక్షురాసీద్రాయెమత్స్యాసో నిశితా అపీవ, శ్రుష్టిం చక్రు ర్భృగవో దృహ్యావశ్చ సఖాసఖాయమతరద్విషూచోః" పురోగామియైన తుర్వశుడు మత్స్యజనపదములను బాధించెను. అనువులును, ద్రుహ్యులును ఆతనితో ఆశుప్రాప్తిని గావించిరి. అనగా అతనిని అనుగమించిరి, ఇంద్రుడు తన మిత్రుడైన సుదాసుని దాటించి శత్రువును (తుర్వశుని) వధించెను. సుదాసుడు జలప్రళయమునుండి తప్పించుకొనెను. తుర్వశు డందే నశించెను. ఈ ప్రళయము పరుష్ణినదిని తెగగొట్టుటచే దాశరాజ్ఞులు కలిగించినదే అయియుండును. సుదాసుడు తుర్వశునితో తలపడుచుండు సమయమును ఉద్దేశించి దాశరాజ్ఞమండలివారు తమ అమోఘాస్త్రమును ప్రయోగించిరి. పరుష్ణినదిగట్టులను ఎగువభాగములో తెగగొట్టిరి. ఆట్లు విడువబడిన వరదలలో తమ మిత్రపక్షీయుడైన తుర్వశుడుకూడ నశించునని వారు ఊహించలేదో, లేక తుర్వశుని నాశనమునకుకూడ వారు ఒడంబడిరేమో! కూటయుద్ధములో తనవాడు, పెరవాడు అను భేదము గణించుటకు వీలులేదు. దీని పైఋక్కులో వర్ణించినట్లు పరుష్ణీజలములు సముద్రమువలె వ్యాపించుచున్నను ఇంద్రుడు సుదాసునికొరకు వానిని లోతులేనివిగా జేసెను. శత్రువులు నదీప్రవాహమును శాసించునట్లు చేసెను. వారు చాలవరకు అందులో చిక్కుకొని నశించియుందురు.

ఇట్లు సుదాసుడు బ్రహ్మాండమైన విజయమును సాధించెను. ఆతడుగాని, ఆతని పురోహితులు వసిష్ఠులుగాని ఇంత అద్భుతమును సంపూర్ణము నైన జయమును ఆశించలేదు. కావున ఇది కేవలము ఇంద్రప్రసాదలబ్ధమని వారు తలంచుటలో ఆశ్చర్యము లేదు. సుదాసుని విజయమును మరియొక సన్నివేశముతో పోల్చ దలచినచో దానిని ఆంగ్లేయులు ఎలిజబెత్తురాణి కాలములో స్పానిష్ ఆర్మిడాతో చేసిన నౌకాయుద్ధముతో పోల్చవచ్చును. స్పెయినువారు ప్రచండమైన నౌకాదళముతో ఇంగ్లండుపై బయలుదేరియు దైవోపహతులై తుపానులో చిక్కుకొని నశించిరి. ఆ విజయము దైవబలముచే నైనదని నాటి ఆంగ్లేయులు విశ్వసించిరి. సుదాసుడు శూరుడేగాక అదృష్టవంతుడు. ఆతని విజయముపై సమకాలికులకు కలిగిన మహాశ్చర్యమును వసిష్ఠు లిట్లు వర్ణించిరి: "ఇంద్రుడు దరిద్రునిచేత మహాదానమును చేయించెను. మేకపిల్లచేత ముసలిసింహమును చంపించెను. సూది మొనతో యూపస్తంభమునకు బెజ్జము పొడిపించెను." అసంభవనీయములైన యివి ఇంద్రమహిమచే పొసగినవి.

దాశరాజ్ఞ సంహార మయిన తరువాత సుదాసుడు తన విజయమును అనుభవించుచు కూర్చుండలేదు. శత్రువులు తిరిగి తలయెత్తుటకు వీలు లేకుండ కట్టుదిట్టములు చేసెను. "కవషాదుల దృఢములైన దుర్గములను, పురములను, నగరములను, వాని రక్షాసాధనములైన సప్తప్రాకారములను శీఘ్రముగా ఇంద్రుడు బలముచే విదారించెను. అనుగణమువారి గృహములను, ధనమును తృత్సువులకు విభజించి ఇచ్చెను. మేము వ్యర్థమైన స్తోత్రములు గల పూరుజనులను జయింతుము గాక" "సుదాసుని కీర్తి రోదసీకుహరములను నింపెను. ఆతడు ధనమును విభజించి శ్రేష్ఠులైనవారికి ప్రతివారికిని ఇచ్చెను. ఇంద్రునివలె లోకములు ఆతని స్తుతించుచున్నవి. ఆతనికొరకు శత్రువైన యుధ్యామధిని సంహరించినవి." విజయలాభముచే హర్షించిన సుదాసుడు తనకును, తన జాతికిని మరువరాని సహాయము చేసిన వసిష్ఠులకు రెండు వందల గోవులను, వధూయుక్తములైన రెండు రథములను ఇచ్చెను. పురోహితులవారికి నాలుగు ప్రశస్తములైన గుఱ్ఱములుకూడ లభించెను. ఆ గుఱ్ఱములు హిరణ్యాలంకారవంతములు, విషమప్రదేశమునందుకూడ సమగతి కలిగినవి, భూమియందు సుప్రతిష్ఠితము లైనవి అని చెప్పబడినది. వసిష్ఠులవారికి లభించిన ఆవుల సంఖ్యకును, అశ్వసంఖ్యకును తారతమ్యము విశేషముగా నున్నది. ఆ కాలములో గుఱ్ఱములు సకృత్తుగా ఉండెనని తోచుచున్నది. అదియు కాక విప్రుడైన పురోహితునకు యుద్ధాశ్వము లెందుకు ? కాని ఋగ్వేదకాలమునందలి పురోహితులు సంభావనపరులు కారు. వారు సంగ్రామమునందు రాజునకు మెదడుగాను, భుజముగాను కూడ ఉపకరించుచుండిరి. వసిష్ఠమహర్షియొక్క భరతవాక్యము గంభీరముగా నున్నది. "ఇమం నరో మరుతః సశ్చతాను దివోదాసం నపితరం సుదాసః, అవిష్టనాపై జవనస్యకేతం దూణాశం క్షత్రమజరం దువోయు" "ఓ మరుద్దేవతలారా, నేతలారా ! ఈ సుదాసుని ఆతని తండ్రి యైన దివోదాసుని వలెనే మీరు అనుసేవింపుడు; అనగా రక్షింపుడు. పరిచరణకాముడైన పిజవనపుత్రునియొక్క మంత్రమును రక్షింపుడు. ఈతని క్షత్రబలము అవినాశియై, అశిథిలమై వెలగు గాక !

# ప్రవరుని ప్రేమ

= శ్రీ మొదలి వెంకటరామయ్య =

ప్రేమ అనేది ఒక పవిత్రమైన హృదయ శక్తి. అది హృదయంలో అప్రయత్నంగానూ, ప్రకృతిసిద్ధంగానూ జనించేదే గాని ప్రయత్నపూర్వకంగాగాని, మరి యే యితరవిధంగాగాని ఉత్పన్న మయ్యేది గాదు. ప్రేమ శాశ్వతమైనది. జన్మాంతర సౌహృదాలను గూడా స్మరింపజేసే శక్తి దానిలో ఉంది :—

> "రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శద్దాన్
> పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః
> త చ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
> భావస్థిరాణి జననాంతర సౌహృదాని."

అనే కాళిదాసువచనమే యిందుకు తార్కాణం.

ప్రేమకు రెండుపదార్థాలు అవసరం. రెండూ ఒండొంటిపై ప్రేమను ప్రసరింపజేస్తాయి. రెండూగూడా ఒండొంటి ప్రేమను స్వీకరిస్తాయి. పరస్పర ప్రేమవల్ల శాశ్వతానందాన్ని అనుభవిస్తాయి. ప్రేమించి ప్రేమింపబడే రెండు పదార్థాలకూ పవిత్రాశయాలూ, హృదయనైర్మల్యమూ, స్వార్థరాహిత్యమూ ఉండాలి—ఉండి తీరుతాయి. ప్రేమకు గమ్యస్థానము ఆనందమే.

సంకుచితమైనట్టి, కేవలం విషయ వాంఛలనే ప్రధానంగా గలిగిన హృదయాల్లో తాత్కాలికంగా ఉత్పన్నమయ్యే అనుభవవాంఛ ప్రేమ అనిపించుకోదు. దానికి పవిత్రతగాని, స్థిరత్వంగాని ఉండడం దుర్లభం. దానిని "మోహము" అంటారు.

ప్రేమ రెండు మానవ హృదయాల్లోనే గాక చేతనాచేతనాల్లోగూడా ఉత్పత్తి కావచ్చు. సూర్యుని చూడగానే కమలం వికసిస్తుంది. చంద్రదర్శనం కాగానే కలువపువ్వు నవ్వుతుంది. వసంతశోభను చూచి కోయిల గానం చేస్తుంది. వెన్నెల సోకగానే చంద్రకాంతశిల ద్రవిస్తుంది. పచ్చని పైరును చూడగానే కృషీవలుని మనస్సు సంతోషతరంగితమౌతుంది. అనంతకాలప్రవాహంలో దొర్లిపోతున్నా పై పదార్థాల ప్రేమలో అణుమాత్రం గూడా మార్పు కనిపించడం లేదు. ప్రేమ అంటే అదీ! తుచ్ఛసుఖాపేక్ష లేని నిర్మల హృదయాల్లో యిలాంటి ప్రేమకు స్థానం ఉంటుంది.

మానవులలోగూడా మాతాపుత్రులనూ, భార్యాభర్తలనూ, సోదరీసోదరులనూ, గురుశిష్యులనూ, రాజునూ ప్రజలనూ, భగవంతునీ భక్తులనూ ప్రేమ అనేది బంధించి విడివడనివ్వదు. వీరి ప్రేమలో భేదం ఉంటుంది. వీరు ఒండొరుల ఔన్నత్యాన్ని అభి

లభిస్తారు. వీరందరి ప్రేమకూ ఆనందమే పరమావధి. ప్రేమించే వ్యక్తి తనకూ, ప్రేమింపబడే వ్యక్తికీ లేకపదార్థానికీ అభేదబుద్ధిని కల్పించుకొని తన హృదయాన్ని ఆవ్యక్తిలో లీనం చేసుకుంటాడు. ఆవ్యక్తియొక్క ఆంత రంగిక పవిత్రతనూ, నైర్మల్యాన్నే ప్రేమిస్తాడు గాని బాహ్యరూపాన్ని ఆశించడు. బాహ్యరూపాన్ని అపేక్షించేది ప్రేమ గాదు. అది మోహము. బాహ్యరూపానికి వికల త్వం కలగగానే మోహం నశిస్తుంది.

ప్రేమ కేవలం ఆంతరంగిక సౌందర్యాన్ని అపేక్షిస్తుంది. ఆంతరంగిక సౌందర్యానికి వికలత్వంగాని, నశింపుగాని ఉండవు. అవినాశమైన ఆంతరంగిక సౌందర్యాన్ని ఉపేక్షించి బాహ్యరూపాన్నే కోరుతారు మోహపీడితులు. బాహ్యసౌందర్యాన్ని తనివి తీర అనుభవించిన తరువాత ఆవస్తువును విసర్జిస్తారు. ఇది మోహలక్షణం.

నిర్మల ప్రేమ గలిగిన వ్యక్తి తాను ప్రేమించే పదార్థం తనకు దూర మైనప్పుడు గొప్ప హృదయ క్షోభను అనుభవిస్తాడు. పునర్దర్శన మైతేనే గాని ఆ వ్యక్తి మనస్సుకు శాంతి యేర్పడదు. ఇది ప్రేమస్వరూపం

"అద్వైతం సుఖదుఃఖయో రనుగతం
సర్వా స్వవస్థాసు య
ద్విశ్రామో హృదయస్య యత్ర జరసా
యస్మి న్నహార్యో రసః
కాలేనావరణాత్యయా త్పరిణతే
యత్ప్రేమసారే స్థితమ్
భద్రం తస్య సుమానుషస్య కథమ
ప్యేకంహి తత్ప్రార్థ్యతే"

అని భవభూతి యీ విషయాన్ని సమర్థిస్తున్నాడు.

ప్రేమకు "పవిత్రత" అనేది ప్రధాన లక్షణం. తుచ్ఛవాంఛలకు తా వుండగూడదు. ప్రవరుడు పవిత్రతయొక్క స్వరూపం. "వివిధాధ్వరనిర్మల ధర్మకర్మదీక్షాపరతంత్రుడు", "అనారతాధ్యాపనతత్పరుడు", "ప్రత్యూషమున వామనస్తుతిపరుడై లేచి, సచ్ఛాత్రుడై వరణాతరంగిణియం దఘమర్షణస్నానముజేసి, సావిత్రి జపియించి, మడుగుదోవతులు గట్టి బ్రహ్మచారులతో నింటికి వచ్చు బ్రాహ్మణుడు." భూపాలునంతటివాడు నిర్దోషమైన "సాలగ్రామము" నీ వచ్చినను గ్రహింపని వాడు. కనుకనే "వానిచక్కదనము పూచిన సంపెంగపొలుపు మధుకరాంగనలకుబోలె జారకామినులకు భోగబాహ్య" మయింది. ఇట్టి నిరుపమానపవిత్రత గలవాడు ప్రవరుడు. అగ్నితుల్యుడు పవిత్రతలో.

అతని హృదయము సంకుచితమైనదా, విశాలమైనదా అనేది రెండవప్రశ్న. సంసార బంధంలో చిక్కుకొని కుటుంబపోషణకు తన జీవితాన్ని ధారబోసే వ్యక్తికి సంకుచిత భావాలూ, దంభము, కుమార్గాన్వేషణ తత్పరత, కుటిలహృదయము, పరశ్రేయో సహనము, స్వార్థపరత మొదలైన దుర్గుణాలూ వుంటాయి. అతని హృదయంలో ప్రేమ, దయ, సర్వసమతలాంటి వానికి స్థానమే ఉండదు. ప్రవా[illegible] అవి అడ్డు తగులుతాయి. కాబట్టి అతని హృదయం సంకుచితమైన దవుతుంది.

కాని ప్రవరుని విషయం అటువంటిది గాదు. అతడు "ధనాఢ్యుడు." "మాన్యక్షేత్రముల్ పెక్కు చందాలం బండు." ఒకప్పుడును

"ఇంట పాడియు, పంటయు తఱుగదు." తినుటకు, కట్టుటకు కొఱతయే లేదు. ఇతరులకు పెట్టుటకుగూడా పుష్కలంగా ఉంది. అందువల్లనే "తీర్థసంవాసు లేతెంచినా రని విన్న దవ్వేంతయైన నెదురుగా నేగి, సద్భక్తి నాతిథ్య మిచ్చి, మృష్టాన్నసంతృప్తులను"గా జేయుటకు అవకాశం కలిగింది. "అభ్యాగత సేవాపరతంత్ర సకలజీవనుడు" అనే వాక్యమే అతని ఐశ్వర్యాన్ని వెల్లడిస్తూంది. ఇతరులను "దేహి" అని యాచించ నవసరం లేని సంపదతో తులదూగుతూ వక్రమార్గాల సంచరించవలసిన అవసర మతనికి లేనేలేదు.

అదీగాక కుటుంబముయొక్క బాగోగులను పరీక్షించవలసిన భారము, బాధ్యత అతనికి లేదు. "సుఖులై తలిదండ్రులు గూడి దేవియుఁ దేవరవోలె నుండి యిలుదీర్చే" భాగ్యము అతనికి జన్మాంతరపుణ్యంవల్ల లభించింది. కాపురమున ఒడిదుడుకులు లేకుండా, శాంతంగా నడపు తల్లిదండ్రులను గలిగిన అదృష్టవంతుడుగావున "వివిధాధ్వర నిర్మలధర్మకర్మపరుడై" "అనారతాధ్యాపన తత్పరుడై" "ఫలసమిత్కుశకుసుమాది" పవిత్రపదార్థాలను సేకరించుకుంటూ", ఉదికిన మడుగుదోవతులు గట్టి, శిష్యబృందపరివృతుడై మూర్తీభవించిన బ్రహ్మతేజస్సులాగా వెలుగగలిగాడు. అప్పుడప్పుడూ "కుటుంబజంబాలపటలమగ్న గృహమేధిమండలము నుద్ధరింప నౌషధములై"న మానినాథుల అంఘ్రిరజోలేశాలనూ, వారి "పాదపవిత్రామలతోయా"లనూ శిరస్సున ధరిస్తూ, సంసారపంకమునకు దూరముగా సంచరించి తన ఆత్మను కలుషితం కాకుండా కాపాడుకున్నాడు. అతని హృదయ మెంత నిర్మలమైనదో వాతావరణంగూడా అంత ప్రశాంతమైనది.

దీనికి తోడు "కూకటుల్ గోలిచి చేసిన కూరిమిసోమిదమ్మ సౌఖ్యావహయై భజిస్తున్న"దతనిని. సౌందర్యంలోగాని, గుణగణాల్లోగాని ఆమె "అన్నపూర్ణకు ఉద్ది." "వండ నలయదు వేవురు వచ్చిరేని." "అతిథులేతేర నడికిరేయైన బెట్టవలయు భక్ష్యభోజ్యంబులు". ఇట్టి ఓర్పు, ఉదారత ఆమెకు అమూల్యాభరణాలు. భర్తృసేవ ఆమెలో మూర్తీభవించింది. ప్రపంచంలో భర్తయొక్క భావాలనూ, చేష్టలనూ అనుసరిస్తూ అతనికి కీర్తిని తెచ్చే భార్య లభించడం దుష్కరం. కాని ప్రవరుని పూర్వపుణ్యవశాన అలాంటి భార్య లభించింది అతనికి.

అనన్యసామాన్యమైనఐశ్వర్యము, తనకు కుటుంబభారాన్ని అంటగట్టకుండా కాపురాన్ని దిద్దుకునే తల్లిదండ్రులూ, "అనుకూలవతియై మనసులో వర్తించే"భార్యా, "శీలము, శమము, దమము"గల ప్రవరుని భావాలు విశాలమైనవి గావడంలో సందేహం లేదు. పాపచింత లెరుగని అతని హృదయం నిర్మలమైనది కావడంలో ఆశ్చర్యం లేదు. కాపుననే అతని హృదయంలో పవిత్రత, ఉదారత, నిర్మలత అనేవి నివాసం చేయగలిగాయి.

ఇట్టి వ్యక్తియొక్క ప్రేమ బాహ్యసౌందర్యాన్ని అపేక్షించదు. ఏయే పదార్థాల్లో పవిత్రతాదిమహత్తరగుణా లుంటాయో

అలాంటి పదార్థాలయందే యీవ్యక్తి తన హృదయాన్ని లగ్నం చేసి ప్రేమించడం సహజం. అతని మనస్సు ప్రయత్నపూర్వకంగానైనా విషయవాంఛలవైపు ప్రసరించదు. "నిమునంబు కానకయున్న నూరెల్ల నరయు"జనకుని, "సంధ్యలయందు యిలు వెళ్లనీక ఓమెడు"తల్లిని, "అనుకూలవతియై మనసులో వర్తించు కులకాంత"ను, "తోడు నీడలై క్రీడించు" సచ్ఛాత్రులను,"అతిథిసంతర్పణముల"ను, "అగ్నులను", "నిత్యకృత్యముల"ను ప్రేమించాడు ప్రవరుడు. వీనిలో మానుషపదార్థాలేగాకుండా "అగ్ని"ఇత్యాదిఅమానుషపదార్థాలుగూడా ఉన్నాయి. కేవలం పవిత్రతాదిగుణముల నపేక్షించే వైవానిని ప్రేమించా డనడం సమంజసం.

"తన వ్యక్తిత్వానికి కారణులైన తల్లిదండ్రులనూ, తన హృదయంలో హృదయాన్ని మిళితంచేసిన గృహిణినీ, తానే లోక మనుకొని అండబాయని సచ్ఛాత్రులనూ, తన గృహామునే ఆశించుకొని వచ్చే అతిథులనూ, తనచేత హవ్యములను గ్రహించి తృప్తినిబొందే అగ్నినీ-ఇట్టి అమూల్యపదార్థాలను ప్రేమించడంలో విషయవాంఛ కేమైనా అవకాశ ముంటుందా? ఇట్టి విశ్వప్రేమ సామాన్యవ్యక్తుల్లో ఉత్పత్తిగావడం అసంభవం. ఈపదార్థాలను తాను ప్రేమించి, వానిలో తన హృదయాన్ని లగ్నంచేశాడు. వాని ప్రేమను స్వీకరించాడు. కావుననే "మిన్నులుపడ్డచోట" దైవము తనను పారవేసినందుకు అతని హృదయం తపించింది. తన ప్రియతమవస్తువులనుండి ఎడబాటు కలిగినందుకు చెప్పరాని బాధను అనుభవించాడు. ఆ పదార్థాలతో పునస్సమాగమము కలగకుంటే తన జీవితం నిష్ప్రయోజనమన్నంత విరక్తి గలిగిం దతనికి.

తన ప్రేమకు స్థానాలైన ఆ పదార్థాలను చేరడ నికి ప్రవరుడు అనేకమానసిక బాధలనూ, అవమానాలనూ సహించాడు.

"భూసురుడ నే ప్రవరాఖ్యుడ త్రోవ దప్పితిఁ...పురంబు జేర నిం కెవ్విధి గాంతు? తెల్పగదవే తెరు వెద్ది? శుభంబు నీకగుఁ" అని వరూథినిని దీవించి సవినయంగా ప్రార్థించాడు. "ఇంతలు కన్నులుండ తెరు వెవ్వరి వేడెదు?" అనే వరూధినియొక్క ఎకసక్కెపుమాటలను వినియు విననట్లు నటించాడు. తనను, తన సౌందర్యాన్నీ విపరీతంగా పొగడుతున్నప్పటికీ ఆమెపలుకులను లెక్కచేయలేదు. "సత్క్రియా కాండము తీర్ప వేగ చనగావలయుఁ కరుణింపు నాపయిఁ" అని ఆమెయెదుట దీనుడై మొరకరించాడు. "ఏనిక నిల్లుచేరుటకు నెద్ది యుపాయము?" అని కలవరపడి "తల్లి! ప్రజలఁ నను గూర్పుము" అని ఆమెయందు తనకు గల మాతృభావాన్ని వెలిబుచ్చాడు. ఆమెకు దయ గలిగేటట్టు "జననీజనకుల్ కడు వృద్ధులాకటఁ సోలుచు చింతచే నెదురుసూచుచు నుందురు." అంటూ తన మాతాపితృవాత్సల్యాన్ని కనబరిచాడు. కడకు "తన్నొడబరచు నయ్యమరకాంత తత్తరము జూచి" ఆమెకు హితోపదేశంగూడా చేశాడు. "నాకరణుల్ దర్భలు నగ్నులుఁ ప్రియము లైనట్లన్యముల్ గావు" అని నిర్భీకుడై తన ప్రే

మకు పాత్రములైన పవిత్రపదార్థాలను నిర్దేశించి, ఆమెయొక్క తుచ్ఛవాంఛలకు తావు లేదని ఖండితంగా చెప్పాడు. ఇట్టి పవిత్రప్రేమను, ఆవ్యక్తియొక్క మహత్త్వాన్ని గుర్తించలేకపోయింది వరూధిని. ఈఘట్టం ప్రవరుని ప్రేమకు అగ్నిపరీక్ష. ప్రేమకూ, మోహానికీ ద్వంద్వయుద్ధం జరిగింది. ఒండొరుల నతిక్రమించి లోబరచుకొనవలె నని రెండూ ప్రయత్నించాయి. కడకు పవిత్రమైనదిగాన ప్రేమయే జయించింది.

"భూసురవర్య! యింత తలపోయవు నీ చదు వేల చెప్పుమా?", "పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక!" అనే వరూధిని నిందావాక్యాలనుగూడా భరించాడు ప్రవరుడు. ఇక ఆ స్థలంలో నిలువలేకపోయాడు. ఇంతకాలంనించీ తాను కాపాడుకొన్న పవిత్రప్రేమకు కళంకం కలిగి తన ప్రియతమ పదార్థాలకు శాశ్వతంగా దూరమైపోతానేమో నని భయం కలిగిం దతనికి. తనకు ప్రియతమమైన "గార్హపత్యవహ్ని" నాశ్రయించి, "పవనజవంబున నిజమందిరానికరిగి నిత్యకృత్య సత్కర్మకలాపం బు ల ను నిర్వర్తించా"డు. తన అభిమతపదార్థాల అండకు చేరాడు. ఇట్టి నిరుపమానప్రేమ గలవాడు ప్రవరుడు. బాహ్యసౌందర్యనిరపేక్షకమైన అంతశ్శుద్ధియే ఆప్రేమకు లక్ష్యం.

వరూధిని చూపినది మోహమేగాని ప్రేమగాదు. యీమోహానికి బాహ్యసౌందర్యమే పునాది.

"ఎక్కడివాడొ యక్షతన యేందుజయంత వసంతకంతులన్
చక్కదనంబునన్ గెలువజాలినవాడు"
"నేరకుటి యసల్ దెచ్చి నీరజాప్తు
సానబట్టిన రాపొడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుడు
; కాకున్న కలదె యీ మేనికాంతి?"

అనే వరూధినివాక్యాల్లో ఆమె ప్రవరుని ఆకారాన్నే మోహించింది. అతని "మేనికాంతి"యే ఆమెకు ప్రధానం ఆసౌందర్యాన్ని అనుభవించడమే ఆమెఆశయం. పవిత్రతకుగాని, విశాలభావాలకుగాని ఆమె హృదయంలో చోటు లేదు. "ననవిలుశాస్త్రంపు మినుకు లావర్తించు పస వన్నె తోడ బెట్టగా" పెరిగిందిగావున ఆమెప్రతి వాక్యంలోనూ విషయవాంఛ గోచరిస్తుంది.

"యజ్ఞకోటులన్ పావను లౌటకు ఫలము మా
కవుగిళ్ల సుఖించుటేగదా !"
"భోగపరుడ వయి రమింపుము నను
గూడి యనుదినంబు"
"గంధర్వాంగనల పొందు గాదని సంసారాంధు
వున బడియె దకట !"

అనే ఆమెవాక్యాలే యిందుకు ప్రమాణాలు. యిట్టి సుఖానుభవవాంఛలతో ఆమె హృదయం నిండిపోయింది.

మోహంలో పడి తపిస్తూ "కనువేదురున్ పయిగాలి సోకినన్ వెన్నవలెన్ గరంగు" వరూధినియొక్క అపవిత్రమోహానికి పవిత్రప్రేమమూర్తియగు ప్రవరుని బలియిచ్చుటకు మనసొప్పక అతనికి ప్రియతమమైన పదార్థాలవద్దకే అతనిని చేర్చాడు పెద్దన.

వేషంలోగాని, మాటల్లోగాని వరూధినియొక్క మోహానికి అనుగుణమైనవాడు కపటవిప్రుడు - గంధర్వుడు. "లలాటపట్టి దీర్చిన గంగమట్టి", "రమణీయమణికుండల

ములు", "పసిడివ్రాత చెఱంగు గల అరుణాంశు కోత్తరీయము", "సరిలేని రాకట్టుజాళువా మొలకట్టు", "సిర్కావిపింజె", "కాశికాముద్ర యిడిన యుంగరము" — వీనిని ధరించి రసికాగ్రగణ్యుడుగా గోచరించే కపటవిప్రునికీ, ఉదికిన మడుగుదోవతులు గట్టి, విభూతి ధరించి, ఫలసమిత్కుశకుసుమాది పదార్థముల చేతబట్టుకొని "బ్రహ్మచారులమధ్య" కానిపించే ప్రవరునికీ భేదం కనిపించడం లేదూ? మోహపీడితుడు కపటవిప్రుడు; నిర్మలప్రేమమూర్తి ప్రవరుడు. ఎవరికి అనుగుణమైన వేషం వారిచేత వేయించాడు కవి.

వేషంలోనే కాకుండా కపటవిప్రుని చేష్టలూ, సంభాషణ వీనిలోగూడా మోహం తొంగిచూస్తూంది.

"కామినీగోష్ఠి ప్రౌఢములైన యుదుటుజూపుల దెప్పతుదల నాచుట"

"చిరునవ్వు కందళింపకయుండ డిందుపరచుట"

"శృంగారచేష్టల తెచ్చికోలు మౌగ్ధ్యమున దాచుట"

"రసావేశమున వచ్చు నర్మోక్తులు నాలుకకు రాకుండ గ్రుక్కుట"

యీ చేష్టలలోనే మోహం వ్యక్తమవుతూంది.

"....వినవో రతి గాగిట నీవు జేర్చ నింపానురభర్తకైన గలదా వలదంచు బెనంగ నేను సన్న్యాసినె?"

"ఐనం గానిమ్ము భవద్దీనతకై వ్రతము విడిచితి ఇబరులకు మేలైనం జాలు శరీరంబైన నుపేక్షింపవలయు"

"వ్రతము చెడ సౌఖ్యమైనను వలయు గలుగ"

అనే మాటల్లో అతని విషయవాంఛ పొంగి ప్రవహిస్తున్నది.

ఇట్టి మోహపు ముద్ద, స్త్రీలోలుడు అయిన గంధర్వుని-కపటవిప్రుని-చేత పూజ్యుడగు ప్రవరుని వేషం వేయించి, ప్రవరునికి, అతని పవిత్రప్రేమకు, తన కావ్యానికి కళంకం ఆపాదించక పెద్దన అతని ఆకారాన్ని ప్రవరునినుండి వేరుపరిచాడు.

ప్రేమకూ, మోహానికీ చాలా భేదం ఉంది. ప్రేమ ప్రేమవంకకే ప్రవహిసుంది. మోహం మోహంవంకకే ప్రవహిస్తుంది. ప్రేమ గల వ్యక్తి, మోహం గల వ్య- ఒకరితో నొకరు కలవడం దుర్లభం. అట్లు ప్రయత్న పూర్వకంగా కలపబూనియున్నట్లైతే కావ్యోద్దేశమే చెడియుండేది. యీ ఘట్టంలో పెద్దన ప్రేమకూ, మోహానికీ ఉండే అఖండ భేదాన్ని లోకానికి వెల్లడించాడు. ప్రేమకూ, మోహానికీ స్పర్ధను కల్పించి ప్రేమయొక్క ఔత్కృష్ట్యాన్ని స్థిరపరిచాడు.

కడకు ప్రేమస్వరూపుడగు ప్రవరుని అతని ప్రియతమ వస్తువులకడకు జేర్చాడు. మోహపూరితులైన వరూథినీగంధర్వులను ఏకం చేశాడు. తన్మూలంగా ఇటు ప్రేమనూ, అటు మోహాన్నీ - రెంటినీ పోషించాడు. అందువల్లనే పెద్దనకావ్యం సర్వాంగ సుందరమై ప్రకాశించింది.

# అవసానదశకు ఆరంభం




ఈ పేర్లు జ్ఞాపకం వుంచుకున్నారా?... వార్తాపత్రికలలో యివి పెద్ద అక్షరాలతో ప్రకటించబడి యెంతో కాలం కాలేదు. దిమాపూరు దగ్గర రైలుమార్గానికి అప్పుడు ప్రమాదం యేర్పడనుండెను. కోహిమా లోని భారత రక్షణ సైన్యాన్ని జపానువారు చుట్టుముట్టారు. జపానువారికి సంఖ్యాబలం వుండెను. జపాను సైనికులు ఇంఫాల్ బయళ్లలో ప్రవేశించారు. ప్రవేశించి బిషన్‌పూర్ ఉత్తర, దక్షిణ దిశలలోకి వచ్చారు. ఉఖ్రుల్‌కు క్షేమం లేకుండెను.

ఇప్పుడు ఇదంతా ప్రాచీన చరిత్రగా మారిపోయింది. జపానువారు ఓడిపోయి పారిపోతున్నారు. ఇప్పుడు వారు దిమాపూరుకు 150 మైళ్ళలోపల యెక్కడా లేరు. నాగాజనం తిరిగి కోహిమాకు వచ్చారు. తుపాకి కాల్పులతో, బాంబు దెబ్బలతో చితికిపోయిన యీ కొండపట్టణాన్ని పునర్నిర్మించడానికి శీఘ్రగతిని ప్లానులు తయారవుతున్నాయి. "అజేయమైన సైన్యాలూ..." అని తమకుతాము ఆత్మస్తుతిచేసుకున్న జపానువారి అవసానదశకు ఆరంభం ఇది. మీరు చదివినప్పుడు... ఇటువంటి మహత్తర విజయాలు కలగడానికి కారణభూతులు, ధైర్యసాహసోపేతులూ అయిన మన సైనికులను స్మరించండి.....

మన సైన్యాలు..... "జపానువారు" దేవతలూ కారు. పరాజయంపొందని మానవాతీతులూ కారు అని రుజువుచేశాయి...

వారిని తిరుగగొట్టగలమని

మనకు తెలుసు

## మనము వారిని తిరుగ కొట్టుతునే యున్నాము

# నటీమణులవలె మీశరీరసౌందర్యమును కాపాడుకొనుడు!



## సాధొన బోస్

"నేను నా చర్మసౌందర్యమునకు లక్స్ [illegible] సబ్బు [illegible] ఆధారపడుదును' అని రూప లావణ్యావతి అయిన సాధొన చెప్పుచున్నది. ఆమె యీ పరిమళమైన సబ్బును నిత్యము వాడుతుంది. ఈ సబ్బుయొక్క స్వచ్ఛమైన నురుగు ఆమె చర్మమును మృదువుగానుంచును.




**లక్సు సబ్బు**

LTS. 119-111 TL

LEVER BROTHERS (INDIA) LIMITED

# బీరకాయ పీచు

[కథానిక]

= శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తి =

వాళ్లమ్మాయికి సంగీతంట, చెపుతారా?" అంది విశాలాక్షి వంటింట్లో కూర తరుగుతూ.

"ఏమిస్తారుట?" అన్నాడు భర్త ఇవతలగదిలో తల దువ్వుకొంటూ.

"ఇచ్చేదేమిటి—ఎరిగున్నవాళ్లలో!"

"తలుపేసుకో!" అంటూ బయలుదేరాడు భుజంగరావు.

"అదేమిటి—వెళ్తున్నారేం?" అంటూ ఇవతలికి వచ్చింది విశాలాక్షి.

"మరి ఏం చెయ్యమన్నావ్—"

"నే నడిగిన సంగ తేమిటి?" అన్నది భార్య.

"నే నడిగిన సంగ తేమిటి?" అన్నాడు భర్త.

"ఏమో బాబూ! నాకు తెలీదు. ఆవిడ అడగమంటే అడిగాను. తర్వాత మీ ఇష్టం!"

"ఆవిడ అడగమంటే నన్నడిగావు - బాగానే వుంది. ఏమిస్తారో కనుక్కోమని నేను నిన్ను అడుగుతున్నాను - వెళ్లి కనుక్కో!"

"నాకిదే పని! మీ కిష్టం లేకపోతే చెప్పనని చెప్పరాదూ—"

"ఎవరితో?" అన్నాడు భుజంగరావు.

"మీరు చెప్పరుట అని చెప్తాను!" అంది విశాలాక్షి.

"మధ్య నన్ను చెడ్డవాడిని చెయ్యటం దేనికి? నేను చెప్పనని నీతో అన్నానా?"

"మీరన్నదానికి అంతకన్న అర్థ మేముంది?"

"నేనన్నది నీకేమి అర్థమయింది?"

"మీ రనే మాటలు నాకు బాగానే అర్థం అవుతయి!"

"వొట్టి దబాయింపు—నీ కేమీ అర్థంకాదు!"

"చివరకు నన్ను తెలివితక్కువదాన్ని చెయ్యటమేగా మీపని!"

భుజంగరావు నవ్వాడు. విశాలాక్షితో అతనికి వచ్చే అవస్థే అది! వొట్టి పుణ్యానికి అనవసరమైన విషయాలలో ఆవేశం చూపించి విశాలాక్షి మొహం చిటపటలాడించగానే అతనికి ఆమెను గట్టిగా ముద్దు పెట్టుకోవాలన్న దుర్బుద్ధి పుట్టటమే అతని దురలవాటు. అతని వుద్దేశాన్ని తక్షణమే కనిపెట్టే నేర్పు ఆమెకు వుండటం శోచనీయం. విశాలాక్షి కొంచెం అవతలికి జరిగి నిల్చుంది!

"నిన్ను తెలివితక్కువదాన్ని ఎవరు చెయ్యగలరు చెప్పు?" అన్నాడు భుజంగరావు.

"సరేనన్నారని ఆవిడతో చెప్పనా?"

"నేను సరేనని అనకపోయినా నేను సరేనని అన్నాననే నీకు ఆవిడతో చెప్పాలని వుంటే-చెప్పు!"

"తర్వాత నాకు మాటరావటానికా - తీరా ఆ అమ్మాయి వచ్చింతరవాత నెపం నామీదికి నెట్టటానికి—నా కామాత్రం అర్థంకాకపోలేదు!"

"అంత జాగర్త కలదానివి చెప్పకు!"

"మరి ఆవిడతో ఏం చెప్పమన్నారు?"

"నీమీది కే నెపమూ రాకుండా చెప్పు!"

"నాకు చేతకాదు సుమండీ—!"

"నీమీదికే నెపం వచ్చేటట్టు చెప్పు అంతే"

"నేనేం చెప్పను"

"చెప్పకు!"

"నేనక్కడికి వెళితే ఆవిడ అడిగితే?" అంది విశాలాక్షి దూరదృష్టితో.

"అక్కడికి వెళ్లకు!"

"బాగుంది. మీరు అందరితోనూ సంబంధాలు తెంపుకున్నారని నన్నుకూడా అలాగే చెయ్యమన్నారా? ఎవ్వరితోనూ అవసరం లేకుండా మీకు జరుగుతుందేమోకాని, ఆడవాళ్లకు మాకు జరగదు సుమండీ !"

"అయితే వెళ్లు!"

"నేను వెళ్లకుండానే ఆవిడ ఇక్కడికి వచ్చి అడుగుతుంది."

"ఏమని అడుగుతుంది?"

"ఏమండీ కనుక్కున్నారా అని అడుగుతుంది."

"అంటే కనుక్కున్నదీ లేనిదీ చెప్పు."

"అందుకేగా మిమ్మల్ని అడగటం."

"మరి నేను సమాధానం చెపితినిగా!"

"ఏం చెప్పారు — పామూ విరక్కుండా, బడితా చావకుండా—"

"పామూ చావకుండా, బడితా విరక్కుండా అని కామాలు నీవుద్దేశ్యం—!"

"ఏమిటో - మీమాటలు నా కర్థంకావు—"

"అవుతయ్యి అని దబాయించావు?"

"బాబూ నా కెందుకు కానీయండి—మళ్లీ ఈ సంగతి ఎత్తితే అప్పుడనండి—"

"నే నిందాకటినించీ నీకెందుకనే చెబుతున్నది. అర్థంచేసుకోటానికి ప్రయత్నం చేస్తేనా నువ్వు-"

భుజంగరావు తలుపుదాకా వెళ్లాడు.

"మరి ఇంతకూ ఏమిటి—?" అంది విశాలాక్షి.

అతను వెనక్కు తిరిగి చూచాడు. ఆమె అక్కడే ధీమాగా నిల్చుంది. భుజంగరావుకు నవ్వు వచ్చింది.

"మీకు అన్నీ ఎగతాళే—కొంచెము సంగీతం చెప్తే అరిగిపోతారా? ఈమాత్రం సహాయం మీరు చెయ్యకూడదా? అంత ఎవ్వరితోనూ అవసరం లేని వారు పదిరోజులకిందట పుస్తకం తెమ్మని మరి నన్నెందుకు వారింటికి పంపారు?"

చేతయితే సమాధానం చెప్పండి అన్నట్టు విశాలాక్షి కూచుని కూర తరుక్కోవటం మొదలు పెట్టింది. భుజంగరావు నిర్ఘాంతపోయినాడు. మొహం ఎఱ్ఱబడిపోయింది. రహస్యంగా అతని హృదయాన్ని పీల్చిపిప్పిచేస్తున్న బాధను అతని భార్య తెలిసీతెలియకుండా కాలితో తొక్కి రెచ్చకొట్టింది. తమ జీవితాని కేమీ సంబంధించని విషయాలలో అనవసరంగా ఘర్షణపడి భార్యాభర్తలు ఎడమొహం పెడమొహం పెట్టుకుని కదాచిత్తుగా పస్తుపడుకోటం కూడా అనేకసార్లు జరిగింది. భుజంగరావుసమస్యలు విశాలాక్షికి అర్థంకావు—పట్టించుకోవలిసిన అగత్యం కూడా లేదు—చేతకానుకూడా కాదు. జీవితాన్ని ఒక ధోరణిలోకే తీసుకురాలేకుండా వున్న భుజంగరావుకు విశాలాక్షి తెచ్చిపెట్టే సమస్యలు దినదిన గండాలు కావటంలో విశాలాక్షినేర్పు చాలా వుంది. విశాలాక్షి తెచ్చిపెట్టే సమస్యలు భార్యాభర్తల కిద్దరికీ అక్కర్లేని విషయాలు. కనీసం భుజంగరావు వుద్దేశం అది.

కాని భార్యాభర్త లిద్దరూ అన్యోన్యంగా వుంటారనే ప్రతీతి - ఓవిధంగా నిజంకూడాను! దాని క్కారణం విశాలాక్షి అమాయకత్వమూ, ఆమె నిర్మించే సమస్యాసౌధాలకు పునాది లేకపోవటమూ. భుజంగరావు సంసారం సాగరంలో తుపానుకు తట్టుకుని యథాస్థితికి వచ్చేటప్పటికి ఛళ్లున తెల్లవారుతుంది. భార్యాభర్తల పోట్లాటలు చుట్టుపట్లఅమ్మలక్కలకు కాస్తో కూస్తో అవగాహనం అవుతూనే వుంటయి. అలా పోట్లాడ గలిగిన భర్తను సంపాదించినందుకు విశాలాక్షిని చూస్తే కొద్దిగానో గొప్పగానో అసూయపడినవాళ్లు వుండటం భుజంగరావుదురదృష్టం! ఎంత పోట్లాడుకుంటే ఏం - చిలకాగోరింకలు అన్నపేరు వచ్చింది దంపతులకు. ఈపోట్లాటలు కథలుగా

రాస్తే చదువుకోవటానికి బాగానే వుంటయితప్ప నిజంగా అనుభవించటానికి అర్హమైనవి కావు !

కాని ప్రస్తుతం విశాలాక్షి వేసిన ఆస్త్రం నారాయణాస్త్రంలాగా పనిచేసింది.

"మరి వాళ్లింటినించి ఆపుస్తకం తేవటానికి అంత గునిశావేం?", అన్నాడు భుజంగరావు తాపీగా.

"నేనేం గునవలా!"

"పోనీ సణిగావేం?"

"సణగటం ఏముంది? మీకు కావలిసిన పుస్తకాన్ని ఆయన్ని వెళ్లి నన్ను అడగమన్నారా?"

"ఆయన్ని అడగమని ఎందుకు చెబుతానూ ? నువ్వు వెళ్లి ఆయనభార్యని అడిగితే, ఆవిడ భర్తని అడిగి తీసుకుని ఇయ్యదూ?" అన్నాడు భుజంగరావు.

"అంత శ్రమ దేనికి—మీకే వెళ్లి ఆయనదగ్గిర తెచ్చుకోరాదూ?" అంది విశాలాక్షి.

"సంగీతం చెబుతానా అని ఆవిడ నిన్ను అడగటం దేనికీ - ఆవిడభర్తే వచ్చి నన్ను అడగకూడదూ?"

"ఏమో నాకు తెలీదు!"

"భేష్! మరి నీకు తెలిసిందేమిటి?"

"ఏమో-తీరా ఆయన వచ్చి మిమ్మల్ని అడిగితే మీరు చెప్పనంటే—"

"నామోషీకాదూ పాపం! అందుకని ఆయన భార్యా ద్వారా అడిగించుకుని లేదనిపించుకుంటే నామోషీ ఆయనకు కాదుగా!"

"వింతఅర్థాలు తియ్యటంలో మీరు ఘట్టు ! ఆయనేం భార్యాని అడగమని చెప్పలేదు—"

"అదీ నామోషేకామాలు ఆయనకు! అయితే ఆయనభార్యే భర్తఅభిప్రాయం గమనించి నిన్ను అడిగింది కామాలు—"

"ఎందుకు వాళ్లకు లేనిపోని వుద్దేశాలు కలిపించటం—వాళ్లకు ఇటువంటి ఆలోచనలు ఎప్పుడూ వుండవు!"

"అఖర్కం నాదే కామాలు! అయితే వాళ్ల మ్మాయికి సంగీతం చెప్పించాలని ఆతుర్దా ఆమెకేగాని ఆయనకేమీ లేదంటావా?"

"ఆయనకుమటు కెందుకుండదు?"

"వుంటే సంగీతం చెప్పించే భారం ఆయనకు కంటె ఆవిడకే ఎక్కువ పట్టినట్టుందేం?"

"మీకు సమాధానం చెప్పటం నాకు చేతకాదు—"

"మరి వెళ్తావేం—నీదగ్గిర వున్న దురలవాటే అది!"

"మీతో పెట్టుకున్నుంటే ఈపూట మరి భోజనం వుండదు - ఇందులో కొత్త ఏముంది?"

"మరి ఇటువంటి సమయంలో తీగెకదలించావు దేనికీ? నీవు ఏవిషయం ఎత్తావో నీకు తెలియదు కాబట్టి ఇప్పు డిది తేల్చాలిసిందే—"

"తేల్చేదేముంది — ఇతరులకే దురుద్దేశాలు వుంటయి, మీకు అన్నీ మంచి వుద్దేశాలే—"

"నువ్వేమన్నా నా కభ్యంతరంలేదు. నాకే దురుద్దేశాలున్నయి—ఇతరుల కందరికీ మంచివుద్దేశాలున్నయ్యని నీవు అన్నా నేను వొప్పుకొంటాను. కాని అసలు సంగతి చెప్పు!"

"ఏం చెప్పను ? కూతురుసంగీతంవిషయం తల్లికిమటుకు పట్టదూ?"

"ఎందుకు పట్టదూ? కాని నాప్రశ్న ఏమిటంటే అది ఆమెకే ఎక్కువ పట్టినట్టుందేమని—పోనీ ఆయనకేమీ పట్టనట్టుందేమని."

"ఆయనకుమటుకు ఎందుకు పట్టదూ-ఆయనా సంగీతంమేష్టరుకోసం చూస్తూవుండివుంటాడు!"

"పాపం, ఆసంగతిఆవిడకు తెలియదుకామాలు! బాగానే వుంది - భార్యకు తెలియకుండా భర్తా, భర్తకు తెలియకుండా భార్యా సంగీతం చెప్పేవాడికోసరం చూస్తున్నారన్నమాట! వాళ్లదీ మన సంసారంలాంటిదే—"

"నావిషయాలు మీకేమీ అక్కర్లేదుకాని మీ విషయాలు నాకేమీ అక్కర్లేకుండా పోలేదు!"

"మంచిమాటన్నావు తెలిసీతెలియకుండా!"

"భార్యా, భర్తా ఒకరికొకరు సంబంధం లేకుండా వుండాలనికామాలు మీవుద్దేశ్యం?"

"అదిమటుకు అన్యాయం - నేనెప్పుడూ అలా అనలేదు—"

"ఇప్పుడు మీవుద్దేశ్యం అంతకంటె ఏముంది?"

"పోనీ, నాకు అలాంటి దురుద్దేశ్యమే వున్న దనుకో. అయితే వాళ్లు నావుద్దేశ్యప్రకారమే వుంటు న్నట్టున్నదే?" అన్నాడు భుజంగరావు.

"వాళ్లేం అలా వుండటం లేదు!" అన్నది

"అయితే మరి ఇద్దరూ సంగీతం చెప్పేవాడి కోసం వెతుకుతున్నట్టు ఇద్దరికీ తెలుసునన్నమాట!"

"ఎందుకు తెలీదేం? సంగీతం చెప్పించాలని వున్నప్పుడు ఇద్దరికీ తెలియకుండా ఎలా వుంటుంది? ఆయనకు తెలియకుండా ఆపని ఆవిడ ఎందుకు చేస్తుంది?"

"అయితే నేను సంగీతం చెబుతానో చెప్పనో నని ఆవిడ కనుక్కుంటున్నట్టు ఆయనకు తెలుసు నన్నమాట !"

"ఏమో నాకు తెలీదు"

"ఇందాకా వచ్చి మొండికి వెయ్యకు!"

"ఆయనకూ తెలిసేవుంటుంది బహుశా!"

"చాలా మంచిదానివి ! అయితే నేను వాళ్ల మ్మాయికి సంగీతం చెప్పటం ఆయన కభ్యంతరం లేదన్నమాట?"

"చెప్పటానికి మీ కిష్టంలేదుకాని మీరు చెబితే ఆయనకు ఇష్టం వుండకపోదు."

"చెప్పటం ఇష్టం లేదని నే నెప్పుడూ అన లేదు. అయినా అది అంత ముఖ్యవిషయం కాదు. నేను సంగీతం చెప్పటం ఆయనకు ఇష్టమేకాని నన్ను అడగటానికిమటుకు ఆయన కిష్టం లేదన్నమాట!"

"అని మీవుద్దేశ్యం. ఆయన కెందుకు ఇష్టం వుండదు మిమ్మల్ని అడగటం?"

"ఏమో నాకేం తెలుసు? నన్నడగటం ఆయన కిష్టం వున్నదో లేదో నాకు తెలియదు - నాకు అవసరం లేదుకూడాను. కాని నేనడిగే దేమిటంటే ఆయన నన్నెందుకు అడగడంటాను - ఆవిడ వచ్చి నన్ను ఎందుకు అడుగుతుంది అంటాను!"

"ఎవరడిగితే ఏమిటంటా? ఇందులో అంత పట్టుదల దేనికి ?"

"నాకు పట్టుదల లేదు - ఆసంగతి నీకు తెలి యదుకామాలు!"

"మరి ఇదంతా దేనికి?"

"నీకు అర్థంకావటానికి! ఎవరడిగితే ఏమన్నంతే విశాలదృష్టి కలదానివి అప్పుడాపుస్తకం అడగటానికి అంత అభ్యంతరం కలిగింది దేనికి నీకు?

"మళ్లీ మొదలా? మీతో నేను వాదించలేను బాబూ - మీ కోనమస్కారం!"

"మంచిదానివి కాదూ!"

"పుస్తకందారి వేరు!"

"అదా సంగతి - నాకు తెలియదుసుమా! లేక పుస్తకం కావలిసింది నాకుకాబట్టి దాని సంగతి నీకు అంత పట్టలేదా? ఆవిడఅవసరంలో వున్నంత శ్రద్ధ నీకు నాఅవసరంలో లేదుకామాలు?"

"నామీద మీకు అటువంటి అభిప్రాయం వుందికామాలు!"

"అని నేనెప్పుడన్నా అన్నానా?"

"మీరు వేరే అనక్కర్లేదు—మీమాటలే చెబు తయ్యి."విశాలాక్షి బిక్కమొహం వేసినమాట మాత్రం నిజం !

"పోనీ ఆవిషయం వదలిపెడదాం—"

# బీ ర కా య పీ చు

"ఆవిడను ఆపుస్తకం నేను అడిగినా మీ రిలా అంటున్నారు—పోనీ లెండి!"

"నీవు ఎంత రాద్ధాంతం చేసి ఆవిడను ఆపుస్తకం అడిగావో మరిచిపోయినట్టున్నావు. పోనీ ఆపుస్తకం అడిగినప్పుడు ఆవిడ ఏమన్నదో జ్ఞాపకం వుందా ?"

"ఆయనపుస్తకాలూ, ఆయనగొడవా ఆయనదే నంది కామాలు !"

"ఆవిడ ఎంత తెలివితక్కువదో చూచావా ? నీవంటే సమర్థత కలదానివి కాబట్టి తెలివిగా పనులు చేసిపెట్టగలవుకాని అందరికీ ఆనేర్పు వుండదు !"

"బాగుందే—తాళం వేసివున్న బీరువాలో పుస్తకాలు ఆవిడకు ఎలా దొరుకుతయ్యి ?"

"పోనీ, ఆయన్ని అడగచ్చుగా ?"

"పుస్తకం నాకని చెబితేమటుకు ఆయన కర్థం కాదా ఏమిటి మీకని ?"

"అయితే నాకేనా అర్థంకానిది సంగీతంచెబుతారా అని ఆవిడ అడిగితే ఆవిషయం ఆవిడ కొక్కతకే పట్టలేదని ?"

"ఇంత చిన్న విషయానికి ఇంత అర్థం లాగటం దేనికంటా ?"

"నీకు అర్థం కావటానికే! అదీ కాక నీచేత ఆవిడను ఆపుస్తకం అడిగించకపూర్వం నేనే ఆయన్ని అడిగానని నీకు తెలియదుకామాలు ?"

"మీరడిగితే ఆయ నేమన్నాడూ ?"

"అది వేరే సంగతి—"

"మీరడిగింతర్వాత నాచేత అడిగించటం దేనికీ ?"

"నీకు తెలియని దేముంది—నాకన్నీ దురుద్దేశాలేగా !"

"ఇంతకూ ఆయనేమన్నాడు?"

"ఆపుస్తకం తనదగ్గిర అసలు లేదు—"

"ఎవరికన్నా ఇచ్చాడేమో ?"

"కొనాలనుకుంటున్నాను అని అన్నాడు!"

"ఆయనదగ్గిర లేదేమో ?"

"మరి రెండురోజులకిందే ఆపుస్తకాన్ని డాక్టరుగారింటో చూచా నన్నావు—నిజంకాదా ఏమిటి ?" అన్నాడు భుజంగరావు.

"నిజమే! ఎవరిదని అడిగితే డాక్టరుగారి పెళ్లాం వీళ్ల దేనని చెప్పింది!" అంది విశాలాక్షి ఆలోచిస్తూ.

"ఒక్కసారి నీమొహం ఈఅద్దంలో చూసుకో -ఎంత బాగుందో !"

"ఏమీ అక్కర్లేదు—అయితే మీ రడిగితే ఆయన ఎందుకు లేదనివుంటాడు?"

"నాతో ఆయనకు ఏమి అవసరం వుంటుంది?"

"అవసరం లేకపోతే పుస్తకం ఇయ్యటానికేం?"

"నువ్వు వేసే ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగినంత తెలివికలవాడినికాదు—వొట్టు!"

"అవును పాపం! అయితే—"

"ఈపూట మనల్ని ఎవరన్నా భోజనానికి పిలిచారేమిటి?"

"మీకు అలాగే వుంటుంది — అయితే ఆయన పుస్తకం లేదంటే వూరుకోక మళ్లీ నాచేత అడిగించటం దేనికీ?"

"ఎవరికన్నా ఏదన్నా కావలిస్తే ఇంటో ఎంత గోల చేస్తావో నాకు తెలుసు. కాని నాకు ఏదన్నా కావలిస్తే నువ్వు ఎంత ఘర్షణ చేస్తావో చూద్దామని"

"ఎటొచ్చీ చెడ్డదాన్ని నేనేనన్నమాట!"

"ఆమాట నేననందే?"

"అయితే ఆపుస్తకం తనదగ్గిర లేదని ఆయన అన్నప్పటికీ వుందని తెలిసే నాచేత అడిగించా రన్నమాట?"

"అంత చెడ్డవాడినిమటుకు కాదు!"

"మీకు ఇయ్యనప్పుడు నేనడిగితేమటుకు ఎలా ఇస్తా డనుకున్నారు?"

"నే నడిగినసంగతి తెలియకుండానే ఆయన భార్య నీతో పుస్తకాల గొడవ ఆయనదే నని చెప్పిందిగా ?"

"ఆయనదగ్గిర ఆపుస్తకం నిజంగా వుందికాబట్టి మీరు అడిగిన సంగతి ఆయన భార్యతో చెప్పి వుంటాడు !"

"నీకు తెలివితేటలు ఎక్కువ అవుతున్నయ్యంటే నమ్మ !"

"ఆయన మీకు ఇయ్యనన్నాడుకాబట్టి ఆవిడ ఇస్తే బైటపడుతుందని తప్పించుకోవటానికి తనకు తెలీదు పుస్తకాల సంగతి అని చెప్పింది !"

"నీకంటే ఆవిడే తెలివికలదల్లే వుంది."

"కాని డాక్టరుగారి పెళ్లానికి మళ్లీ ఇచ్చేసింది."

"అంత తెలివికలది కాదల్లే వుంది."

"ఏమో-మీకూ మీకూ ఏ మే ం వుద్దే లున్నయ్యో. నేనడిగిన అసలుసంగతి ఏమిటి ?"

"చెబితినిగా ?"

"అంత నిర్మొహమాటంగా అడగటం నాకు చేతకాదు !"

"నాజూకుగానే అడుగు."

"ఆయనే మిమ్మల్ని అడిగితే ఏం ?"

"ఆయన నోరుచేసుకుని అడగాలిసినంత అవసరం ఏముంది ? ఆయనభార్య ఆయన కాశ్రమ లేకుండా నిన్ను అడిగింది—నువ్వు తెలివికలదానివికాబట్టి ఆవిడకూ ఆశ్రమ లేకుండా పనిచేసిపెట్టగలవు. తర్వాత ఏరోజునైనా ఆయన తనెప్పుడూ నోరుచేసుకొని అడగలేదని చెప్పుకోగలడు."

"వాళ్లకు అటువంటి అభిప్రాయా లుండవు."

"వాళ్లకు లేకపోతే ఏం—నాకు వుంటే చాలదూ వ్యవహారం చెడటానికి ?"

"ఏమో—మీయిష్టం!"

"నాయిష్టం వొచ్చినట్టు నేనెలాగో చేస్తాను కాని నీకు చేతకానిపనులు—నాకు సంబంధించనివి—నన్ను చెయ్యమని బాధపెట్టకు. నీకు సంబంధించిన పనులున్న వ్యవహారాలు నీకు చేతనయినట్టు చెయ్యి. మనిద్దరికీ సంబంధించిన పనులు నాకు చేతనయినట్టు చేస్తాను—చేతయితే నీవుకూడా చేతనయినవిధంగా సహాయం చెయ్యి. ఇప్పుడు వాళ్లమ్మాయికి సంగీతం చెప్పటంవిషయంలో నీవు ఏదో తేల్చుకోవాలనుకుంటే వా ళ్లేమిస్తారో కనుక్కో. అలా అడగటం ఇష్టం లేకపోతే నీకు చేతనయినవిధంగా చెయ్యి."

"నేనేం చెయ్యను !"

"చూద్దాంగా— ఇలా కోతలు కొయ్యటం నువ్వు ఎన్నోసార్లో!"



# పౌష్యలక్ష్మి

•

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

పౌష(శ్రీ)పరిపూరితాంధ్రధరణీప్రఖ్యాతదృశ్యావళీ
తోషాంభోనిధి మున్కలాడెడు జనస్తోమంబుఁ గన్గొంచు స
ద్భూషాభూషణరాజి యర్థి హిమకణాంభస్సున్ బ్రవర్షింపుచున్
భూషింపంగఁ దొడంగి నిల్తురు నిలింపుల్ వ్యోమమార్గంబునన్.

పౌషసస్యలక్ష్మి ప్రఖ్యాతి వివరింప - నలవికాదు బ్రహ్మయాలికైన
నాంధ్రసీమ వెలయు నత్యుజ్జ్వలంబుగా-స్వర్ణసీమ యనఁగ జగతియందు.

నవనవలాడు సోయగమునం దనరారును మెంతిచేలు, నిం
పవుఁ గొతిమీరిచేలును సువాసనలన్, జనుమున్ బ్రకాశిలున్,
మిపులఁగఁ గందిచే ల్పెసరమిన్ముల చేలును వృద్ధిపొందుఁ, బె
ర్సెవుల పొలంబులున్ దనరు నూతనమై జననేత్రపర్వమై.

చూతసమాజ మిప్పుడె ప్రసూనవిరాజితమై యొసంగు నీ
శీతలవాతవీవనలచేతనె చిక్కుడు, పొట్ల, కాకరల్
పూతలుఁ బిందెలున్ గలిగి పుష్కలమిచ్చును గూరనారలన్
గోతకువచ్చుఁ గాటుకలు గుమ్మడి యానప వంగ కాచెడున్.

ధాన్యలక్ష్మివృద్ధి ధనలక్ష్మివృద్ధియు - సౌఖ్యవృద్ధి యపరసస్యవృద్ధి
గలుగుచుండ గృహము గలకలలాడఁగఁ - దోషమందు రైతు పౌషమందు.

చలియను బెబ్బులొక్కటి నిశల్ కడు నుగ్రత విక్రమింపఁగాఁ
జలితమనస్కులై గృహులు సత్వర మార్తినిఁ బాపుకోఁ దలం
పులు గలుగన్ నిజాంగనల పొత్తను బూఁబొదరిండ్లలోనికిం
దలఁగి వధూకుచాశ్రయముమాటున దాఁగి సుఖింతు రీనిశల్.

చలిపులితో నెదుర్కొనుచుఁ జంపఁగ జూచియుఁ జంపఁజాలమిన్
సిలుగుల నందుచున్ నిజవశీకృతశక్తులుగాక నొచ్చుచున్
దలపడి రాత్ర మంతయును దాల్తురు జాగరణవ్రతంబు భా
ర్యలఁ బెడఁబాసినట్టి జను లంచితపౌషనిశాత్మసౌఖ్యులై.

## భారతి - తారణ పుష్యము

విప్రనైష్ఠికు లరుణోదయప్రవిమల-వేళలందు జిగీషచే విమలవారి
శీతవాతంబులకుఁ దా రతీతు లగుచుఁ-గ్రుంకి నిర్జింత్రు నీతు వకుంఠులగుచు.

మరణమనునది లేకున్న మానవునకు-బ్రదుకుఁదీ పెట్లు తెలియు;నాపగిది ఘోర
శీతవాతోపహతి లేక చెప్పఁదరమె - భానుతేజఃప్రభావసౌభాగ్యగరిమ.

పౌషలక్ష్మికి ఘనమగు భూషణంబు - మకరసంక్రాంతిపర్వసంపద తలంపఁ,
బౌషలక్ష్మి శుభాంతమై పరగుకతన-సకలజనమాన్యమై యొప్పెజగతియందు.

తొలి బలిదైత్యసైన్యవితతుల్ కడు విక్రమ మొప్పఁగా జగం
బుల గెలుపొంది స్వర్గము నపూర్వముగాఁ గొని యేలుచుండ వా
రలఁ దొలఁగించి నిర్జరుల రక్షణకై హరి వామనుండు నై
బలి నడఁచెన్ జగద్ధితము వాటిలె నయ్యది నిల్చె నేఁటికిన్.

బలివిభుత్యాగవైభవము పర్వె జగంబుల నాఁటినుండి యా
సలలితవిష్ణుపాదజలజంబులఁ గాంచుటమాత్ర కాదు త
జ్జలరుహముల్ శిరంబునఁ బ్రసాదముగా ధరియించె భక్తినా
బలిని నుతించు నెప్పుడు సెబాసని సర్వజగంబు లీనెలన్.

బలివదాన్యుని కీర్తివైభవము నేఁటి-సంక్రమణపర్వరూప మచ్చముగఁ దాల్చె;
సంకెలలు దీసి ఖైదీల సత్కరింత్రు - బలిమహోత్సవవేళ భూపాలవరులు.

అలుకుల్ ముగ్గుల వెల్లలన్ బసుపుచే నానందధామంబులై
చెలఁగున్ బౌషమునన్ గృహంబు లవి; స్వాస్నేమం దలంపించు భూ
తల మెల్లన్; దగ భోగిమంట లవి యాంధ్రశ్రీయశోజ్వాలలై
వెలుఁగొందున్ దివి దాఁకి సంక్రమణ మూర్విన్ దివ్యపర్వంబుగా.

భారతభారతీసుభగభాగ్యసమేత యశోవిజేత శో
భారతి కాంధ్ర 'భారతి'కిఁ బబ్బము 'పుట్టినమాస' మాటచే
హారతు లిచ్చుచుండిరి మహాంధ్రసతీజనపుణ్యరూపిణుల్
కోరికఁ బౌషపర్వములలో శతమాన మటన్న దీవెనన్.




ముద్దులొలుకు
ముఖారవిందమునకు
కేరళ రోజ్ సబ్బు
వాడుడు.

KERALA Rose SOAP




HEYCOCK.

KERALA SOAP INSTITUTE, CALICUT



# జోస్యం అవసరం లేదు

కొద్దిరోజులలో ధరలు ఎక్కువగునో తక్కువగునో మీ కెవ్వరు జోస్యం చెప్పవలసిన అవసరం లేదు. 1944_వ సంవత్సరపు అనుభవ జ్ఞానాన్నిబట్టి, ధరలు తప్పక తగ్గేమార్గంలోనే ఉన్నవని అందరికీ నమ్మకం కలిగియున్నది. ఎటుచూచినా వెలలు తగ్గుతూ ఉండడం కనబడుతున్నది. ధరల కంట్రోలు ఏర్పాటు వల్లన, అధిక లాభాశాపరులకు పట్టుదలతో శిక్షలు విధించడంవల్లను, ధరలుతగ్గడం జరిగినది. వెలలు తగ్గుతున్నవి గదా అని ఇప్పుడే ఉన్న డబ్బంతా పెట్టి ఏవేవో కొనేసి నష్టపోకండి.

తయారుచేయబడే సామానులు, వస్తువులు, భూమి, ఇళ్లూ, నగలు_సొమ్ములు_కొనడంలో డబ్బుపెట్టుబడి పెట్టెయ్యడానికి ఇది సమయం కాదు. కొంతకాలానికి వీటివెలలు తగ్గిపోయితీరును. నేడు 100 రూపాయలు పెట్టికొన్నవస్తువు ఖరీదు సంవత్సరంలోపునే 70 రూపాయిలకో ఇంకాతక్కువకో దిగిపోవచ్చును.

ఈ రోజులలో డబ్బు వెయ్యడానికి సర్వోత్తమమైన పెట్టుబడి మార్గాలివి:— ఇన్సూరెన్సు (భీమా), సహకారసంఘాలు,, సేవింగ్సుబ్యాంకు అకౌంటు, పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు, ప్రభుత్వఋణాలు, దేశీయసేవింగ్సు సర్టిఫికెట్లున్నూ.

బట్టలు, లోహుసామానులు, ఆహారధాన్యాలు మొదలైనవాటి ధరలు తగ్గిపోతున్నవి. కంట్రోలు ఏర్పాట్లు ఎక్కువవుతున్నవి. కఠినంగా అమలు జరుపుతున్నారు. తప్పకుండా ధరలు ఇంకా తగ్గిపోయి తీరును.

## వీలైనంత ఎక్కువగా కూడిక చెయ్యండి. మిగిల్చినదంతా పెట్టుబడి పెట్టండి

దేశీయ యుద్ధరంగంవారు దేశీయులకు చేసే విజ్ఞప్తి.

AAA 1115 TG

# బృహస్ప గొప్పదనము



= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

గడచిననెల "భారతి"లోని నావ్యాసమును పఠించినవారిలో కొందరు మహనీయులు బృహస్పత్యాచార్యుని యెడ నేను మహాపరాధము గావించినట్లు భావించిరని వింటిని. ఆ చార్యబృహస్పతి అందరకును వంద్యుఁడే: ఆతనిపట్ల నర్హమగు గౌరవభావమును జూపువిషయమున నితరులకు వెనుకంజవేయు నభిలాష నాకును లేదు. కాని, లేని గుణ ధర్మముల నతని కారోపించి భ్రమపాలగుట మాత్రమే నాకు రుచించనిది. ఈ విషయమున శాస్త్రావిరోధముగ నా అనుభవములు, ఊహలు పాఠకమహాశయులకు సమర్పించితిని. లోపము లున్నచో, క్షంతవ్యుఁడను.

మనకు వాడుకలో నున్న గ్రహములలో నెల్ల ప్రబలతమశుభగ్రహము బృహస్పతి యనుట కెవరుకాని సంశయింపరు. జాతకమున శుభుఁడయ్యేనేని, అతనినుండి సూచితములగు ఫలములు చాల స్పృహణీయములై, సుఖసంధాయకములై, పూర్వార్జితసుకృత విశేషపరిపాకమునే తెలుపఁజాలినవి. మఱియు, ఆఫలముల పరిమాణమునయితము చాల గొప్పదిగనే యుండఁగలదనుట నిర్వివాదాంశము. సూర్యకుటుంబములోని గ్రహము లన్నిటికంటె ఈగ్రహగోళపు ఘనపరిమాణ మత్యధికమని ఖగోళశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. కావుననే, మహానుభావులగు మన ప్రాచీనమహర్షులీగ్రహమునకు గురువు, బృహస్పతి అని సార్థకనామధేయముల నొసఁగుట: అగుటచే. ఈ గ్రహము సూచించు ఫలముల పరిమాణముకూడ గొప్పదగుటలోనాశ్చర్యములేదు.

సూర్యకుటుంబములో బృహస్పతిమండల మున్న స్థానమును గమనించితిమేని, ఆగ్రహముయొక్క స్వభావము నుగుఱించి మనకు కొన్నివిశేషములు బోధపడఁ గలవు. గ్రహములన్నియు సూర్యభగవానుని చుట్టి తమతమ కక్ష్యలలో నిరంతరము తిరుగుచున్నవికదా? కుజకక్ష్యకు వెలుపల, శనికక్ష్యకు లోపల ఈ బృహస్పతికక్ష్య గలదనుట ఖగోళశాస్త్ర సమ్మతమగు విషయము. అనఁగా, అంతరంగమున కుజవ్యాప్తియు, బహిరంగమున శనివ్యాప్తియు కలదగుటచే ఈ రెండుగ్రహముల ధర్మవిశేషములు బృహస్పతిలో సమ్మేళనము నందినవి. కుజుఁ డగ్నిగోళము; ఉద్రేకకారి; సాహసప్రియుఁడు; రక్తప్రకోపము నిచ్చు శక్తి గలదు; సైనికధర్మముపై నత్యంతాభిమానము; నిరంకుశాధికారముతోటి పురోగమనమును, అభివృద్ధిని కాంక్షించుట యీగ్రహ ధర్మము, శని యన్నచో అత్యంతశీతమయగోళము; భావసంకోచనకారి; నిసర్గభీరువు: జడత్వము నిచ్చు స్వభావ మున్నది; స్తంభనశక్తిపై నభిమానము; ఏవిధమగు వికాసము కాని గిట్టదు; సేవకధర్మము కల దీగ్రహము. ఈ రెండు గ్రహముల నడుమ నున్న దేవగురువు బృహస్పతి యగుటచే కుజునికిఁగాని, శనైశ్చరునికిఁగాని లోఁబడక, ఆ యిరువురి సహజగుణములను సమ్మేళనము కావించి లోకకల్యాణమునకై సమన్వయపరచుకొన్నాఁడు. రాశిచక్రమున గ్రహముల యాధిపత్యములోనయిత మీపద్ధతియే కానవచ్చుచున్నది. చూడుఁడు. గురుక్షేత్రములగు ధనుర్మీనములు రెండింటిని ఒకవైపున కుజరాశియు, మఱియొకవైపున శనిరాశియు అంటియేయున్న వనుట గమనించినచో. బృహస్పతిలోఁ గల కుజశనిధర్మసమ్మేళనము స్పష్టమగును. 'కాలహోరా' నిర్ణయవిషయమున, శనికుజహోరల నడుమ గురుహోరను విధించిన హోరాశాస్త్రవేత్తలు పై ఖగోళశాస్త్ర మర్యాదను గౌరవించినా రనియే నమ్మవలసియున్నదికదా?

సారాంశ మేమన, శనిసంకోచనమునకు లోనయిన కుజుని వికాసమే బృహస్పతిధర్మ మనుట. జాగరూకత నేమరని పురోగమనము, వివేకమును మరచిపోని విద్య, అందమును గోలుపోవని వికాసము, సౌఖ్యమును పాడుచేయని పరిశ్రమ ఇత్యాదులు బృహస్పతి ఫలములు. కాననే, నీతినియమముల కట్టుబాట్లకు లోనయిన సక్రమాభివృద్ధి నీగ్రహము సూచించును. ఇదే బృహస్పతి యందలి సర్వోత్కృష్టమగు ఘనత అగుటచే జ్యోతిషశాస్త్రవేత్త లందరు - ఏకకంఠమువారైన

నేమి - ఈగ్రహఫలములను వేనోళ్లఁ బొగడుట! నీతినియమములతోటి సనాతనధర్మ వర్తనమే మానవజీవితమునకు పరమాదర్శముగ నెంచి, ధర్మశాస్త్రసూత్రములు నిబంధించిన మహర్షిసత్తములే మనదేశమున హోరాశాస్త్ర ప్రవర్తకు లగుటచే, వారి దృష్టిలో బృహస్పతికి 'గొప్ప' విలువ యుండుటలో వింత లేదు. జన్మలగ్నములో గురువుండవలెననియు, ఇతరగ్రహములు (బుధ, లగ్నాధిపతులు తప్ప) ఉండనేరాదనియు వారి మతము. "హోరా, స్వామి గురు జ్ఞ వీక్షితయుతా నాన్యైస్తు వీర్యోత్కటా" అని వరాహమిహిరాచార్యుఁడు శాసించెను.

ఇంతే కాదు! శుభకార్యావసరములలో లగ్నమునందు ముఖ్యముగ మనవారు బృహస్పతినే కాంక్షించిరి. ఇఁక వివాహముమాట అడుగపనియే లేదు. సామాన్యదృష్టితో చూచినచో, వివాహలగ్నమునకు శుక్రుని సాహాయ్య మపేక్షించుట యుక్తమని రోఁచుట తప్పు కాదు. శుక్రుఁడు కళత్ర కారకుఁడు; శుభగ్రహము; సౌందర్యలావణ్యముల కధిదేవత; హావభావవిలాసముల కాటపట్టు; లలితకళామర్మముల కుపాధ్యాయుఁడు; సుఖసౌభాగ్యములకు సంధాత, కాననే రాశిచక్రమున కుటుంబ, కళత్ర స్థానములగు వృషభతులలపై నాధిపత్య మీగ్రహమున కిచ్చియుండుట! ఇట్టి శుక్రునిబలము వివాహకాలములో నుండుట యత్యావశ్యకమేకదా? కాని, మన ప్రాచీనుల దృక్పథము వేఱు. వారు పరిణయకాలమున ప్రధానముగా గురుబలమే కావలయు నని కోరిరి.

"గురు ర్వివాహే, గమనేచ శుక్రో
జ్ఞానే బుధో, దీక్షణకేచ సౌరిః
రణేషు భౌమో, నృపదర్శనే ఒర్కః
సర్వేషు కార్యేషు శశీ బలాఢ్యః" (రల్లుఁడు)

రైళ్లు, మోటార్లు, పొగయోడలు, వాయువిమానములు మున్నగు నాధునిక శీఘ్రప్రయాణసౌకర్యములు లేనికాలమున — అనఁగా, పుష్పకవిమానము మున్నగు దేవయానములు మానవులకు మృగ్యములైనతరువాత - దూరదేశప్రయాణము క్లేశభూయిష్ఠముగ నున్నపుడు, మార్గప్రయాసము కానరాకుండ ప్రయాణమధ్యమున పానీయశాలలలో, భోజనసత్రములలో, అతిథిసత్కారములో లభించు నను నభిలాషచే, ఆకాలమున శుక్రుని సాహాయ్యము ప్రయాణసమయమున నపేక్షించుట మిగుల యుక్తముగ నున్న దనవచ్చును. కాని, కాలము మారినది. ఇపుడు రైలు, మోటారు ప్రయాణమునకు కుజుని సాహాయ్యము, వాయువిమానప్రయాణమునకు వరుణుని శుభత్వము, నౌకాయాత్రకు ఇంద్రుని దయ అవశ్యముగ కావలసియున్నవి. అది యట్లుండె.

వివాహములకు శుక్రుని వదలి గురువునకే మన ప్రాచీనులు ప్రాముఖ్యము నేల యిచ్చిరి? తాత్కాలికనూతన సుఖానుభవపు రుచులకు మరపి, ఇతరప్రపంచమునే మరపించి నీతినియమములపట్ల నిరాదరము చూపు పరిస్థితులను తెచ్చిపెట్టి, ఈ శుక్రుఁడు,

"ఎందెందెందము కందళింప రహిమై
నేకాగ్రతన్నిర్వృతిన్
జెందున్ కుంభగత ప్రదీపకళికా
శ్రీ దోప, నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుగను నా
యింపే పరబ్రహ్మ, "మా
నందో బ్రహ్మ" యటన్న ప్రాఁజదువు
నంతర్బుద్ధి నూహింపుమా"

అని వరూధిని చెప్పిన శుద్ధాద్వైతవేదాంతమంత్ర రహస్యమును నూత్నదంపతుల కుపదేశించు నేమో యని మనవారి భయము! ఐహికధర్మమును, ఆముష్మిక ప్రయోజనమును గమనించని తృతీయ పురుషార్థము — అనఁగా భుక్తి ముక్తులకు వెలియైన రక్తి — స్పృహణీయము కానేర దని! కాననే, స్వధర్మపరిపాలనము నుపేక్షించని సక్రమవికాసము సమృద్ధిగా ననుగ్రహించు బృహస్పతి యాజమాన్యమునందే గృహస్థాశ్రమస్వీకారము జరుగవలెనని మన మహర్షులు శాసించుట. రాశిచక్రమున నవమ ద్వాదశరాసు లీ బృహస్పతియాధిపత్యములోనివి. అనఁగా, ధర్మస్థానము, మోక్షస్థానము ఇతని వనుట! గృహస్థాశ్రమమున ధర్మము నార్జించి, తన్మూలకముగనే పరమ ప్రాప్య వస్తువును పొందవచ్చునని బృహస్పతి సూచించుచున్నాఁడు కదా? ఈ గ్రహబలమందే వివాహము జరుగవలెనను మన ప్రాచీనుల యభిలాష కిది యర్థమని నా ఆశయము.

కాననే, మనము బృహస్పతిపై తగినంత గౌరవము చూపకపోదుమేమో యను శంకచే కాఁబోలు, మన గ్రంథములు సర్వతోముఖముగ బృహస్పతి యాధిక్యమును వర్ణించినవి. ఇది తప్పని నావాదమనుకొనరాదు. గ్రహస్వభావమునందలి వస్తుతత్త్వమును గమనించక, 'ఏకమూలికాప్రయోగ' ము చేయుటమాత్రము తగదనుటే నా విన్నపము.

# బృహస్పతి గోప్పదనము

జన్మలగ్నమున గురు వుండవలయునని శాసించు సూత్రమే ఇతరగ్రహముల సంబంధము కాని, దృష్టికాని ఉండరా దనుచున్నది. అవి యున్నచో గురువునుండి రాఁదగిన సత్ఫలము రాదని కదా యర్థము? అనఁగా గురువు తన నిసర్గ శుభత్వమును కోలుపోవుననుట ! ఇట్లనుటచే బృహస్పతికి ఫలప్రదత్వము పోయిన దనుకొనరాదు. అతని ఫలము వికాసమే, అభివృద్ధియే ! అదియును గొప్పదిగా నుండ వలయును ! కాని అభివృద్ధి యెట్టిదైన నేమి, మంచిదే యనఁగలమా ? సక్రమవికాసము గల యభివృద్ధినే కదా మనము కాంక్షించునది, కాంక్షింపఁదగినది ? అట్లు కానిచో, జలోదరము, మహోదరము, శోఫ, ఊదకాలు ఇత్యా ద్యభివృద్ధులను సత్ఫలము లనవలసివచ్చును, దేహముపై మొలుచు మాంసగ్రంథులను (కంతులను) చూచి హర్షించవలసివచ్చును. "పొందుపట్టుల నప్పులు పొడిచిపొడిచి," కన్ను మిన్ను కానరాక, స్వేచ్ఛగ వెచ్చపెట్టువానిని మహాభాగ్యవంతుఁ డనవలసివచ్చును.

" ఇహనగరే ప్రతిరథ్యం
భుజంగసంబంధ రుద్ధసంచారే,
శృణు సఖి, మమ మత మేత,
న్నకుల ప్రతిపాలనం శ్రేయః"

అని సిద్ధాంతీకరించిన భాగ్యశాలినివలె, భావసంకోచ కరములగు జాతి మత నియమ శృంఖలలను త్రెంచివైచి ప్రేమమయ జీవితవ్యాప్తి నవిచ్ఛిన్నముగ వైశాల్యపరచు కొన్న వామలోచనల భావౌదార్యమును, విశాలహృదయమును, స్వార్థత్యాగమును మనము మెచ్చుకొనవలసి యుండును. మోక్షానందము నతిసులభముగా సర్వులకును సాధించియిచ్చు " యోగము " నుపదేశించు చార్వాకమత మునే— మన బృహస్పతిగా రనుగ్రహించిన మతమే యిది— సర్వోత్తమ మని స్వీకరించవలసియుండును !

తక్కిన యంశముల మాట యట్లుండ, భోజనవిషయ మును విమర్శించినా దానిలో సయితము బృహస్పతి "బృహస్పతి"యే ! సమారాధనమునకో, "డిన్నరు"కో పోఁదలఁచిన వారు బృహస్పతి లగ్నమందో, దశమమందో కల యూదారుని యింటికిఁ బోయినచో సార్థకమగును కాని, శని ప్రాబల్యము గల గేస్తుని యాహ్వాన మంగీకరించిరేని, కొంత జాగ్రత్తతో నుండవలసివచ్చును. కారణాంతరములచే మంచి గుణములను గోలుపోయినపుడు బృహస్పతి తన యౌదార్యమును, దానికి వలయు సౌకర్యములను ఈయలేకుండినా, భోజనకూరత్వమునయినా ఇచ్చితీరునఁట. "లగ్నే జీవే భోజన కూరః" అను జాతక తత్త్వసూత్ర మీ రహస్యము నెంత బాగుగా వెల్లడించుచున్నదో ?

శ్రీనాథ కవిసార్వభౌముఁ డొకనాఁడు తనబంధువగు రామయామాత్యుని యింట విందారగించుచు నచటనిపై ఏ క్రింది పద్యము చెప్పెనఁట :

"గ్రామము లుండి, నిత్య పరి
కల్పిత ధాన్యము లుండి సంతత
శ్రీమహిళా కృపారస వి
శేషముచే కడతేరెఁగాక, మా
రామయమంత్రిభోజన ప
రాక్రమ మేమని చెప్పవచ్చు, నా
స్వామి యెఱుంగు తత్కళ
చాతురి శాకఫలప్రమాణముల్!"

ప్రబలుఁడై శుభుఁడైన బృహస్పతి వాస్తవముగా నా రామయమంత్రిజాతకమున లగ్నములోనే యుండితీరు నను కొందును !

పోనిండు! లగ్నములో గురువున్నచో, సుగుణము లబ్బుననుట కెవరుకాని సంశయింపరు. కాని, అట్టి గురువుపై సప్తమమున నున్న శనిదృష్టి పడెనేని ఆ సుగుణము లన్నియు నశించి, జాతకుఁడు పాతకి యగునని ప్రాచీనులు చెప్పిరి. "జీవేంగే, మదే మందే, పాతకీ." అని జాతక తత్త్వము. ఇపుడు లగ్నగత బృహస్పతి యేమయినాఁడు ? లగ్నమున గురువు, సప్తమమున కుజుఁడు నున్నచో జాతకుఁడున్మాది యగునఁట ! జాతకతత్త్వ సూత్ర మిది పరిశీలింపుఁడు : " ఇజ్యేంగే, కుజేస్తే. ఉన్మాదీ." లగ్నగత బృహస్పతివివేక మిపు డెందుఁబోయినది ?

పాపగ్రహము లట్లుండనిండు. శుక్రుఁడు శుభగ్రహము కాదని యెవ రనఁగలరు ? కాని, వివాహకాలమున శుక్రుఁడు బృహస్పతికి సమసప్తకములో నున్నచో, అది మహాదోషమని పెద్దలే చెప్పిరి.

" యదా జీవసితౌ చక్రే పరస్పర నిరీక్షితౌ,
సప్తమస్థౌ. తదా దోషో మూఢత్వా దతిరిచ్యతే."

చంద్రునికి సమసప్తకమున సయితము వివాహ కాలమున గురువుండరాదఁట : చూడుఁడు.

" దేవగురు ర్బంధ్వంతాం,
పత్యు ర్ద్విష్టాంచ దుర్భగాం కురుతే."

గ్రహముల సమస్తప శత్రుదృష్టిచే బృహస్పతి వలని ఫలములో వైషమ్య మేర్పడు నని పయి సూత్రములు సూచించుచున్నవి. కేంద్ర శత్రుదృష్టి సయితము, గ్రహ స్వభావముల ననుసరించి, గురువు ఫలమునకు దుష్పరిణామమును తెచ్చిపెట్టును. ఏవో కొన్ని యపవాదములు కానరావచ్చును కాని, ఇది సాధారణ ధర్మము. దశమ కేంద్రమున కుజగురువులుండి, సప్తమ కేంద్రమున రవి యున్నచో, కుక్కకాటువలన ప్రమాద మున్నదని యీ క్రింది సూత్రము సూచించుచున్నది: "జీవారౌఖే, ర్కేద్యూనే, శ్వదంశనాన్మృతిః"

ఇప్పటి కింత చాలును. శుభుఁడైనప్పుడు బృహస్పతి యిచ్చు సక్రమాభివృద్ధికి చదువరులే యుదాహరణముల నూహించుకోఁగలరు. దృష్టివలననో, సంబంధము వలననో చెడిన బృహస్పతి ఫలములలో వైషమ్యముగలుగు పద్ధతిని తెలుపుటకై దిఙ్మాత్రప్రదర్శనముగా పైదృష్టాంతముల నిచ్చితిని. అభివృద్ధివచ్చు ననఁగానే, అది మంచి దనుకొనుట పొరఁబా టనియు, ఆ యభివృద్ధి సక్రమాభివృద్ధి కాదేని అదియే దోషముగా పరిణమించు ననియు గమనించినచో, బృహస్పతిఫలమును మన మర్థము చేసుకొనఁగల్గుదుమనుటే నా విన్నపము.

ఈసందర్భమున నా కొక కథ జ్ఞప్తికివచ్చుచున్నది. కొన్ని సంవత్సరముల క్రిందట నొక పట్టణములో నేనున్నపు డొక యున్నతోద్యోగితో పరిచయము కల్గినది. నాకు జాతకములలో కొంత శ్రద్ధగలదని ఎవరివలననో విని, ఆ పెద్దమనుష్యుఁడు తన జాతకమును నా కిచ్చి చూడుమని కోరెను. జ్యోతిషశాస్త్రమునందు తనకు విశ్వాసము లేదనియు, ఇది తన కేదో 'ఉబుసుపోక' యనియు నతఁ డుపన్యసించెను. ఇప్పటికాలపు నవనాగరక విద్యావంతులలో గొప్పపదవులలో నున్నవారి కిది సామాన్యలక్షణ మగుటచే, అతని యుపన్యాసము నా కాశ్చర్యకరముగ నుండలేదు.

చదువరుల సౌకర్యార్థమై, ఆజాతకమునకు నిరయన, సాయన గ్రహకుండలుల నీక్రిందఁ జూపుచున్నాఁడను.

ఈ నిరయనకుండలిలో ఇంద్రావరుణ గ్రహములను జూపలేదు. అవి యక్కరలేనివారి కొఱకై వానిని వదలితిని. వలయువారు వరుణగ్రహమును తులారాశిలో ౧౦-౩౮ లో, ఇంద్రగ్రహమును వృషభరాశిలో ౧౩-౪౭ లో చేర్చుకొనవచ్చును.

| | | | |
|---|---|---|---|
| చ ౧౩-౫౧ | | రా ౪-౧౦ | |
| గు ౧౫-౫౭ | | | |
| | (నిరయనము) | | I ౧౫-౪౧ |
| | కే ౪-౧౦<br>బు ౮-౨<br>శు ౧౧-౫౯ | ర ౨౮-౪౯ | శ ౫-౦<br>కు ౨౧-౩౨ |

| | | | |
|---|---|---|---|
| గు౭-౧౮ | చ ౬-౧౦ | రా౨౬-౨౯ | ఇ౭-౬(వ)<br>X౭-౩౦ |
| | | | |
| | (సాయనము) | | |
| కు౪-౧౭ | వ ౨-౫౮<br>ర ౨౦-౭<br>కే ౨౬-౨౯<br>బు౨౯-౨౧ | శు౧౩-౫౧ | I ౭-౦<br>శ ౨౮-౧౯ |

ఈకుండలులకు నవాంశవిభాగ మీక్రిందిపథకమునఁ జూడనగును.

సింహలగ్నమున సింహనవాంశ (వర్గోత్తమాంశ)కుఁదగిన గాంభీర్యముకాని, రాజసముకాని జాతకుని ముఖమున కానరాదు. చక్కని ఆకారసౌష్ఠవము, మృదుమధురవాక్కు, నయవినయములతోడి ప్రవర్తనము, దాక్షిణ్యశీలత, ఋజుస్వభావము, వివేచనాశక్తి మున్నగు కన్యాలగ్నధర్మములే సమృద్ధిగ కానవచ్చుచుండెడివి. సౌందర్యమునకు వన్నెదెచ్చు సౌమ్యత అతని ముఖమున కొక అపూర్వశోభ నొసఁగుచుండెను. అధికారగౌరవమున కతని సాధుశీలత యలంకారము, కేంద్రములలో నున్న ధనుశ్శుక్రుఁడు, మీనగురువు

# బృహస్పతి గోష్పదసము

| గ్రహములు | నిరయనము | సాయనము | విశేషములు |
|---|---|---|---|
| ౧. రవి | వృషభము | మకరము | (అ) నీచ |
| ౨. చంద్రుఁడు | వృశ్చికము (అ) | వృషభము (ఆ) | (ఆ) ఉచ్ఛ |
| ౩. కుజుఁడు | మిథునము | కుంభము | |
| ౪. బుధుఁడు | సింహము | మీనము (ఇ) | (ఇ) నీచ (గ) వర్గోత్తమాంశ |
| ౫. గురువు | కుంభము (గ) | కన్య | (ఈ) } స్వాంశ |
| ౬. శుక్రుఁడు | తుల (ఈ) | వృషభము (ఉ) | (ఉ) } |
| ౭. శని | కుంభము (క) | మిథునము (ఖ) | (క) స్వాంశ |
| ౮. వరుణుఁడు | మకరము | కటకము | (ఖ) వర్గోత్తమాంశ |
| ౯. ఇంద్రుఁడు | వృషభము (చ) | ధనుస్సు | (చ) వర్గోత్తమాంశ |
| ౧౦. రాహువు | కుంభము | సింహము | |
| ౧౧. కేతువు | సింహము | కుంభము | |
| ౧౨. లగ్నము | సింహము (జ) | మీనము | (జ) వర్గోత్తమాంశ |

తమ గుణములను చాల స్పష్టముగా చూపినా రనవచ్చును. దశమకేంద్రమందలి రాహువు గొప్ప యధికారము గల పదవి నొసఁగినాఁడు. రాహువున్న రాశి కధిపతియై, శుభ క్షేత్రమగు ధనుస్సులో చతుర్థకేంద్రమం దున్న శుక్రుఁడు, ధనభాగ్యాధిపతి యగుటచే, గొప్ప రాజయోగము నను గ్రహించఁగలఁడు. చంద్రకుజుల సమసప్తకము శీఘ్రకోపము నిచ్చునుకాని, కేంద్రములలో శుభాధిక్యతచే, అది యంతగా పైన కానరాదు. నాల్గింటి శుక్రునివలన వాహనసౌఖ్యమునకు కొదవ యుండదు. మంచి మోటారుకా రొకటి ఉండనే యున్నదికదా! గొప్ప భూస్థితియు, మంచి గృహవసతియు కలవఁట!

ఈ జాతకమున వరుణుఁడు మొత్తముమీఁద హిత కాంక్షి. ప్రాపంచికవిద్యాస్థానమగు మూడింట నీగ్రహ ముండుట, ఇతరగ్రహముల ప్రాతికూల్యదృష్టి లేకుండుటేకాక, బృహస్పతినుండి యానుకూల్యదృష్టియే కలదు. జాతకుని బుద్ధి నిశితమైనది. ఉద్యోగధర్మమునకు సంబంధించిన వ్యవహారములలో నితని ప్రజ్ఞ పేరుకాంచినదే. మఱియు, జ్యోతిషమందును, తత్త్వశాస్త్రమందును కొంత ప్రవేశము, అభిలాష కలవు. (ఇవి రెండును వరుణగ్రహమున కభిమాన శాస్త్రములని పాశ్చాత్యుల మతము).

ఈ వరుణగ్రహస్థానమునుండి అర్ధకోణమిత్రదృష్టి (౬౦ భాగలదూరము) మకరరాశిలో ౩వ భాగలో నున్నది. జన్మకాలిక రవిస్థానమునుండి యీప్రదేశము ౪౩ భాగలతో నుండుట పాఠకమహాశయులు గమనించియుందురు. 'ఏకాంశ వర్ష' సంప్రదాయమున ౪౩ సంవత్సరముల వయస్సుననే రాజకీయోద్యోగమున నున్నతపదవి జాతకునికి లభించిన దన్నచో, వరుణగ్రహ మీజాతకమున శుభుఁడై యుండుట మన కర్థమగును. రవివరుణమైత్రి రాజకీయోద్యోగుల కమూల్య మయినది.

నిరయనముగా లగ్నాధిపతియై, నీచస్థానమం దున్న రవికంటె, సాయనముగా, లగ్నాధిపత్యము లేకున్నను, మిత్రస్థానమందున్న రవియే, తృతీయభావమునం దుండి జాతకుని జీవితముతో హెచ్చుగా సమన్వయపడుచున్నాఁ డనవచ్చును. అది యట్లుండె.

పంచమభావబిందువుపై పూర్ణముగనున్న బృహస్పతి మిత్రదృష్టికి ఫలముగా రామలక్ష్మణులవంటి పుత్రులు జాతకునికిఁ గలరు. కుజుని కేంద్రదృష్టియు నీ భావముపై నున్నది. కాని, భావమధ్యమునకు చాలదూర మగుటచే, దాని వెల అత్యల్పము.

రాజ్యస్థానమధ్యమందున్న యింద్రుఁడు ఉద్యోగపు వ్యవహారములలో జాతకుని చాకచక్యము, చాతుర్యము చూపును. మంచిమాటలతో నెవనికైనా "మఖమల్లు"టోపీ వేయు శక్తి ఇంద్రుఁడు జాతకునికి ప్రసాదించినాఁడు. అం దున్న రాహువు ప్రఖ్యాతి నిచ్చును.

ఇవన్నియు నుండఁగా, సప్తమభావమును చూచి నచో చదువరులు సంతోషపడకమానరు. 'కర్ణునౌదలనె భారతసంహిత నిల్పుచాడ్పునన్' జాతకమంతయు కళత్ర భావముపై నాధారపడినదా అనిపించును. సరిగా, అభావమధ్యమునందే నిలిచినాఁడు బృహస్పతి ? అందులో, అది యా గ్రహమునకు స్వక్షేత్రము—మీనరాశి!

"సుభగ, స్సురుచి రుదారః,
పితు రధిక, స్సప్తమే భవతి జాతః,
వక్తా, కవిః, ప్రధానః,
ప్రాజ్ఞో జీవే సువిఖ్యాతః"

అను 'సారావళి' వర్ణన మంతయు జాతకున కన్వ యించు ననుటలో నాశ్చర్యము లేదు. జాతకుని భార్య నిరుప మానసౌందర్యలావణ్యశాలిని. విద్యావతికూడ. గొప్ప భూ స్వామి ఏకపుత్రిక. ఆభిజాత్యమునకు, అంగసౌష్ఠవమునకు తగిన గాంభీర్య మామెకుఁ గలదు. క్రొక్కారు మెఱుపువలె నిగనిగలాడు దేహకాంతితో, సంధ్యారాగసమయములయందు సవిలాసముగ నాజవ్వని తనయింటి వసారాలో—భర్తగా రూరలేని దినములలో—నిలుచుకొన్నప్పుడు ఆయింటి కేదోయొక అపూర్వశోభ వచ్చుచుండెడిది. లాభాధిపతియైన చంద్రుఁ డష్టమ స్థానమున—అనఁగా, కళత్రస్థానమునకు ధనస్థానమున నిలిచి, చతుర్థభావమందలి శుక్రునిపై మిత్రదృష్టిఁ బరపుచున్నాఁడు. భార్యనుండి లాభకరమైన భూవసతి జాతకున కుండుట యొక విశేషము కాదు. దాదా పుగ లక్షరూప్యముల వెలచేయు భూవసతి కామె ఉత్తరాధి కారిణి! చతుర్థసప్తమాధిపతి 'బృహస్పతి' కదా ?

ఇఁక సప్తమ స్థానములో గురువున్నచోట, కళత్రము నందు శీల సద్గుణముల విచారించుట అధికప్రసంగ మగును. "కళత్రే జీవే ధర్మశీలా పతివ్రతా" అను జాతకతత్త్వ సూత్రము సుతసుఖ సౌభాగ్యసంపత్తులతో తులదూగుచున్న జాతకుని దాంపత్యజీవితమునకు వన్నె దెచ్చుచున్నది. బంగా రమునకు పరిమళ మబ్బినట్లు గదా ? ఇట్టి సందర్భములో "జీవే సప్తమే స్వదారరతః" అను సూత్రము చొప్పున, జాతకుఁడు పత్నీవ్రతుఁ డగుట యేమి యరుదు ?

లాభాధిపతియగు చంద్రుని యష్టమస్థితి భార్యానాశము తెలుపు ననుట సత్యమే. కాని, ప్రకృత మున్న గృహిణి రెండవ పరిగ్రహ మగుటచే, ఆలోపము నయితము బృహ స్పతి యనుగ్రహవశమున గొప్పగుణముగనే పరిణమించిన దనవచ్చును. పరిణయమైన యేడాదిలోపలనే ప్రథమ జాయ పరమపదము నందుటచే, తోడనే రెండవ వివాహము జరు గుటవలనను, ద్వితీయ భార్య సర్వవిధముల సుఖసౌభాగ్య సంధాయిని యగుటంజేసియు ప్రథమకళత్ర వియోగక్లేశము జాతకుని హృదయము నంటినది కాదు, అనవసరమే మో ?

ఆదర్శప్రాయమైన దీ జాతకము ! దీనిలో విషమ దశాకాలము రెండుచోట్ల కానవచ్చుచున్నది. వరుణగ్రహ మున కర్మకేంద్రస్థానము జన్మరవినుండి ౨౮ భాగలలో నున్నది. ఇరువదియెనిమిది సంవత్సరముల వయస్సుననే పితృవియోగము సంభవించినదఁట. రవి పితృకారకుఁడు కదా ? రవిచంద్రులకు జన్మకాలమున సార్ధకేంద్ర ప్రాతి కూల్యదృష్టి యున్నది. జన్మచంద్రునకు కేంద్రస్థానము రవినుండి ४౬ భాగలలోఁ గలదు. ఆవయస్సు మిత్ర వియోగమో, స్త్రీద్వేషమో, ఆశాభంగమో తెచ్చిపెట్టఁ జాలినది. విశేష మేమనఁగా, అప్పటికి జాతకుని వయస్సు నలుబదియారే !

జాతకమందలి గుణములనెల్ల నా యుద్యోగితో విపుల ముగా చర్చించితిని. తరువాత, ప్రకృతదశలోని దోషములను గూర్చి నా యూహలను దెలిపితిని. అట్టి విషమఫల మేదియు లేదని యాతఁడు తోడనే ప్రతియిచ్చెను. ఎన్నఁడో రావల సిన గొప్ప యుద్యోగపదవి మొన్ననే, మూఁడు సంవత్సర ముల క్రిందట వచ్చిన దనుట తప్ప, జీవితములో ఆశాభంగ మనునది యెఱుఁగ ననియు, మిత్రులతో వైమన స్యము కాని, స్త్రీలతో ద్వేషము కాని సంభవించు ప్రసక్తియే తనకు లేదనియు ఆయుద్యోగి యుపన్యసించెను. మఱి యీ దశ యేమయినట్లు ? జన్మకాల ప్రాతికూల్యదృష్టి గల గ్రహ ములకు చలనవశమున ద్వేషదృష్టి సంభవించెనేని, తప్పక యది దుష్ఫలము నీయవలయుననుట సామాన్యవిధి. జన్మ కాలపు వాగ్దానమును చెల్లించుట కా గ్రహము లంతకంటె మంచి యవకాశము లభించదు కాన, చంద్రుని యష్టమ స్థానస్థితి ఫలించియుండునా ?

"మీ భార్యగారి ధన మేమయిన నష్టమయినదా ?" అంటిని, క్షణకాల మతఁ డాలోచించి, ఏదో స్ఫురణకు వచ్చుట నభినయించి, "అవును. చాలా నష్టమైనది. చెడ్డదశఫలమే కావచ్చును ! ఇటీవలనే పెద్ద మొత్తము వెచ్చపెట్టి రవల పతక మొకటి నాభార్య కొన్నది." అని కథచెప్పెను.

భార్యకు వజ్రాభరణప్రాప్తి ! భర్తకు చెడ్డదశాఫలము! ఏమి నాటక మిది ? దశమకేంద్రమందలి మాయలమారి

ఇంద్రుఁడు నాకు సయిత మొక 'టోపీని' తయారుచేయు చున్నాఁ డనుకొంటిని. కోడివలె కూసి గౌతమునంతవానిని మోసపుచ్చినవానికి ఇతరు లేమి లెక్క!

"సరే! అర్థమైనది" అని ముగించితిని. తరువాత రాజయోగములు, ముద్రాధికారము, ఆయుర్దాయము, భూవసతి, సంతానము మున్నగు విషయములగూర్చి యేమేమో చర్చించితిమి. ప్రాచ్య పాశ్చాత్యపద్ధతులలోని వ్యత్యాసములు, ఇంద్రావరుణగ్రహముల ధర్మములు, వీనిని గుఱించి కొంత మాటలాడితిమి. "సప్తమభావమును గూర్చి యేమియు చెప్పలేదే?" అని జాతకుఁడు ప్రశ్నించెను. "మీ కళత్రస్థానము ప్రబలమైన బార్హస్పత్యక్షేత్రము, భాగ్యమంతయు బృహస్పతి యధీనములో నున్నపు డేమికొఱఁత?" అంటిని. "ఆ విషయమున కొదవ లేదను మాట సత్యమే: కాని సప్తమభావమున శుక్రుఁడు మేలు కదా గురువుకంటె?" అని యతఁడు పూర్వపక్షము నెత్తెను. "శుక్రుఁడు భోగి; స్వార్థము ముఖ్యము. మీనగురువు త్యాగి; పరార్థము ప్రధానము. ఇదే యిందలి తారతమ్యము." అని సమాధానము చెప్పితిని,

అందుపై నతఁడు తన భార్య యౌదార్యము, దాక్షిణ్యశీలత, దైవభక్తి, త్యాగము తెలుపు కథలను కొన్నిటిని వివరించి చెప్పి, "పురుషుని జాతకమునుండి భార్యశీలము తెలియునా?" అని యడిగెను.

పురుషుని జీవితమునందలి పరిణామములపై భార్య శీల స్వభావములకు కూడ కొంత యధికార ముండుట సాధారణముగా తప్పనిసరి యగుటచే, భర్తజాతకము నందలి సప్తమభావము నుండియు, తదధిపతి నుండియు, కళత్రకారకుఁడగు శుక్రునినుండియు భార్యశీలస్వభావములు కొంతవరకు ఊహింపఁగల్గుట సాధ్యమే. కాని భార్యజాతకముతో పోల్చినఁ గాని, అది పూర్ణముగా నుండదు. నా అభిప్రాయమును విని యా పెద్ద మనుష్యుఁడు, "ఇంకేమైనా విశేషములు సప్తమభావమున నున్నవా?" అని ప్రశ్నించెను. నా కేలనో నవ్వు వచ్చినది. కష్టముతో నాఁపుకొంటిని.

సప్తమ భావమును గూర్చిన విమర్శలో నే నతనితో చర్చించని విషయ మొక్కటి మాత్రమే మిగిలియున్నది. దశమకేంద్రమందలి యింద్రగ్రహము సప్తమాధిపతియై, సప్తమభావమం దున్న బృహస్పతికి పూర్ణకేంద్ర మందుచే కాక, కళత్రకారకుఁడై గృహస్థానమం దున్న శుక్రునికి సమసప్తకమం దుండుట పాతకమహాశయులు గమనించియే యుందు రనుకొందును. ఈ కారణమున శుక్రగురువు లిపువురును తమ సుగుణములను కొంతమైనఁ గోలుపోకతప్పదు, నీతినియమముల కట్టుబాట్లనుండి ఇంద్రుఁడు బృహస్పతిని విముక్తుని గావించినాఁడు. సార్వభౌముఁడు కావలెనన్నచో చట్టము లడ్డమగునా? మీనగురువు త్యాగి. ఇంద్రుని కటాక్షమతనిపై వచ్చెనేని, ఆర్తత్రాణవిషయమున అతని యనుకంప మేరయెఱుంగనిది: అర్థులలో దైన్యము, హైన్యము, నిస్సహాయత, దయనీయత హెచ్చినకొలఁది ఇతని స్వార్థత్యాగపు విలువ హెచ్చుట యొక విశేషధర్మము, ఇది యిట్లుండ, శుక్రేంద్రుల సమసప్తకదృష్టి ప్రేమవిషయమున ద్రోహమో, మోసమో తెచ్చిపెట్టఁగలది. ఈ శుక్రుఁ డుండునది బృహస్పతి యధికారమునకు లోఁబడిన చతుర్థస్థానము—అనఁగా, గృహము. గురుశుక్రుల పరస్పరకేంద్రవర్తిత్వము నవనవాభిరుచుల నిచ్చు శక్తి కలది. ఇట్టి శుక్రుని పై వచ్చు నింద్రగ్రహ దృష్టి మైమరపు కలిగించు నానందానుభవమునకై వస్తుసేవనమో, వ్యక్తిసేవనమో కోరునట్టిది. వివాహసహమబిందువు ధనుస్సు ౧౨ భాగయం దుండుటచే, ఇంద్ర గురుశుక్రుల యధికారమునకు లోఁబడి యున్నది,

రాబ్సన్ అను పాశ్చాత్య శాస్త్రజ్ఞుడు చెప్పిన సూత్ర మిది చూడుఁడు:—

*"Jupitor in the seventh house, no matter how strong, afflicted by molifies denotes strife in marriage".*

(పాపగ్రహ వేధ గల బృహస్పతి, ఎంత బలవంతుఁ డైన నేమి, సప్తమ భావమందున్నచో, దాంపత్యజీవితమున ఘర్షణ దెచ్చును.)

పైన వివరించిన గుణము లన్నియు భార్య కున్నవా, లేక భర్త కున్నవా? భర్త భార్యకు ద్రోహము చేయుచున్నాఁడా, భార్య భర్తకు మోసము చేయుచున్నదా? లేక యీ రెండును కలవా? ఇది చిక్కుప్రశ్న,

ఈ జాతకమున లగ్నసప్తమములలో సప్తమమే ప్రబలమైనది. లగ్నాధిపతి బుధుఁడు కేతుసంయోగముచే ప్రభావమును కోలుపోయినాఁడు. పైఁగా శుక్ర సంయోగము నఖిలషించుచు స్త్రీపరతంత్రతను దెలుపుచున్నాఁడు. ఇఁక సప్తమాధిపతి యన్ననో మహాబలశాలి అయిన బృహస్పతి.

జలమున్నచోట కార్య మారంభమై దుర్బలమగుచోట దాని ఫలము కానవచ్చుట సామాన్యముగ ననుభవములోనిది. మిట్టనుండి గదా పల్లమునకు నీరు ప్రవహించుట ? వాయు సంచారమందును, విద్యుచ్ఛక్తి ప్రసారమునందును ఇట్టి ధర్మమే వ్యాప్తిలో నుండుట చదువరు లెఱుంగుదురు. అగుటచే, ఈ యోగపుఫలము సప్తమమున జనించి లగ్నమునకు వ్యాపించుననుట సమంజసముగ నుండును, భర్తయందు సయితమీ గుణములు కొన్ని కానరావచ్చును. కాని, అవి ముఖ్యము కాదు. ఫలితార్థ మేమన, పై గుణములు భర్తయందుండి భార్య క్లేశపడుటకంటె అవి భార్యలో నుండి భర్త క్లేశపడుటకే హెచ్చుగా సంభవ మున్నదనుట !

ఇట్లనుటచే, జాతకుని భార్య స్వైరిణే యనుటకాదు. అట్టి వ్యాపారమునకు బృహస్పతియొక్క సహజవివేకము కాని, ధనుష్కుని గాంభీర్యముకాని, అవకాశ మీయవు. శరణాగత త్రాణమునకై కొంత దోషమునకైన స్వాల్పదయాపవు లుందురా? అనన్యగతికుఁడై, ఆర్తుఁడై, దయనీయస్థితిలో నున్న అర్థి యేర్పడినచో, అపు డామెత్యాగబుద్ధి కితరధర్మములు స్ఫురించకపోవచ్చును. లేదా, కారణాంతరములచే మైమరపు వచ్చినపుడో, మనోదౌర్బల్య మేర్పడినపుడో "పొరఁబాటు" జరిగి, తరువాత అరుచికే "అలవాటు" పడవచ్చును. కారణమేమయిన నేమి, భర్తదృష్టిలో నిది ద్రోహముగా కానవచ్చుట యస్వాభావికము కాదు.

భర్త సింహలగ్నమువాఁడైనచో, ఏదో ప్రమాదము తప్పక జరిగియుండును. కాని యతనిది కన్యాలగ్నము. సిగ్గరితన మున్నదికాని, సాహసము లేదు. పరాక్రమము కంటె ప్రాపంచికవివేకమే హెచ్చు. పాపము! అతఁ డేమి చేయఁగలఁడు ? శిక్షించుటకా ప్రౌఢ ! అవమానించుటకా లోకోత్తరలావణ్యవతి ! బుద్ధిచెప్పుటకా విద్యావతి! పరిత్యజించుటకా లక్షచేయు భూస్థితి కుత్తరాధికారిణి!! అతని పాలిటి కామె "అణగని ఆణిముత్యము."

సామాన్యముగా వాడుకలోనుండు జాతకసూత్రము లన్నియు అతనికి పరిచితములు. సప్తమస్థానమున బృహస్పతి కానవచ్చుచున్నాఁడు. నిరయనముగా ఆ గ్రహ ముండుట వర్గోత్తమాంశలో! భాగ్యవతియేకాని, భార్యశీలములో నతని కేమో లోపము కానవచ్చుచున్నది. బృహస్పతి కింతేనా వెలయని అతని హృదయము శాస్త్రమును ప్రశ్నించుచున్నది. బృహస్పతిపై గౌరవము తగ్గినది. విశేష మేమని ప్రుచ్చిప్రుచ్చి యడుగుచున్నాఁడు. శాస్త్రముపై విశ్వాసము లేదఁట? ఎట్లు వచ్చును ?

ఇవన్నియు నాయూహలు. సరేకాని, అతని ప్రశ్నకు ప్రతిచెప్పుట మాత్రము చాల కష్టముగా తోఁచినది. ఎట్టకేల కిట్లంటిని: "అత్యంతదయార్ద్రహృదయము మీభార్యది. అర్థికి నాస్తియనుట ఆమెచేత కానిపని. మహాపతివ్రత: ప్రేమ కలచోట ఆవేళము చూపునట్టి స్వభావము: మైమరచి ఆనంద మనుభవించు మనస్సు!"

"సత్యము! సేవకులపై సయితము నాభార్య కతిప్రీతి" అని యందుకొని, క్షణకాల మాఁగి, నాహృదయమును భేదించి పరీక్షించువానివలె నిశ్చలముగ నాపై కొంతతడవు దృష్టిబరపి, ఆయుద్యోగి, "ఆవేళ మంటిరి. జ్ఞప్తికి వచ్చినది, రెండు సంవత్సరములక్రింద నొక అమావాస్యనాఁటి రాత్రి యకారణముగ భయపడి, కెవ్వున కేకవైచి, తన కేదో విచిత్రదేవతా స్వరూప మగుపడెనని చెప్పినది. అప్పటి నుండి అపుడపుడులికిపడుటయు, మైమరపు వచ్చుటయు కలదు." అని తెల్పివలికి, "గ్రహచేష్ట అని కొంద రనుచున్నారు." అని ముగించెను.

"శుక్రగురువులకు ఇంద్రగ్రహవేధ కలదు. మనోచాంచల్యము సహజము" అని ప్రతియిచ్చితిని.

"దివా కాకరుతా ద్భీతా, రాత్రౌ తరతి నర్మదాం"

అను వాక్యము స్మృతికి వచ్చినది. అప్పటి కీ చర్చ నాపితిని. మాప్రసంగము పాకము ముదిరి ప్రమాదకరమగు మార్గము నంటిన దని నాభయము.

మరల నొకటిరెండుమార్లు జ్యోతిషప్రసంగమునకై ఆ యుద్యోగి ప్రయత్నించెను. కాని, ఎందులకీ గొడవ యని తప్పించుకొంటిని. కొన్నాళ్లలోనే నేనాపురము వీడవలసి వచ్చినందున నా చిక్కు వదలినది. తరువాత కొన్ని దినములలో నే నొక కథ విని ఆశ్చర్యపడితిని.

ఆజాతకుని యింట నొక సేవకుఁ డుండెను. ప్రావృట్కాలమేఘమువంటి దేహకాంతిగల కుబ్జుఁ డతఁడు. వయస్సులో జాతకుని భార్యకన్న సుమారు పదిసంవత్సరములు చిన్నవాఁ డాయువకుఁడు. చక్కని యాకారపుష్టి కలిగి, అభ్యంజనము చేసిన ఆళ్వారువిగ్రహమువలె వాఁడు చూపట్టుచుండెను, నిరాశ్రయుఁడై నిరుద్యోగిగనున్న యాతరుణునిపై కరుణించి, గృహసేవకుఁడుగా జాతకుఁడు



ఉదయకాంతులు

ఛా॥ చిత్రకారుడు : శ్రీ తలిసెట్టి రామారా

చేయిపట్టినాఁడు. తగినంత తెలివితేటలు కలవాఁడగుటచే, కొన్నాళ్లకే వాఁడు సేవకులలో నెల్ల నమ్మికబంటైనాఁడు. ఇంటి యాజమాన్య మంతయు క్రమముగా వానిపై వ్రాలినది. ఒకప్పుడు యజమానురాలికి కొంత దేహాయాసము కలుగఁగా, ఆమెకు బాగుగా నుపచరించినాఁడు. పాదము లొత్తుట, జ్వరతాపము పరీక్షించుట, కైదండ యిచ్చుట, పడక సవరించుట ఇత్యాదులు పరిచయమైనవి. అకారణమున యజమానురాలి యవ్యాజకృపకు వాఁడు పాత్రుఁడైనాఁడు. ప్రొద్దుపోని సమయములలో, ఆమె వానితోడనే పడకటింటిలో పాచికలాడ నారంభించినది. క్రమక్రమముగ యజమానుఁడు పురములో నుద్యోగధర్మమున బహిరంగముగ ప్రజాసేవ చేయుచుండు సమయములలో, భృత్యుఁ డంతఃపురములో సేవకధర్మమున యజమానురాలి యంతరంగసేవ చేయసాగెను. యజమానురాలిపై వాని కత్యంతభక్తి కుదిరినది. యజమానునికి సలుపవలసిన పరిచర్యలు కొంత మందగించినవి. కొన్నాళ్లలో యజమానునికి ఏమి కారణమో, సేవకునిపై నాగ్రహము వచ్చినది. ఉద్యోగమునుండి విముక్తుని చేసి యజమానుఁడు వాని నింటినుండి వెడలించినాఁడు. కన్నుల నీరుతో పోలేకపోలేక వాఁడు వెడలిపోవుచుండఁగా చూచి, ఆరాటపడి, యోర్వలేక వానిని క్షమింపుఁడని యజమానురాలు భర్తను ప్రార్థించి, "వానిలో నేమిలోపముండినా, తప్పు నాదే" అని వాని పక్షమున వాదించినది. కాని, భర్త క్షమించని కారణమున వాఁడు వెడలిపోవలసివచ్చెను. మరునాఁ డుదయమున కార్యవశమున భర్త గ్రామాంతరమునకు వెళ్లఁగా, మధ్యాహ్నమందే సైకెక్కి యొంటిగా నామె బయలుదేరినది. "రమ్మని బాబు రాఁగా, అమ్మగారింటికి పోవుచున్నాను" అని యితరసేవకునితో భర్తకు సమాచారము చెప్పి పంపినది. ఆమరునాఁడే ఆత్రమున భర్తసయితము మత్తగారి యూరికి వెళ్లఁగా అచట పుట్టినింటిలో యజమానురాలును, ప్రాఁత సేవకుఁడును కానవచ్చినారు. నాలుగయిదు దినము లుండి, ప్రాఁతసేవకునికి వానియుద్యోగ మిచ్చి అతఁడు భార్యతోఁగూడ వానిని మరల పిల్చుకొనియే వచ్చెనఁట! ఇదంతయు కొన్నినెలలక్రిందనే జరిగిన కథ యని వింటిని.

చంద్రవంశము నుద్ధరించిన తారపై ననుగ్రహము చూపిన దయాశాలికదా బృహస్పతి? ఇంద్రుని ప్రార్థననలననే అట్లు చేసియుండును. అది యట్లుండె.

గ్రహముల స్వభావ మతివిచిత్ర మైనది. నరస్వభావ మంతకన్న విచిత్రము! కానసే,

> "స్త్రీణాంచ చిత్తం, పురుషస్య భాగ్యం
> దేవో నజానాతి, కుతో మనుష్యః"
> అని యొక యనుభవశాలి హెచ్చరించుట.





**7-వ భారతఇ హాసమహాసభ, మద్రాసు ంధ్రప్రతినిధులు, అధ్యక్షుడు, అభిమానులు**

పైవరుస ఎడమనుండి- ప్రొఫెసరు స్. హను తరావు, రాళ్లబండి సుబ్బారావు, భూపరాజు వెంకటకృష్ణరావు, గు వెంక వు, ప్రొఫెసరు కె ఎ నీలక సురేంద్రనాథసేన్ (అధ్యక్షుడు), డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యు , వే ము వేంకటరాయశాస్త్రి, సిద్దిక్ హైదరాబాదు) గార్లు.

క్రిందివరుస: ఎడమనుండి- ఓరుగంటి రామచంద్రయ్య, స్. కామేశ్వరరావు, డా. మారేమండ రామారావు, నేలటూరి వెంక మ య్య మల్లంపల్లి సోమశేఖరశర్మ నంతరావు భోజీ (వలంటీరు పైను) గార్లు.

# పరివర్తనం

[ కథానిక ]

= 'వనఫూల్' =

ఖర్జూరపు బెల్లంతో చేసిన మిఠాయి తిన టంవల్ల నా నోరంతా చేదుఎక్కింది. కాని మిఠాయి బాగానే ఉంది.

అయితే ఈకథ మొదటినించీ వినండి.

*  *  *

హరిమోహనుడు గొప్పవాడు. ధనాభావం అతనికి లేదు. అంచేత చికిత్సలోపం వల్ల అతను చచ్చిపోడని నాకు తెలుసు. డబ్బుద్వారా ఎంత చికిత్స కొనవచ్చునో అంతా కొంటాడు, కొంటున్నాడుకూడా. ఇద్దరు ప్రసిద్ధికెక్కిన డాక్టర్లు రోజూ రెండుసార్లు వచ్చి అతన్ని చూసిపోతున్నారు. కావాలంటే ఇద్దరు నర్సులు కూడా వచ్చి అతని శుశ్రూషభారం నెత్తిని వేసుకునేవాళ్లే; కాని సరమ వొప్పుకోలేదు. తనే స్వయంగా భర్తకు పరిచర్యచేయటం మొదలుపెట్టింది. ఆమెసేవానైపుణ్యం చూసి ఇద్దరు డాక్టర్లూ కూడా పరిచర్యలో లోపమేమీ జరగటం లేదని వొప్పుకున్నారు. డబ్బు తీసుకునే నర్సు ఇంత చేస్తుందో లేదోకూడా సందేహమే.

కాని రోగం చాలా ప్రమాదకరమైనది—క్షయ. నోటినుంచి రక్తం పడుతున్నది; రోజూ జ్వరం విడవకుండా ఉంటున్నది. కఫ్లె పరీక్షించారు. క్షయకీటాణువులుకూడా కనిపించినై. ఇక సందేహానికికూడా అవకాశం లేదు. డబ్బుతూకంతో చికిత్స చేయించవచ్చు, కాని లాభం ఉంటుందని తోచలేదు. అంచేత అతని జీవితనాటకానికి తెరపడటం చాలా దగ్గరికి వచ్చిందని అనుకోసాగాను.

హరిమోహనుడు నా బాల్యమిత్రుడు. క్లాసులో ఇద్దరం ప్రక్క-ప్రక్కనే కూర్చునేవాళ్లం. అంచేత ఆ ఘనిష్ఠత స్నేహంక్రింద మారింది. ఎంచేతనో చెప్పలేను. అది ఇంకా నిలిచిఉందికూడా. న్యాయానికి ఉండవలసింది కాదు. ధనికునీ, దరిద్రునీ స్నేహం క్షణభంగురం. మా అదృష్టంవల్ల అది ఎందుకు నిలిచిందో చెప్పలేను. ఎందుకైనా నిలవనీయండి, నేనుమాత్రం రోజూ అతని క్షేమం కనుక్కోటానికి వెళ్లుతుండేవాడిని.

అసలు ముఖ్యంగా వెళ్లడం ఎందుకంటే, హరిమోహనుడికి ఈప్రపంచంలో డబ్బూ, భార్యాతప్ప ఇక నా అనటాని కేమీ లేదు. బెల్లం ఉంటే చీమలు చేరకుండాఉండవు! రెండు లింగాలకూ చెందిన చాలా చీమలు ఈయింటికి రాకపోకలుకూడా మొదలుపెట్టినై! కాని హరిమోహనుడి జబ్బు నిఖరంగా క్షయ అని తేలినతర్వాత ఈ పిపీలికలు ఒక్కటొక్కటే అంతర్థానంకావడం మొద

లుపెట్టినై. బహుశా బెల్లపుగిడ్డంగి ఉన్న ఇంకోచోటికి చేరిఉండవచ్చు! పోనివ్వండి ఆసంగతి. మొత్తానికి నేను ఒక్కణ్ణే మిగిలాను. స్నేహితుడి భార్య కావడంవల్ల సరమతో నాకు ఉన్న మామూలుపరిచయం క్రమంగా ఎక్కువకావడం మొదలుపెట్టింది- ఇప్పుడు తోస్తున్నది నాకు, అలా కాకుండా ఉన్నా బాగుండేదని.

హరిమోహనుడు కూర్చుని దగ్గుతున్నాడు.

గుండెలు పగిలిపోయే క్షయదగ్గు!

దగ్గు తగ్గినతర్వాత అతను-"నాగొంతు అంతా చెడిపోయింది. మందు రాచీ రాచీ-పుక్కిలించి ఊసీ ఊసీ నేను హైరాను అవుతున్నాను. ఐనా దగ్గు ఏమీ తగ్గటంలేదు, ఎందుకో చెప్పూ!" అని నన్ను అడిగాడు.

"తగ్గుతుంది, తగ్గుతుంది - ఎందు కంత గాభరాపడతావు?" అన్నాను.

"గాభరాపడే బాపతు కాదు, మనం! కాని ఈదగ్గు ఉండే చాలా వేధిస్తున్నది" అని ఈ రెండుమాటలూ చెప్పి మళ్లీ దగ్గటం మొదలుపెట్టాడు.

కాసేపు ఇద్దరమూ మాట్లాడలేదు.

"కళ్లె పరీక్ష చేస్తే ఏమీ కనిపించలేదట, విన్నావుగా? ఏమీ ఉండదనికూడా నాకు ముందే తెలుసు. ఇన్‌ఫ్లూయెంజాఎటాక్ అని నా అనుమానం"అన్నాడు హరిమోహనుడు.

సరమ ఒక కప్పు పాలు తీసుకుని గదిలోకి వచ్చింది.

హరిమోహనుడికి మళ్లీ దగ్గు వచ్చింది. తగ్గినతర్వాత "మళ్లీ అదేమిటీ?" అని అడిగాడు సరమను.

"పాలు"

"ఇప్పుడు మళ్లీ పాలెందుకూ?"

"డాక్టర్లు చెప్పిపోయారు ఇవ్వమని"

"తెంచుతున్నారు నాదుంప-కాసేపన్నా నాకు విశ్రాంతి ఇవ్వరా? ఇంతకుముందే-" మళ్లీ దగ్గటం మొదలుపెట్టాడు హరిమోహనుడు. దగ్గు తగ్గినతర్వాత "- ఇంతకుముందే మందు త్రాగాను. ఆతర్వాత గార్గలింగు, మళ్లీ స్ప్రే, ఆతర్వాత పళ్లరసం — ఇప్పుడు మళ్లీ పాలు!"

"బాగా తింటేనే త్వరలో లేచి తిరుగుతారని డాక్టర్లు చెప్పారు. పాలుకూడా ఎక్కువ తేలేదు, తీసుకోండి" - సరమ కప్పు అందించింది.

హరిమోహనుడు రెండుగుక్కలు త్రాగి "ఇక వద్దు, నన్ను వదిలిపెట్టండి, మీకు పుణ్యం ఉంటుంది. నాకడుపులో ఖాళీకూడా లేదు" అన్నాడు.

"ఉహుఁ-ఇంకొంచెం త్రాగండి. మీరుకూడా చెప్పండి కాస్త" అన్నది నాతో. నేనుకూడా బలవంతంచేశాను.

"సరే, నీమాట దక్కించటానికి ఇంకో గుక్క త్రాగుతాను"

అరకప్పుకు ఎక్కువ అతను తాగలేదు.

సరమ కప్పు తీసుకుని ప్రక్కగదిలోకి వెళ్లింది. నేనుకూడా లేచాను. పొద్దుకూడా

పోయింది. సరమకు ఒక్కమాట చెప్పిపోవాలి: ఔంపరేచరుసంగతి హరిమోహనుడికి చెప్పవద్దని డాక్టర్లు చెప్పారు.

"తొమ్మిదయింది. మళ్లీ రేపు వస్తాను" అన్నాను అతనితో.

"సరే"

హరిమోహనుడు ప్రక్కకు తిరిగి పండుకున్నాడు.

*　　*　　*

ప్రక్కగదిలోకి వచ్చాను. అక్కడ దృశ్యం చూసేవరకు నాకు ఆశ్చర్యం వేసింది. సరమ హరిమోహనుడు ఎంగిలిచేసిన పాలు తాగుతోంది!

"ఏమిటీ మీరు చేస్తున్నదీ?" అన్నాను నేను.

పట్టుపడటంచేత సరమ కొంచెం సిగ్గుపడింది. ఆ ఎర్రబడ్డ ముఖంతోనే "అఁ, అదేమీా లేదులెండి" అని, ఆతర్వాత కొంచెం కుదుటబడి "మీారెలాగూ చూశారు. కాబట్టి ఈసంగతి ఎవరికీ చెప్పకండి" అన్నది తొట్రుపాటు లేకుండా.

"సరే, చెప్ప ననుకోండి. కాని మీారు ఎంగిలిపాలు తాగుతా రెందుకూ?"

సరమ కొంచెం నవ్వి "భర్త ఎంగిలి తింటే తప్పేముంది?" అన్నది.

తప్పు ఏమిటా!

క్షయ ఎంత భయంకరమైన అంటువ్యాధో, దాన్నిగురించి నాకు తెలిసినంతవరకు చెప్పాను. సరమ ఆదినించి తుదివరకూ ఎదురుచెప్పకుండా విన్నది. ఆతర్వాత మెరుస్తున్న రెండుకళ్లూ నామీాద నిలిపి "నాకు అంతా అర్థమైంది. కాని ఒక్కవిషయం నాకు తెలియజెప్పతారా? వారు బ్రతకకపోయినట్లయితే నేను బ్రతికిఉన్నందువల్ల ఏమన్నా లాభం ఉందా? పిల్లలన్నా ఉన్నట్టయితే ఒకవిధంగా ఉండేది అనుకోండి!" అన్నది.

నేను చాలాసేపు ఆమెకు హితోపదేశం చేశాను. ఆమె తల వంచుకుని నవ్వుముఖంతో అన్నీ విన్నది-అతీ పతీ చెప్ప లేదు.

*　　*　　*

హరిమోహనుడి జబ్బు నానాటికీ ఎక్కువవుతున్నది. అతనిది క్షయజబ్బు అన్నసంగతి అతనిదగ్గర ఇక దాచటానికికూడా వీలు లేకపోయింది. అతనికి తెలిసినతర్వాత చాలా గాభరాపడ్డాడు. అతన్ని చూస్తున్న ఇద్దరు డాక్టర్లూకూడా ఆదుర్దాపడి ఇంకా ఇద్దరు డాక్టర్లని తీసుకొచ్చారు. నలుగురూ కలిసి కొన్ని యక్సురేఫొటోలు తీయించాలని నిర్ణయానికి వచ్చారు. నిర్ణయానికి రావటమే తడవు, యక్సురేలు తీయించారు. వాటిని బట్టి చూస్తే జబ్బు ఒక్క ఊపిరితిత్తికేననీ, రెండోది బాగా ఉన్నదనీ తేలింది. శానిటోరియంకు వెళ్లి శస్త్రచికిత్స చేయిస్తే నయం కావచ్చునని సలహాయిచ్చారు.

ధనలోపం లేదు. హరిమోహనుడు వెంటనే శానిటోరియంకు వెళ్లాడు. సరమ కూడా వెంటవెళ్లింది.

*

ఆతర్వాత చాలారోజులవరకు హరిమోహనుడి కబురు నాకేమీా తెలియలేదు.

కొంతకాలం ఉత్తరప్రత్యుత్తరాలు జరిగినై కాని, తర్వాత క్రమంగా ఆగిపోయినై. హరిమోహనుడు వెనకటికంటే కొంచెం బాగుపడ్డాడనిమాత్రం తెలిసింది. ఆతర్వాత హరిమోహనుడి విషయమై నేను అంతగా పట్టించుకోలేదు. అతనుకూడా నాకు ఉత్తరాలు వ్రాయలేదు. హఠాత్తుగా ఒకనాడు హరిమోహనుడు స్విజర్లాండు వెళ్లాడని తెలిసింది. ఎందుకో, ఏంపనిమీదో నాకు తెలియలేదు. డబ్బుంది, వెళ్లక ఏమి చేస్తాడని అనుకున్నాను!

నేను విరామం లేకుండా అదే గుమాస్తాపని చేస్తున్నాను. తాహతును మించి తెలుసుకోవటంకూడా అనవసరమే. అసలు ఆ వీలుకూడా లేదు: హరిమోహనుడు నాకు అడ్రసు ఇచ్చిపోలేదు.

* * *

పదిసంవత్సరాలు గడిచినై.

హరిమోహనుడి సంగతి దాదాపు మరిచేపోయాను. ఇలాంటి పరిస్థితిలో హఠాత్తుగా అతని దగ్గరనించి ఉత్తరం వచ్చింది. రెండే ముక్కలు

"భాయీ నరేశ్!
వచ్చే మంగళవారం నేను కలకత్తా వస్తున్నాను. నన్ను కలుసుకో,
హరిమోహన్"

అడ్రసు చూశాను. హరిమోహనుడు వాళ్ల ఊరినించి రాశాడు. అతను ఈ దేశం ఎప్పుడు వచ్చాడోకూడా నాకు తెలియదు.

* * *

మంగళవారంనాడు ఆఫీసునించి తిరిగి వస్తూ వాళ్లఇంటికి వెళ్లాను. అతను ఇంట్లోనే ఉన్నాడు. చాలా మర్యాదచేసి నన్ను కూర్చోబెట్టాడు. హరిమోహనుణ్ణి చూసి నేను ఆశ్చర్యపోయాను. అతని ముఖం నెత్తురుపట్టి తళతళలాడుతున్నది! ఎవరనుకుంటారు, అతనికి క్షయ వచ్చిందని!

"బాగా నయమైంది కాదూ?" అని అడిగాను.

"ఆఁ. కంప్లీట్‌గా."

ఏఏ డాక్టర్ల చికిత్సానైపుణ్యంవల్ల అతని ఈ వ్యాధి నిర్మూలించిందో, వాళ్లని అమితంగా ప్రశంసించటం మొదలుపెట్టాడు.

"స్విజర్లాండు వెళ్లావుకదూ?"

"ఆఁ."

"ఎలా ఉందీ?"

"అద్భుతంగా! పుస్తకాల్లో చదివినదానికంటే ఎన్నోరెట్లు అందంగా ఉంది. పద, పైకి పోదాము."

పైకి వెళ్లాము. పైకి పోగానే హరిమోహనుడు కేకలు మొదలుపెట్టాడు: "సరమా, ఎక్కడ నీవు? నరేశ్ వచ్చాడు: ఘంహారమూ, టీ తీసుకురా—కూర్చో, కూర్చో."

మంచి ఖరీదైన సోఫా. జాగ్రత్తగా కూచున్నాను. హరిమోహనుడు అడగటం మొదలుపెట్టాడు:

"ఆఁ. ఆతర్వాత, నీసంగతు లేమిటో చెప్పు! నువ్వు చాలా మారిపోయినట్టు కనపడుతున్నావు. చెంపలంతా నెరిసిపోయినయ్యోయ్! ఈమధ్యనే ముసలివాడివయ్యావా! ఆదేశంలో యాభైఏళ్లకుగాని అసలు యౌవనం ఆరంభించదు—తెలిసిందా?"

'ఆరంభించదు' అనే మాట కొంచెం వత్తాడు.

నాకూడా రోజూ కొంచెం జ్వరం రావటం, డాక్టర్లు క్షయ అని సందేహించటం జరుగుతున్నది. కాని ఈసంగతి అతనికి చెప్ప లేదు; చెప్పికూడా లాభంలేదు. అందుకని అన్నాను:

"ఈదేశానికీ ఆదేశానికీ చాలా తేడా ఉంది, హారీ! అదీకాక ఇంకోసంగతి నువ్వు మరచిపోతా వెందుకూ? నేను నాఇరవయ్యో యేటినించి గుమాస్తాపని చేస్తూవస్తున్నాను–ఊపిరి పీల్చటానికికూడా తీరికలేదు!"

"అయితే ఏం? పనిచేస్తే మనిషికి రోగం వస్తుందా?" అని హారిమోహానుడు బిగ్గరగా నవ్వాడు. ఇల్లు అదిరిపోయేట్టు నవ్వడం హారిమోహానుడిలో విశేషం. అతని నవ్వు ఆగలేదు, అక్కడికక్కడికీ ఎక్కువైంది. అతని దేహంలోని ఆరోగ్యమూ, మనసులోని తారుణ్యమూ చూసి నాకు అసూయ కలిగింది. ఇరవైయైదుఏళ్లు వచ్చినతర్వాత అతని వయస్సు ఏమీ పెరిగినట్టుగా లేదు. అక్కడే ఆగిపోయింది!

సరమ ఫలహారపు పళ్లెం తీసుకుని గదిలోకి వచ్చింది.

సరమను చూసి నేనింకా ఆశ్చర్యపోయాను. పదిసంవత్సరాలలో మనిషి ఇంత మారిపోగలదా?

నేను దీక్షగా ఆమెముఖంవంక చూడటంచేత, సరమ కొంచెం ముడుచుకుపోయింది.

"టీ తీసుకువస్తాను!" అని ఫలహారపు పళ్లెం ముక్కాలిపీటమీద ఉంచి వెళ్లిపోయింది. ఎవరీమె!

"సరమ ఏమాత్రం గుర్తుపట్టటానికి వీలు లేకుండా ఉంది! ఈపదేళ్లలో చాలా మారిపోయిం దనుకుంటాను." అన్నాను హారిమోహానుడితో.

హారిమోహానుడు రెప్పవాల్చకుండా కాసేపు నావంక చూసి, ఆతర్వాత అన్నాడు: "ఆఁ. అసలే మారింది. ఇప్పుడు నువ్వు చూసిన సరమ ఆ వెనుకటి సరమ కాదు. ఆ సరమ చాలాకాలంక్రిందటే చచ్చిపోయింది. దానికికూడా క్షయవచ్చింది–రెండులంగులకూ." కాసేపు ఆగి మళ్లీ అన్నాడు: "ఆఖరిదశలో పేగులుకూడా చెడిపోయినై. చాలా ఖర్చుపెట్టాను, కాని బ్రతకలేదు."

ఇద్దరం కాసేపు మాట్లాడలేదు. హారిమోహానుడు మళ్లీ మొదలుపెట్టాడు:

"ఉండలేకపోయాను — రెండోమాటు వివాహం చేసుకోకతప్పలేదు. వెతికివెతికి ఆఖరుకు సరమపేరు గల పిల్లను పట్టుకోగలిగాను. ఆ పేరు నాకు నోటపట్టిపోయింది. పోయినవాళ్లు ఎలానూ రారనుకో. ఎలాగైనా పేరు—"

ఆగాడు. సరమ టీసరంజామా తీసుకొని వాకిట్లోనించి వస్తున్నది.

సరమ టీ టేబిలుమీద పెట్టి ఫలహారపుపళ్లెం హారిమోహానుడిముందుకు నెట్టగానే

హరిమోహనుడు— “అన్నిత నేను తినలేను! ఎంత పెట్టావు నాకూ!” అన్నాడు.

సరమ అంటున్నది: “డాక్టరుగారు మిమ్మల్ని బాగా తినమన్నారు. ఈమధ్య మీ రసలు బొత్తిగా తినటమే లేదు—మీ రన్నా చెప్పండి మీ స్నేహితుడికి.” అన్నది నాతో.

“నరేశుడికోసం ఖర్జూరపుబెల్లంతో చేసిన మిఠాయి తెచ్చావా? అతనికి ఆ మిఠాయి అంటే చాలా ఇష్టం!” అన్నాడు హరిమోహనుడు.

“ఆఁ. ఇదిగో తెచ్చాను.” అన్నది సరమ.

హరిమోహనుడు నవ్వుతూ ఒక ప్లేటు ఖర్జూరపుబెల్లంమిఠాయి నా ముందుకు నెట్టాడు.

అను : ‘చక్రపాణి’




మందులకేటలాగు నిజమైనచో

# పాత పరిచయం

[ కథానిక ]

= శ్రీ క్రొవ్విడి లింగరాజు =

సర్కారునౌఖర్లకు ఆదివారం ఆటవిడుపురోజు. వారంపొడుగునా రోజువారీతంతు ఒక్కటేనాయిరి. ప్రొద్దున్నే లేవడం; కాగితాలు ముందేసుకు కూచోవడం; పదిగంటలు అయీ అవడంతోనే ఉడుకూ మిడుకూ రెండు మెతుకులు ఆదరాబాదరాగా నోట్లో వేసుకుని, యథాశక్తిగా వాహనంలోనో, నడకనో పడి ఆఫీసుకు చేరుకోవడం — ఇంతే. ఆప్యాయంగా ఇల్లాలిచ్చిన తాంబూలాన్ని సేవించడానికిగాని, తిన్న మెతుకులు జీర్ణముఖాని కొచ్చేదాకా విశ్రాంతిపొందేందుకుగాని వాళ్లు నోచుకోలేదు. ఆసౌఖ్యమల్లా ఆదివారంనాడే. వారంలో జరగవలసిన ఇతరపనులన్నీ ఆనాటికి వాయిదాపడవలసిందే. రోజూ పదిగంటలకు భోజనమైతే అవ్వేళ పండ్రెండుగంటలకు. రోజూ రాత్రి తొమ్మిదిగంటలకు పడకైతే ఆవేళ పండ్రెండు గంటలకు పడక. బంధువుల్ని, స్నేహితుల్ని చూడడం మొదలుకుని బజారుచిల్లరపనులవరకు ఆవేళ జరగవలసిందే. చాకలిమంగలిపండుగలు ఆరోజుకే. అంతేనా? ఎన్నాళ్లనుండో వాయిదాలుపడిన కంసాలికూడా ఆవేళకే. బంగారంవ్యవహారం పిసరంతయినా ఆఫీసరుకు తెలియకపోయినా ఆదివారంనాడు ఆయనఎదటే అమ్మగారు తూకం తూపించాలి. లోకల్‌బోర్డునంబర్లు వకాల్తీలమీద అటెస్టేషన్ చేసినట్లే అయ్యగారుతూకం కట్టెలు నమూనా బంగారం పుచ్చుకోవాలి. అబ్బ! ఆదివారం శలవంటారుకాని అంత హడావుడిరోజు అదే. చివరకు ఆవేళ జరగాలసిన ఇంటిపనులు ఎన్నో వాయిదాలుపడకతప్పదు. అమ్మగారిచేత కమ్మని మందలింపులూ తప్పవు.

శంకర్రావుపంతులు గుమాస్తాగిరీలోనుంచి జిల్లా మునసబైన ఉద్యోగస్థుడు. కేవలం కాగితాల కట్టలను భక్తిశ్రద్ధలతో ఆరాధించినందుకే ఆయనకు ఉద్యోగంలో అభివృద్ధి కలుగుతోంది. ఆయనా ఆదివారంనాటికి గంపెడుపనులు వాయిదా వేసుకుని బట్టల కొట్టుదగ్గర జట్కాబండిలో కూచున్నాడు. జట్కాబండిలో కూరగాయల బుట్టతోపాటు షాహుకారు అమ్మగారి ఆమోదంకోసం అలాయిదాగా ఇచ్చిన చీరెలు, రవికెల తానులు, పరికిణీగుడ్డలుకూడా సర్దుకుంటున్నాడు డఫేదారుసహాయంతో.

"ఏమోయి శంకప్పా" అని పిలుపు వినబడింది.

ఆపిలుపు వినేసరికి శంకర్రావుపంతులు ఉలికిపడినట్లయి తలెత్తి చూచాడు. ఎదుట అరవై సంవత్సరాల వయస్సు గల పెద్దమనిషి నిలబడ్డాడు. చుట్టు చెంగావిపంచె, హాలెండు చెక్కకోటు, లోపల బత్తాములులేనికమీజు, చేతిలో చిక్కపుసంచి, పదిజాముపళ్లు, జాళ్లడి జరీ కంగిపోయిన ఉప్పాడతలపాగ — సాక్షాత్తూ రిటైర్డు నాన్‌గెజెటెడు ఉద్యోగస్థుడు ప్రత్యక్షం అయినాడు. శంకర్రావును 'శంకప్పా' అని పిలిచేవాళ్లు చచ్చిపోయిన ఆయనతలితండ్రులు- బ్రతికున్నవాళ్లలో అన్నగారుమాత్రమే. అంచేత మరీ చకితుడైపోయాడు పంతులు.

"అవునోయి... పెద్ద ఉద్యోగస్థులు — మరచిపోరూ. జ్ఞాపకముంటామా మాబోంట్లు?"

శంకర్రావుపంతులుమనస్సు చురుక్కుమంది. చిన్న ఉద్యోగంలోనుంచి పైకొచ్చినవాడవడంచేతా,

ఇంకా పైకి రాదలచినవాడవడంచేతా తన్ను గురించి ఎవరైనా అల్లా అనుకుంటూరేమోననే ఆయన కనుమానం.

"సరి సరి! ఎంతమాటన్నారు...త.

"దానికేంలే! ఉద్యోగస్థులకి మరపు సహజమే. అయినా జ్ఞాపకంతెచ్చుకో! ఓయ్! చిన్నప్పుడు నాచేత ఎన్ని దెబ్బలు తిన్నావోయ్. అన్నట్లు రాముడు ఎక్కడున్నాడు? వాడిని చూచి ఎంతకాలమైందో? ఆయనకీ పెద్దఉద్యోగం అయివుండాలి! అతగాడికిమాత్రం జ్ఞాపకముంటామా! చిన్నప్పుడైతే ఒకకంచంలో తిని ఒక మంచంమీద పడుకున్నాం కాని ఇప్పుడు ఆరోజులు జ్ఞాపకముంటాయా? ఇంతకూ అతని కేమైనా తాసిల్దారీ అయిందా?"

అప్రయత్నంగా పంతులు"రామన్నయ్య కడప జిల్లాలో ట్టరు" అన్నాడు.

"సరి. సరి. సంతోషం. పిల్లా మేకా అంతా బాగున్నారా?"

"ఆ. మీ దయవల్ల."

"దానికేం! భగవంతుడి దయ. సరి. మీఆమ్మ గంగమ్మత్త బాగుందా..."అంటూ చేతిలోని చిక్కపుసంచిని బండిచివర ఆన్చేడు.

పంతులు అప్రయత్నంగానే దాన్నందుకుని మిగతాసామాను సర్ది చిక్కానికీ, పెద్దమనిషికీకూడా చోటుచేశాడు.

"ఈవేళ మంచిరోజు ముత్తంమీద. ఛాలా కాలానికి నిన్ను చూడడం పడింది. ఎన్నాళ్ళకి ఎన్నాళ్ళకి...ఇప్పుడే పడవ దిగొచ్చాను. వస్తూంటే ఒక స్నేహితుడు ప్రస్తావవశాత్తు ఇల్లా మన శివరావుపంతులుగారి అబ్బాయి శంకర్రావు-జిల్లామునసబు వచ్చాడన్నాడు. 'అల్లాగా, శంకప్పా!' అనుకుంటూ సరే తీరిగ్గా చూద్దామనుకుని, మామేనమామకొడుకుగారింటికి బయల్దేరేను. ఇంతలో ఆడబోయిన తీర్థ మెదురైనట్లు బిళ్లబంట్రోతు కనుపించాడు. ఎంతకాలమైతే ఏమిటి చూచి...ఆ పోలికలు ఎక్కడికి పోతాయి? సాక్షాత్తు శివరావుమామయ్యని చూచినట్లే అనిపించింది నిన్ను చూచేసరికి. జ్ఞాపకముంటుందో ఉండదో అని ఆలోచించాను. కాని పూర్వకాలపువాడినికనుక ఏమయినా సరేనని సాహసించాను అబ్బాయి " అంటూ చెపుతున్నాడు.

పంతులు మాట కడ్డొచ్చి-"బండెక్కండి. ఇంటికేవెడదాం. తీరిగ్గామాట్లాడుకోవచ్చు"అన్నాడు.

"సరే, కానియ్యి...ఏదో చిన్ననాటి ఆప్యాయతవల్ల, పాతకాలంనాటి పల్లెటూరి చుట్టాన్నవడం వల్ల బస్తీచుట్టరికంగా కాకుండా సిద్ధమవుతున్నాను. మీయింటావి డేమనుకుంటుందో....." అంటూనే బండిలో ప్రవేశించాడు. డఫేదారు ముందు కెక్కడంతోటే బండి కదిలింది.

బండి నడుస్తున్నంతసేపూ పెద్దమనిషి మాట్లాడుతూనే ఉన్నాడు. శివరావుపంతులును గురించి, గంగమ్మను గురించి కమ్మని మాటలు చెపుతుంటే ఎన్నిసార్లు లోలోపల అనుకున్నా ఆపెద్దమనిషిపేరడగడానికి పంతులు సాహసించలేక పోయినాడు.

"ఏమిరోజులోయి అవి. ఆలాంటి మనుష్యులున్నారా ఈరోజుల్లో అంటాను. ఎక్కడో వేలువిడిచిన మేనమామమనమణ్ని స్వంతబిడ్డలా ఆదరించిన శివరావుమామ ధర్మదేవత కొడుకోయి. అంతకన్నా గొప్పమాట గంగమ్మత్తఔదార్యం. మహాయిల్లాలు.మీ సుందమ్మ, రాముడికూడా నన్నూ చూచింది. వాస్తవానికి వాళ్లకన్న నన్నే ఎక్కువగా ఆదరించేది. ఒకొక్కప్పుడు నాకు ఇరుకాటంగా ఉండి 'ఏమత్తా' అంటే 'అవును నాయనా! మావాళ్లకి పెట్టినా పెట్టినట్లే, పెట్టకపోయినా పెట్టినట్లే. పరాయిపిల్లవాడికి అసౌకర్యం కలిగితే మాటమర్యాదలు దక్కుతాయా? సంసారాలువీథినిపడిపోవూ'........."అన్నట్లు రాముడికి ఎందరు పిల్లలు? సుందమ్మ బాగుందా? సుందమ్మభర్త బాగున్నాడా? పిల్ల లెందరు? వాళ్ల సంసారం నిండుగా ఉందికదా......అన్నట్లు హైకోర్టు

పుంటు చేసిన ఆంజనేయులు పంతులు గారి రెండో కూతురు కమలమ్మనేకాదూ నీకిత్త? అబ్బ! నీపెళ్లికి రావడానికి ఎంతప్రయత్నం చేశానోయి. శుభలేఖలు వ్రాస్తూ రాముడూ, శివరావుమామాకూడా మరీమరీ రమ్మని వ్రాశారు. రావాలని సహస్రవిధాల ప్రయత్నం చేశాను. దిక్కుమాలిన జమాబందీ మాఘమాసంలోనే తెగులడుతుంది. ఎన్నివిధాల తంటాలుపడ్డా శలవుదొరికి చావందే! ఎప్పటి మాటో ... నీకు పిల్ల లెందరు అబ్బాయీ?"

"ముగ్గురు. ఇద్దరు ఆడపిల్లలు, ఒక మగపిల్ల వాడు. ఆడపిల్లలు పెద్దవాళ్లు. పెద్దదానికి పన్నెండేండ్లు; చిన్నదానికి పది; కుర్రవాడికి ఆరేళ్లు

"సరి! సరి! అయితే పిల్లలు పెళ్లికికూడా ఎదిగేరన్నమాటే...... మరి మీ ఆవిడ ఊరుకోం టోందా?"

పంతులుకు ఆపుకోలేని నవ్వు వచ్చింది. పెద్ద వాళ్ల కెంత అనుభవమూ అనిపించింది. "క్షమించండి, మరచిపోయాను. తమ నామధేయం?"అని గొంతుక దాకా వచ్చిన ప్రశ్న ఆపెద్దమనిషి గ్రుక్కత్రిప్పకో కుండా చేసిన కుశలసంభాషణవల్ల గొంతుకలోనే ఇండిపోయింది.

* * *

జట్కాబండి శంకర్రావుపంతులు గుమ్మంలో ఆగింది. పెద్దమనిషి ముందు దిగేడు. చిక్కం చేత్తో పుచ్చుకుని పంతులు దిగేడు. గుర్రపుబండి అలికిడి విని పిల్లలు పరుగెత్తుకుంటూ వీథిలోకొచ్చారు. డఫేదారు జట్టలు తీయడంతోటే పిల్లలు 'ఇదినాకు, ఇదినాకు' అంటూ ముట్టడించారు. వాళ్ల సంతోషాన్ని చూచి, ఆనందిస్తూ పంతులు నిలబడిపోయాడు. పెద్దమనిషి తిన్నగా కచేరీగదిలో పంచి పెట్టి వంటఇంటి ముందు భోజనాలశాలలోనికి ప్రవేశించి 'ఏమమ్మోయి కమలమ్మా'అని కేకవేశాడు. కొత్త గొంతుక కనిపెట్టి 'ఎవరువా'రంటూ గుమ్మంలో కొచ్చి గభాలున వెనక్కి తగ్గింది. ఆపెద్దమనిషి 'కమలమ్మా, అంత సిగ్గుపడక్కరలేదు. నేనేమీ పరాయివాడిని కాను. నువ్వునన్నెరుగవుకానినేను నిన్నెరుగుదును. చిన్నప్పుడు నేను మీనాన్న ఆంజనేయులుగారి దగ్గర పనిచేశాను. అప్పుడు నువ్వు చిన్నపిల్లవు. చిన్నప్పు డెన్నోసార్లు నిన్ను ఎత్తుకున్నాను. ఇప్పుడు పెద్దదానవయ్యావు. పిల్లల తల్లివి. పైగా పెద్ద ఉద్యోగస్థుడి భార్యవు. ఇంతకీ రక్తసంబంధం కల మీఆయనే నన్ను మరచిపోయాడు. అల్లాంటప్పుడు నీకు జ్ఞాపకం లేకపోవడంలో ఆశ్చర్యంలేదు. అందుకనే నేనే వచ్చి పలకరించాను. ఇంతకీ వేళగానివేళ పట్నవాసంలో చుట్టపాడిని వచ్చాను. అందులోనూ పూర్వకాలపువాడిని. ఏదో కాస్త మడి, ఆచారం కూడాను."

"సరిసరి. ఎంతమాట. చాలాకాల మవడం చేత నే నెరుగకపోవచ్చును కాని, పెద్దలు మీరు చెప్పినప్పుడుకూడానా? దయచేయండి. స్నానం చేయండి. ఈవాళ ఆదివారం. అందుచేత నేనూ స్నానంచేసే వంట చేశాను. ఇంకా మాఇంట్లో ఆచార వ్యవహారాలు తప్పడం లేదు. పైగా నేను మీరనుకొన్నట్లు అందరిమాదిరి ఉద్యోగస్థులభార్య ననుకొన్నారేమో. మీకే తెలుస్తుంది లెండి. అందులోనూ మీ చుట్టరికంమాటలా ఉండగా మాబాబయ్యగారి స్నేహితులాయిరి. బాబయ్యగారివంటివారే మీరున్నూ..."

"అన్నట్టు బాబయ్యగారు కులాసాగా వున్నారా?"

కమలమ్మకు గ్రుడ్లనీరు తిరిగేయి. పమిటి కొంగుతో నీరు తుడుచుకొని"బాబాయి పోయి సంవత్సరం దాటిపోయింది" అంది.

"అయ్యో అల్లాగా, నాకు తెలియనేలేదే. ధర్మరాజు. నా కెంత సాయంచేశాడు. మాశావా అమ్మా! అందుకే వస్తూ పోతూ ఉంటేనే చుట్టరికం, స్నేహం అన్నారు పెద్దవాళ్లు. చూడుమరి, అంత స్నేహంగా ఉండే ఆంజనేయులు పంతులుగారు పోతే నాకు ఏడాదిదాటినా తెలియలేదంటే ఏమనాలి..."

"జౌనండి. అంతే మరి. అందులోనూ బంధుత్వంలో మా వారు మరీ ఇదండి. ఎప్పుడూ కొసుల గొడవే కాని స్నేహితులు, బంధువులు—ఈ ప్రశంసే లేదు. వేసంకాలం శలవు లొస్తే ముందుగా పెద్ద ప్రోగ్రాం వేస్తారుకాని తీరా ముందు అగ్రహారం వెళ్లేక అక్కడనుంచి కదలరు. కొబ్బరితోట్లో బంగాళే బెంగళూరు, నీలగిరి అంటారు. పొరుగూళ్లల్లోని బంధువుల నెవ్వరినీ ఎరుగరు. మొన్న ఈమధ్య మా పినతల్లి కొడుకొచ్చి 'బావగారూ' అని పలకరిస్తే నువ్వెవడవని అడిగేసరికి వాః డెంతో నొచ్చుకున్నాడు. గుమ్మంలోకొచ్చినవాడు వచ్చినట్టుగా వెళ్లిపోతూంటే నాకు తెలిసి నేనెంతో బ్రతిమాలినా భోజనానికున్నాడు కానేకాదు. నేనూ ఎన్నోసార్లు చెపుతూనే ఉన్నానండి..."

"సరేలే...కంప్లెయింటు చెయ్యడానికి బంధువు దొరికేడు —చూడు పంన్రెండుదాటింది, భోజనం సంగతి..."

"లేవండి. మీదే ఆ ం.'

* * *

వంటమనిషికూడా ఆదివారం చేయడంవల్ల కమలమ్మే స్వయంగా ఆదరాబాదరాగా చుట్టపాయన పేరిట మరొక కూర చేసింది. నాలుగురకాల ఊరగాయలూ వడ్డించింది. శంకర్రావు పంతులూ, చుట్టపాయనా భోజనం ఆరంభించారు. చుట్టపాయన భోజనం చేస్తున్నంతసేపూ ఆంజనేయులు పంతులు గారినిగురించో, శివరావుమామనుగురించో ప్రశంస చేస్తూనే ఉన్నాడు. దంపతు లిద్దరూకూడా ఆ ప్రశంసలతో పరమానందభరితు లయ్యేరు. కమలమ్మ పెద్ద కూతుర్ని పిలిచి "అమ్మాయీ, తాతగారికి రెండు చక్రకేళీపళ్లు పట్టుకురా"అని పురమాయించింది. అమ్మాయి చక్రకేళీపళ్లు పట్టుకొచ్చి వడ్డించింది. చుట్టపాయన వాటిని స్వీకరిస్తూ—"అమ్మాయికమలమ్మా! మరి వరాన్వేషణం జరుగుతోందా మనుమరాలికి? ఈకాలంలో ఆడవాళ్లు శ్రద్ధవహిస్తేనే మాటదక్కడం. శంకప్ప శలవు పెట్టి తిరిగితేగాని పనిజరుగదు..."

"మంచిమాట చెప్పేరు బాబూ. నే నెన్నివిధాల మొరలెత్తుకుంటున్నా వినిపించుకోవడం లేదు. సుందమ్మవదినకొడు కున్నాడు. వాళ్లకి కావలసినంత ఆస్తి ఉందిగాని అబ్బాయికి అట్టే చదువు లేదు. ఊ......"

"ఆరంభించావూ గొడవ...ఆయన్ని భోజనం చెయ్యనియ్యవూ"

"ఇదేతరహా బాబూ! నే చెప్పితే వేళాకోళం. వారి కింకా చీమకుట్టడం లేదు. ఇంకో రెండుమూడేళ్లయినాకకదా అంటారు."

"అవునమ్మాయీ! ఆయన ఉద్యోగస్థుడు—ఆయనధీమా ఆలాంటిది. నువ్వేమో పూర్వకాలపు మనిషివిగనుక ఆదుర్దా పడుతున్నావు—"

"అంతేనండి......మరో చక్రకేళీపండు తేవే అమ్మాయీ?"

"వద్దమ్మా...చాలు"

"చాలేమిటి? పిండివంటలూ ఏమన్నానా? ఆగంతుకంగా వచ్చారు. ఏమి చేయడానికీ వీలులేకపోయింది—"

"దాని కేమిలే. మళ్లీ రాకపోతానా, నువ్వు చెయ్యకపోతావా...సరిసరి."

* * *

భోజనం అయింది. తాంబూలం సేవించి పెద్దమనిషి పడుకున్నాడు. ఫలహారానికి ప్రయత్నం చేస్తోంది కమలమ్మ. చుట్టపాయన కాస్త గుర్రుపట్టేక శంకర్రావుపంతులు లోపలి కెళ్లేడు.

"కమలం! ఈయ నెవరో నీకేమైనా గుర్తుందా ఏమి?"

"సరిసరి. మీకు ఒకవేలు విడిచిన మేనమామ కొడు కంటూ ఉంటే నన్నడుగుతారేమిటి?"

"ఆయనెవ్వరో నాకేమీ జ్ఞాపకంరావడంలేదు. ఎంత ఆలోచించినా తోచడంలేదు. కాని ధోరణి చూస్తే ఆయనకు మన అట్టు, పుట్టు, ఆనవాళ్లు

అన్నీ తెలిసున్నట్లు కనిపిస్తున్నాడు. పోనీ, తెగించి పేరడగనా?"

"బాగానే ఉంది. అప్రతిభుడనౌతాను. అంత దగ్గరి చుట్టాన్ని పేరడిగితే ఏమనుకుంటాడు? బాగుంటుందా? మీ కంతా మరుపే. బాగా [illegible] కోండి"

"జ్ఞాపకం రావడం లేందే?"

"పోనీండి. మాటల సందర్భంలో ఆయనే తేల్తాడు. నాకు ఆయన్నెప్పుడో చూచినట్లుందికాని మరేజ్ఞాపకం లేదు"

ఈసంభాషణ అయిన కొంతసేపటికి పెద్దమనిషి లేచాడు. కమలమ్మ ఫలహారం, కాఫీ ఇచ్చింది. ఆరెంటినీ ప్రశంసిస్తూ సేవించాడు. ఫలహారమైనతర్వాత మళ్లీ పురాణం ఎత్తుకున్నాడు. మాటల సందర్భంలో అవకాశం చూసుకొని తెగించి "తమ నామధేయం జ్ఞాపకం రావడం లేదు. కొంచెం శలవిస్తారూ" అనడిగేడు చుట్టపాయన్ని పంతులుగారు.

"సరి సరి. చివరికి ఈకాడి కొచ్చింది. ఇంటికొస్తే నెత్తినెట్టుకునే మేనమామకొడుకింటి కెళ్లకుండా చిన్ననాటి ఆప్యాయతకొద్దీ ఉద్యోగస్థుడవుకదా అని మన్నించి పిలుపుపట్టుదల పెట్టుకోకుండా ఇంటికొస్తే పేరడిగేస్థితి కొచ్చింది వ్యవహారం. అమ్మాయీ కమలమ్మా! ఇక నే వెడతానమ్మా. పెద్ద స్థుల వ్యవహారం ఇంతటిదే. నిజానికి నీబోటి ఇల్లాళ్లు ఉన్నారు కనుకనే ళ్ల మర్యాద ఇంకా సాగుతోంది"

"ఆయనమాట కేమిలెండి బాబుగారూ...... ఉండండి ఈపూటకూడా......"

"అమ్మాయి, చాలుచాలు, ఇక నే వెళ్లొస్తా. నీపిల్లలేరమ్మా? ఒక్కసారి చూడనియ్యి" అన్నాడు.

పిల్లలు ముగ్గురూ వచ్చి నిలబడ్డారు. ముగ్గురి చేతుల్లోనూ రెండేసి జామకాయలు పెట్టి గబగబా కోటు తొడుక్కొని అరుగు దిగేడు. పంతులు మాటాడడం లేదు. లోపలినుంచి గబగబా కమలమ్మ వచ్చేసరికి అప్పుడే చుట్టపాయన గుమ్మం దాటేడు.

"బాబుగారూ! బాబుగారూ" అంది కమలమ్మ.

"ఈసారి వచ్చినప్పుడు రెండురోజు లుంటాను. అప్పటికి మీఆయనకు నాపేరు జ్ఞాపకమొస్తుందేమో"

* * *

చుట్టపాయన మళ్లీ రాలేదు. దంపతు లెంత తర్జనభర్జన చేసినా ఆయనపేరు జ్ఞాపకం రాలేదు. ఉభయులూ ఇది ఘరానామోసం కాదుగదా అని కూడా తర్కించుకున్నారు.

చుట్టపాయన వెళ్లిపోయిన చాలారోజులదాకా పిల్లవాడుమాత్రం "అమ్మా! జామకాయలతాతయ్య మళ్లీ రాడే" అని అడుగుతూనే ఉన్నాడు.

"వస్తాడు నాయనా. మళ్లీ ఆదివారం వస్తాడు" అంటూనే ఉంది తల్లి.



# “ ఆషాఢస్య ప్రథమదివసే ”



= శ్రీ హనుమచ్ఛాస్త్రి =

ఓహోహో! నవశక్రనీల శకల వ్యూహాకృతీ, సత్ప్రయో
వాహా! వచ్చెద వెన్నినాళ్ల కిటు తప్తప్రాణి నేత్రోత్సవా,
దాహార్తుల్, దయితావిదూరులును, స్వాంతం బింత తేరన్, చిర
స్నేహార్ద్రాశ్రుల నీరు జిల్లుమని నిర్వీక్షింప వేంచేయుమా.

దారుణ గ్రీష్మసంతప్తచాతకబంధు కోటి పొంగగ నింత గొంతుతడిపి
చిరవిరహాతుల తరుణుల ప్రాణేశు నులివెచ్చకౌగలింతలకు దార్చి
ఏడాదినుండి కన్నిచ్చి తెన్నులు చూచు నెమలినేస్తంపు నృత్యములు కదిపి
నీకయి వేగివేణీభూతతనువులౌ ఆపగానతుల రసాబ్ధి దేల్చి
కర్షకాంగన నల్లని కంటితుదల-హర్ష బాష్పాంబుకణము లల్లంత నిలిపి
నీలినీలికొండల నెక్కి- నేలనేల-వ్రాలి నవమేఘ! కోటివరాల నిమ్ము.

చలువయొడందతో నురుమసాగిన మొత్తనిగుండెవాడ! చెం
గలువలు కొండమల్లియలు కమ్మని గేదగిపూల రేకు లం
జలి ఘటియించి నీ కిపుడు స్వాగతముల్ పచరించు వేడుకన్
నిలిచిన మాదు నొదలల నిల్పుమ తొల్కరి క్రొత్తముత్తెముల్.

జ్ఞాపకమా గదోయి, నినుగాంచిన చల్లనివేళ-రామశై
లోపరిసానుభాగముల నూర్చుచు గుందు ప్రవాసయక్షబా
ధాపరిక్లప్తి, పిమ్మట సుధాయితవాక్కవి కాళిదాస ప్ర
ఖ్యాపిత మేఘదూత నవకావ్యరసోత్కట చిత్రధోరణుల్.

గుహ్యకేశ్వరు జాతిగుండెల శాపమ్ము ఏనా డడంచెనో దీనయక్షు
హారశిరశ్చంద్రదీవ్యత్సౌధ మెన్నండు ఉడికెనో చెలియనిట్టూర్పు సెకల
వంధ్యవింధ్యాప్రాంతవనసీమ నెన్నండు మ్రోగెనో శూన్యవియోగగీతి
ఏనాడు జానకీస్నానపుణ్యాంబువుల్ చెలిమిమై పల్కరించెనో విషణ్ణు
తెలియనేరముగాని-యో జలదమూర్తి!-క్రొత్త తొలకరిలో కొండనెత్తములను
జేరి నీ వొక్కసారి గర్జించితేని!- మేఘకావ్యమ్ము తలపులో మేలుకొనును.

(సావశేషము) • •



# అది రుచికరంగాను తృప్తికరంగాను వుండాలి
# . . . అయితే బలాన్ని చేకూర్చగల శక్తి కూడా దానికివుండాలి సుమా!






మీ కుటుంబముయొక్క ఆహారము వండేటప్పుడు యీ విషయం ఎన్నడైన ఆలోచించారా? ఆహారం రుచికరంగా వున్నంత మాత్రాన చాలదు—మంచి పుష్టి నిచ్చునట్టిదిగా వుండాలి. కొన్ని ఆహారపదార్థాలు అన్నిటికంటె శక్తిదాయకములై వుంటవి. మనము నిత్యము తీసుకొనే పదార్థములలో కొన్ని బలము నిచ్చునవిగా వుండవు. అవి మన ఆరోగ్యమునకు మంచివి కావు—పైగా, మంచివి కాకపోగా, ఆరోగ్యమును చెడగొట్టుతవి—ముఖ్యముగా పిల్లలకు మరీని. కాని ఆహారమును బలంచేకూర్చేదిగా చేయటం ఒక కష్టమైన పనికాదు. ఆహారమును విటమిన్లతో నిండిన డాల్డాతో వండిన యెడల యీ విషయములో మనకు చాల తోడ్పడును. ఈ డాల్డాలో ప్రకృతి సిద్ధముగా బలమును, పుష్టిని యివ్వగల "ఆహార పదార్థములు" యిమిడి వున్నవి. డాల్డాతో తయారు చేసినంత రుచిగా మరి ఏ యితర పదార్థంతోను వండ లేరనుటలో సందేహ మేమియు లేదు. ఒక్కమారు వాడి చూడండి. మీకే తెలుస్తుంది.




ప్రతి గృహిణి ఏ ఆహార పదార్థములు శక్తి నిచ్చునవో తెలుసికొనవలెను. డాల్డా పాకశాస్త్రము పుస్తకము (ఇంగ్లీషులో అచ్చువేయబడినది) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలి వుపయోగకరమైన విషయములు గలవు. మీకు ఒక కాపీ వుండుట ముఖ్యావసరము. 4 అణాల బిళ్లలు *Dept.* A110 *P.O. Box No.* 353, *Bombay*, పంపుడు.

## విటమిన్లతోనిండిన దాల్డా బలమునకు

HVM. 32-23-40 TL

HINDUSTAN VANASPATI MANUFACTURING CO., LTD.

# పున్నాబాయి - లక్ష్మీసోదెమ్మ

శ్రీ దిగవల్లి వేంకటశివరావు =

## మేవారు రాజవంశాన్ని కాపాడిన పున్నాబాయి

విక్రమశకం ౧౫౯౧, అనగా క్రీస్తుశకం ౧౫౩౫ లో రాజపుత్రస్థానంలో చిత్తూరును రాజధానిగా చేసుకొని మేవాడురాజ్యాన్ని పరిపాలించిన విక్రమజిత్తు రాణాసంగుని కొమారుడు. రాణాసంగు డెంత ప్రజానురంజకుడో విక్రమజిత్తు డంత ప్రజాకంటకుడై పరిపాలించాడు. రాజస్థానంలో నున్న రాజపుత్రు లందరూ అతనిని ద్వేషించి అతనిని పదభ్రష్టుణ్ని చెయ్యాలని సంకల్పించి వనవీరు డనే రాజపుత్రుణ్ని చిత్తూరురాజ్యసంరక్షకుడుగా నియమించారు. అంతట వనవీరుడు విక్రమజిత్తును వధించి తానే రాజ్యాన్ని ఆక్రమించాడు.

విక్రమజిత్తు చనిపోయేనాటికి అతని సవతితమ్ముడైన ఉదయసింగు ఆరేళ్ల పసిబాలుడు. తల్లిలేని పిల్లవాడైనందువల్ల తనను ప్రేమతో పెంచుతూవున్న పున్న యనే దాదినే తన తల్లి అనిన్నీ, తన యీడువాడైన ఆమెపిల్లవాడిని తన సోదరు డనిన్నీ అనుకునేవాడు. పున్న దాసియైనా చాలా ఉత్తమురాలు. కొన్నితరాలనుంచి నమ్మకంగా మేవాడురాజవంశం వారి సేవ చేస్తూవున్నందువల్ల క్షత్రియుల సద్గుణము లలవడిన మంచి వంశములో పుట్టి పెరిగింది. ఆమెకు రాణాసంగుని వంశ మంటే భక్తివిశ్వాసా లున్నవి. ఉదయసింగును తన కొమారుడికంటె ఎక్కువగా చూచుకొంటూ పెంచుతూవుంది.

వనవీరుడు విక్రమజిత్తును వధించాడని తెలియగానే రాజ్యకాంక్షచేత ఈ పని చేసినవా డీయుదయసింగునుమాత్రం బ్రతకనిస్తాడా అని పున్నకుతోచింది. ఒకమూల ఇంకా విక్రమజిత్తుభార్యలు ఏడుస్తున్నారు. అంతఃపురమంతా గగ్గోలుగా వున్నది. ఆలోచించడానికైనా వ్యవధి లేదు. అప్పుడే రాత్రి యైనది. ఉదయసింగూ, తన పిల్లవాడూ ఒకరిప్రక్క నొకరు పడుకుని హాయిగా నిద్రపోతున్నారు. వారిని చూడగానే పున్నగుండె నీరైంది. ఇప్పుడో ఇకనో వనవీరుడు వచ్చి ఈఉదయసింగును వధిస్తాడని ఆవిడకు రూఢియైనది. అంతట ఆవిడమనస్సుకు ఒకఉపాయం తట్టింది. కాని ఆ ఆలోచన కలిగేటప్పటికి ఆవిడకు ఒళ్లు ఝల్లుమన్నది. ఉదయసింగు, తన పిల్లవాడు ఒకే యీడువారు. ఒకేపోలికగా ఉంటారు. రాజకుమారుణ్ని రక్షించాలంటే తన కొమారుణ్ని బలియివ్వాలి! ఇంతకు తప్ప వేరే ఉపాయంలేదు! ఈ తలంపు కలుగగా పున్నగుండె ఝల్లుమన్నది.

ఏమి చేద్దామన్నా ఆలోచించడానికి వ్యవధి లేదు. అంతఃపురంలో హాహాకారాలు చెలరేగినవి. వనవీరుడు కత్తిపుచ్చుకొని వధించడానికి వస్తున్నాడని పున్నకు తోచింది. ఈ మేవాడురాజ్యానికి కులదీపం ఈ ఉదయసింగు. అతడు బ్రతికివుంటే మళ్లీ ఎప్పటికైనా చిత్తూరురాజు కాగలడు. ఆపిల్లవాడి ప్రాణం కాపాడాలి. పున్న తన గుండె రాయిచేసుకుంది. తన కన్నకొడుకును బలియిచ్చి రాజకుమారుణ్ని రక్షించడానికి పూనుకుంది. వెంటనే నిద్రపోతూవున్న ఉదయసింగుబట్టలు, నగలు తీసివేసి తన పిల్లవాడి బట్టలతడికి తొడిగింది. ఉదయసింగు నిద్ర లేవలేదు. అతణ్ని తీసి ఒక పెద్ద గంపలో పెట్టి కొన్ని ఆకులు కప్పి, పైన కొన్ని పండ్లు పెట్టి, రాజ

కొమారుడికి, తనకు అన్నం తెచ్చిపెట్టే వంటవాడైన మంగలిని పిలిచి ఆ గంప తీసుకొనివెళ్లి తానువచ్చే వరకూ ఊరిబయట నదీతీరాన యిసుకతిప్పలో కూర్చోమన్నది. జగన్నాథక్షేత్రంలోలాగనే రాజపుత్రస్థానంలోని సంస్థానాలలో వంటవాళ్లందరూ మంగలికులస్థులు. వారు చాలా నమ్మకంగా వుంటారు. ఆమంగలి పున్న చెప్పిన ప్రకారం ఆ గంప తీసుకుని బైలుదేరినాడు. మిగిలిన అన్నంకూరలు తీసుకొని పోతున్నాడు కాబోలునని కావలివారు అటకాయించలేదు.

అక్కడ అంతఃపురంలో వున్న రాజకుమారుడి బట్టలూ, నగలూ తన కుమారుడికి తొడిగిందోలేదో వనవీరుడు కత్తిపుచ్చుకొని వచ్చి "నీవు పెంచుతూవున్న రాజకుమారు డేడీ?" అని అడిగాడు. పున్న నిలువునా నీరైపోయింది. తన కొమారుడికి ఆయువు చెల్లిపోయిన దని అవగతమై నిలువునా నీరై జవాబు చెప్పలేక కొంతసేపు నిశ్చేష్టురాలై తరువాత ధైర్యము తెచ్చుకొని నిద్రపోతూవున్న తన కొమారుడిపైపునకు చేతితో చూపించింది. వనవీరు డాపిల్లవాడి తల నరికివేశాడు. పిల్లవా డాతల్లి ఎదుటనే మరణించాడు. వనవీరుడు రాజ్యం నిష్కంటకమైన దనుకొని వెళ్లిపోయాడు.

ఆపిల్లవాడికి రాజకుమారుడి శీవికి తగినట్లుగా దహనక్రియలు జరిపారు. పున్న ఏడ్పుచూసి పాపం రాజకుమారుణ్ని పెంచిన ప్రేమ అని అనుకున్నారే గాని ఆవిడ తన గర్భశోకమే అనుభవిస్తూవున్నదని తెలుసుకోలేదు. తరువాత పున్న కోట వదలి ఊరివెలుపలకు పోయి రాజకుమారుడిని తీసుకుని చిత్తూరు రాజ్యమున కిదివర కనేకమారులు అఖండమైన సేవ చేసిన దేవలనగరరాజైన బాగ్జీగారి కుమారుడి దగ్గరకు తీసుకొనిపోయినది. అత డావిడను, పిల్లవాడిని ఆదరించాడు; కాని వనవీరుడు దగ్గరలో నున్నందువల్ల తనను బ్రతకనివ్వడని ఆవిడకు, రాజకుమారుడికి ఆశ్రయ మివ్వలేకపోయాడు. అక్కడనుంచి తంజరుపురమునకు పోగా అక్కడ కూడా అలాగే జరిగింది. చివర కావిడ కమలమియరుకోటలో కాపురం చేస్తూవున్న జైనమతస్థుడైన అస్సా యనే యొక కోమటి నాశ్రయించినది. అతడు సహజముగనే భయపడినాడు కాని పున్నసాహసౌదార్యములను, ప్రభుభక్తిని చూసి ఆశ్చర్యపడి ఆవిడదుస్థితికి జాలివహించి అస్సాతల్లి అతనికి ధైర్యము చెప్పి తమ రాజైన రాణాసంగుని మూడవకొమారుడైన ఈ ఉదయసింగును రక్షించమని బోధించగా ఉదయసింగును తన మేనల్లుడని చెప్పి తనవద్ద ఉంచుకొంటా ననిన్నీ, పున్న అక్కడ ఉంటే అనుమానం కల్గుతుందనిన్నీ అతడు అన్నాడు. అంతట ఎక్కడనో అక్కడ రాజపుత్రుడు బ్రదికివుంటే చాలునని పున్న అతనిని విడవలేక విడవలేక విడిచిపెట్టి వెళ్లింది.

ఉదయసింగు కమలమియరుకోటలో పెరుగుతున్నాడు. అతడి లక్షణములు, చర్యలు చూసి ఇతడు రాజపుత్రుడేకాని కోమటిబిడ్డడు కాడని క్రమక్రమంగా అందరికీ తెలిసిపోయింది. (దీనిని గురించి రాజస్థాన కథావళిలో అనేకకథ లున్నవి.)

ఇలా వుండగా వనవీరునిచేత అవమానింపబడిన రాజపుత్రు లందరూ ఉదయసింగు బ్రదికివున్నా డనే సంగతి పున్నను, మంగలిని విచారించి తెలిసికొని అతనికి సహాయం చెయ్యడానికి పూనుకున్నారు. అయితే చిత్తూరుదుర్గం దుర్భేద్యమైనది. అందువల్ల దానిని పట్టుకోవడానికి ఉపాయాలు ఆలోచిస్తూ, వనవీరుడి చేత అవమానింపబడిన అతడి మంత్రితోనే ఆలోచించారు. ఇంతలో వనవీరుడి కుమార్తెపెళ్లి వచ్చింది. ఆ సందర్భంలో కోటలోకి వచ్చే సరుకుల బళ్లలో రాజపుత్రులు కూర్చుని కోటలో ప్రవేశించి దానిని స్వాధీనంచేసుకొన్నారు. వనవీరుడు పారిపోయాడు. విక్రమశకం ౧౫౯౭ (క్రీ. శ. ౧౫౪౧) లో ఉదయసింగు రాజైనాడు. 'పున్న' యనే మాటకు హిందీభాషలో వజ్ర మని అర్థము. ఆ పేరు మన పున్నవిషయంలో సార్థకమైంది. పున్నాబాయి చిత్తూరురాజ్య రమామణి యైంది. ఆవిడపేరు- చరిత్రప్రసిద్ధమైంది.

హిందూదేశమంతటా మారుమ్రోగింది. రాజస్థానంలో ఆవిడనుగురించిన పాటల నిప్పటికీ పాడతారు. ఆవిడ గతించిన కొన్ని వందల సంవత్సరాలకు కర్నల్ టాడ్ అనే ఆంగ్లేయుడు తాను రచించిన రాజస్థానకథావళిలో నీమెచరిత్ర నతిరసవంతంగా వర్ణించాడు. (**Annals of Mewar, Todd's Rajastan Vol. I pp** 328-344).

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారీకథను రమ్యంగా అనువదించారు. (చూ. రాజస్థానకథావళి, ప్రథమభాగం, ఉదయసింగుకథ.)

## పెద్దాపుర రాజవంశాన్ని నిలిపిన లక్ష్మీసోదెమ్మ

ఈ హిందూదేశము శాంతిసత్యత్యాగ ధైర్యసాహసౌదార్యాలకు పుట్టినిల్లు. పున్నాబాయిలాగ ధర్మరక్షణకోసము తమ సర్వస్వము నర్పించిన స్త్రీపురుషులు, ప్రాణము లర్పించిన స్త్రీపురుషులుకూడా ఈ దేశంలో అన్ని కులాలవారిలోనూ, అన్ని కాలాలలోనూ ఉన్నారు. అందువల్లనే ఎన్ని రాజకీయ మత సాంఘిక క్షోభలు తటస్థించినా ధర్మమంటూ ఇంకా నిలిచివున్నది.

పున్నాబాయి గతించిన రెండువందల సంవత్సరాలలోనే మళ్లీ అలాంటి పుణ్యచరిత్ర యొకావిడ మన తెలుగు దేశంలో జన్మించి మన జాతికి కీర్తి తెచ్చింది. ఆమెపేరు కొంపెల్ల లక్ష్మీ సోదెమ్మగారు.

మొగలుచక్రవర్తియైన ఔరంగజేబు క్రీ. శ. ౧౭౦౭ లో చనిపోగా మొగలాయి సామ్రాజ్యంలో చేరిన వివిధరాష్ట్రాలను పరిపాలించే నవాబులు క్రమక్రమంగా స్వతంత్రులై పరిపాలించసాగినారు. మొగలాయి సామ్రాజ్యాంతర్భాగమైన గోలకొండరాష్ట్రానికి సుబేదారుడైన కమ్రుద్దీన్ అసఫ్‌జాగారు "రాజ్యనిర్వాహకుడు" (**Regulator of the Kingdom**) అనే అర్థం గల "నిజాం ఉల్‌ముల్కు" అను బిరుదును వహించి తన రాజధానిని గోలకొండనుంచి హైదరాబాదుకు మార్చి ౧౭౨౪ మొదలు దక్షిణ హిందూదేశానికంతా రాజాధిరాజుగా పరిపాలించడం ప్రారంభించాడు. గోలకొండరాష్ట్రంకింద నున్న ఆర్కాటు కర్నూలు రాజమహేంద్రవరం చికాకోలు పరగణాలను ఆయా ప్రాంతాల కధికారులుగా నియమింపబడి నవాబులు పరిపాలించేవారు. తరువాత కొంతకాలానికి కర్నాటక నవాబు అని చరిత్రప్రసిద్ధుడైన మహమ్మదాలీవాలాజానవాబుగారి తండ్రి అన్వరుద్దీనుగారిని నిజాముగారు రాజమహేంద్రవరం చికాకోలు పరగణాలకు నవాబుగా నియమించారు.*

అన్వరుద్దీనుగారు తనకింద ఫౌజుదారు (సేనాపతి)గా నున్న రుస్తుంఖానును ఈప్రాంతాలకు పరిపాలకుడుగా నియమించాడు. రుస్తుంఖానుడు ౧౭౩౭ సంవత్సరంనుంచి రాజమహేంద్రవరంలోనే వుంటూ దేశపరిపాలన జరిగించాడు. అప్పట్లో ఆప్రాంతాలలో శిస్తులను వసూలుచేయడానికి నియమింపబడియున్న యిజారాదారు లనే జమీందారులకు ఇతడు సింహస్వప్నంగా వుండేవాడు. శిస్తులు వసూలు చేయడంలో అక్రమాలు జరిపి ప్రజలను పీడించినారనిగాని, వసూలు చేసిన శిస్తును సర్కారుకు తిన్నగా జమకట్టక హరించారనిగాని నేరాలు మోపి వారిని పట్టుకుని అతిక్రూరముగా దండించేవాడు. కొందరిని వధించాడు. వారిస్థానే తురకలనే అమీనులుగా నియమించాడు. తాను వధించిన జమీందారుల పుర్రెలతో రాజమహేంద్రవరంలో ఒక స్తంభమును, బందరులో ఒక స్తంభమును కట్టించాడని చెప్పుకుంటారు. ఇలాగ ఆకాలంలో రుస్తుంఖానుడి పేరు మారుమ్రోగింది. ఈరుస్తుంఖాను మొదట పెద్దాపురం కాపురస్థుడైన తెలుగు ముసల్మానుడే నని, అతడు తన తెలివితేటలచేత పైకి

* అన్వరుద్దీను ౧౭౪౧-వ సంవత్సరంవరకూ ఈప్రాంతాలను పరిపాలించాడు. తరువాత ౧౭౪౩ లో నిజాముగా రాయనను ఆర్కాటు నవాబుగా నియమించగా అక్కడికి వెళ్లిపోయినాడు.

వచ్చి అన్వరుద్దీనుదగ్గర ఫౌజుదారుడై దేశపరిపాలకుడై నా డనిన్నీ చెప్పుకుంటూరు.

పెద్దాపురం గోదావరిజిల్లాలో రాజమహేంద్రవరానికి ఈశాన్యదిక్కున కొంచెము తూర్పుగా ౨౪ మైళ్ల దూరములో నున్నది. ఈ సంస్థానంయొక్క ప్రశంస క్రీ. శ. ౧౫౭౧ నుంచి చరిత్రలో కనబడుతూ వున్నది. పెద్దాపురం జమీందారులైన వత్సవాయవారు క్షత్రియులు. వీరు విజయనగరరాజులకు దగ్గర బంధువులు. పూర్వం ఈప్రాంతాల నేలిన రెడ్డిరాజుల దగ్గర వత్సవాయవారు సరదారులుగా నుండి దేశాక్రమణలోనూ, దేశపరిపాలనలోనూ వారికి సహాయభూతులుగా నున్నందువల్ల రెడ్డిరాజులు వీరికి మొదట హిమ్మాకురు పరగణాలోని కొన్నిభూముల నిచ్చి తరువాత ఆపరగణానే జాగీరుగా నిచ్చినారనిన్ని తెలుస్తున్నది. ఈప్రాంతాలలో శిస్తులు వసూలుచేసే యిజారాదారు దేశముఖులలో పెద్దాపురంవారే ముఖ్యులు. తరువాత వీరు పెద్ద జమీందారులై రాజలాంఛనాలతో దేశపరిపాలన చేస్తూవచ్చినారు. ఈవత్సవాయవారు తమ బాహుబలపరాక్రమంవల్లను, రసికతవల్లను, దానధర్మాలవల్లను చాలా ప్రఖ్యాతిని పొందినారు.

పెద్దాపురం సంస్థానమును పరిపాలించిన వత్సవాయ పినరాజుగారి తండ్రిగారికి హైదరాబాదు నవాబుగారు జగపతిరాజు అనే బిరుదునిచ్చినట్లున్నూ, అప్పటినుంచీ ఆ రాబిరుదునామంతో వ్యవహరింపబడుతూవున్నట్లున్నూ చెపుతారు.

౧౬౪౯ మొదలు ౧౭౦౭ వరకూ పెద్దాపురము నేలిన సార్వభౌమ తిమ్మజగపతిరాజుగారి యనంతరము వారి సోదర పుత్రులైన శ్రీ రాయజగపతిరాజుగారు రాజ్యమునకు వచ్చి విభవసంవత్సర ఫాల్గుణబహుళ ౧౪ లు మొదలు మన్మథ నామసంవత్సర జ్యేష్ఠశుద్ధ ౪ వరకు ౫౬ సంవత్సరములు పెద్దాపురాన్ని పరిపాలించినారు. వీరిని శ్రీమదుద్దండరాయ జగపతిరాజుగారని అనేవారు. వీరి భార్యపేరు రాగమ్మాదేవిగారు. వీరికి తిమ్మభూపతి, బలభద్రక్షితిపతి, సూరనృపతి యని ముగ్గురు కుమాళ్లుండేవారు.

రాయజగపతిరాజుగారు చచ్చిపోయేటప్పటికి వారి కుమాళ్లెవ్వరూ యుక్తవయస్సు వచ్చినవారు కారు. అంతట రాగమ్మాదేవిగారు తమ పెద్ద కుమారుడైన తిమ్మజగపతిరాజుగారిని పట్టాభిషిక్తులుగా చేసి తామే రాజ్యంచేయడం ప్రారంభించారు. ఈతిమ్మ జగపతి రాజుగారు కళలందు నిపుణులుగా నున్నందువల్ల కళా తిమ్మజగపతి యని పేరు పొందినారు. శ్రీ రాగమ్మా దేవిగారికి రాఘవమ్మగారని నామాంతరం వుండేది. ఆవిడ క్రీస్తుశకం ౧౭౧౪ మొదలు ౧౭౩౪ వరకూ పెద్దాపురాన్ని అతిసమర్థతతో పరిపాలించారు.

ఆకాలంలో ఉత్తరసర్కారులు పేరుకు మొగలాయిచక్రవర్తిగారి ప్రతినిధియైన హైదరాబాదు సుబేదారుడైన నిజాముగారి అధికారానికి లోబడి వుండేవి. హైదరాబాదునవాబుగారి సేనాధిపతులు ఈప్రాంతాలను ఎప్పటి కప్పుడు లోబరుచుకోవలసి వచ్చేది. రుస్తుంఖాను రాజమహేంద్రవరానికి షర్లష్కరై హైదరాబాదునవాబుగారి అధికారం స్థాపించడానికి వస్తూవున్న సంగతి తెలియగానే అత డిక్కడికి రాకుండా అరికట్టాలని మొగలితుర్రుపరిపాలకుడైన కలిదిండి రామరాజుగారున్నూ, నూజివీటి సుబ్బన్నగారున్నూ ఏలూరుదగ్గర అతణ్ని అటకాయించారు గాని లాభం లేకపోయింది. పిఠాపురంవారుకూడా ఓడిపోయి మన్యంలోకి పారిపోయారు.

రుస్తుంఖాను పెద్దాపురంమీదికి దాడిచేశాడు కాని ఆకోట పట్టుకోవడం అతనికి సాధ్యం కాలేదు. అంతట అతడు సామదానభేదోపాయాలు ప్రయోగించి కళా తిమ్మజగపతిగారిని, వారి సోదరులను తన గుడారంలోనికి రప్పించి మోసంచేసి వారిమీద సలసల కాగే వేడినూనె పోయించి చంపించాడు. ఈ దుర్వార్త వినగానే అంతఃపురంలో కళాతిమ్మజగపతిగారి భార్యయున్నూ, ఆయనతల్లియైన, రాగమ్మాదేవిగారున్నూ, తక్కిన రాణివాసస్త్రీలున్నూ అగ్నిప్రవేశం కావడానికి నిశ్చయించారు.

కళాతిమ్మ జగపతి రాజుగారు దుర్మరణం పొందేనాటికి ఆయనకు జగపతిరాజుగారనే ఏడుమా

సముల వయస్సు గల కుమారుడున్నాడు. ఈపసిపాపడిని పెంచి పెద్దవాణ్ని చెయ్యడానికైనా ఎవరూ మిగలకుండా శ్రీరాగమ్మాదేవిగారితోపాటు ఆవిడ కోడళ్లూ, ఇతరరాణివాస స్త్రీలందరూ కూడా అగ్నిప్రవేశం చెయ్యడానికి నిశ్చయించారు. విజయనగరరాజైన పూసపాటి సీతారామచంద్రరాజుగారున్నూ, కళాతిమ్మ జగపతిరాజుగారున్నూ తోడియల్లుళ్లు. పిల్లవాణ్ని విజయనగరానికి చేర్చి పినతల్లికి వప్పగిస్తే పెద్దాపురం రాజవంశం నిలుస్తుంది. అయితే ఇది చెయ్యడం ఎలాగ నని రాగమ్మాదేవిగారాలోచించారు. రుస్తుంఖాను క్రూరకృత్యాలను చూస్తూవున్నవారెవ్వరూ అంత ధైర్యం చెయ్యడానికి సాహసించలేరు. పెద్దాపురం రాజుగారి కొలువులో నున్న విశ్వాసపాత్రుడైన రాజసేవకులలో ఎవరైనా దీనికి సాహసించినా రుస్తుంఖానుడు వారినీ, పిల్లవాణ్ణీ బ్రతకనివ్వడు. అందువల్ల రాగమ్మాదేవిగారు కర్తవ్యం ఆలోచించారు. ఆలోచించగా ఆలోచించగా రాగమ్మాదేవిగారి కొక ఉపాయం తోచింది. కొంపెల్లవారు పెద్దాపురంరాజుల కాశ్రితులైన పురోహితులు. అప్పటి రాజపురోహితుడి భార్య లక్ష్మి సోదెమ్మగారు చాలా దొడ్డ యిల్లాలు. ఆవిడమీద రాగమ్మాదేవిగారికి చాలా గౌరవం. తన మనమడిని ఆవిడ కప్పగిస్తే తన కోరిక నెరవేరుతుం దని రాగమ్మాదేవిగారికి తోచింది. అంతట ఆవిడ సోదెమ్మగారిని తన కీసహాయం చెయ్యవలసిందని అడిగింది. సోదెమ్మగారావిడకోరిక విని తెల్లపోయింది. తానేమో, తన యిల్లేమో, తన ఆచారాలేమో తప్ప ఆవిడకు ప్రపంచంసంగతే తెలియదు. తన భర్తయైనా కేవలమూ శిష్టాచారసంపన్నుడైన పరమఛాందసుడేగాని లౌకిక వ్యవహారాలు తెలిసినవాడు కాడు. అయితే కొన్ని పురుషాంతరాలనుంచీ తన కుటుంబాని కాశ్రయంగా నున్న పెద్దాపురం రాజకుటుంబానికి సంప్రాప్తించిన ఈ మహావిపత్తులో రాగమ్మాదేవిగారు అగ్నిప్రవేశమవుతూ తన నీమాత్రపు సహాయం చెయ్యమని కోరితే తానెలా కాదనగలదు? ఏమైనాసరే ఈపిల్లవాడిప్రాణానికి తన ప్రాణం అడ్డువేసి అతణ్ణి కాపాడడానికి పూనుకొని సోదెమ్మగారు రాగమ్మాదేవిగారి కోరిక చెల్లిస్తానని ఆవిడచేతిలో చెయ్యివేసి వాగ్దానం చేసింది. అంతట రాగమ్మాదేవిగారు, కోడళ్లు అగ్నిప్రవేశం చేశారు.

ఆక్షణంనుంచి ఆవిడకే ఆశ్చర్యం కలిగించేటంత ధైర్యసాహసాలు, ఉపాయాలు లక్ష్మి సోదెమ్మగారికి పుట్టుకొనివచ్చినవి. పిల్లవాడిని ఒడిలో వేసుకొని కోట వెలుపలికి వచ్చిందో లేదో రుస్తుంఖానుభటు లావిడను అటకాయించారు. "ఈ పిల్లవా డెవరు? ఎక్కడకు తీసుకునివెడుతున్నావు?" అని వాళ్లు ఆవిడను ప్రశ్నించారు. అంతట ఆవిడకు అగ్నిపరీక్ష ప్రారంభమైంది. తానొక బ్రాహ్మణస్త్రీననిన్నీ, ఆపిల్లవాడు తన పిల్లవాడనిన్నీ, తాను రాగమ్మాదేవిగారిని చూసివస్తున్నాననిన్నీ సోదెమ్మగారు వారికి చెప్పి వారికి నమ్మకం పుట్టడానికి పిల్లవాడిని ముద్దుపెట్టుకుని వాడి నోట్లో తన నోరు పెట్టి తన నోరు ఎంగిలిచేసుకొని తప్పించుకొని బయటపడి బ్రదుకుజీవుడా యని తన యిల్లు చేరింది. ఇల్లలుకగానే పెళ్లి కాదుకదా! ఇల్లు చేరగానే తన భర్తతో సంగతులన్నీ చెప్పి భర్తను, కొందరు భటులను వెంటతీసుకుని బయలుదేరి చేబ్రోలుమార్గంగా విజయనగరానికి దారితీసింది.

ఈసంగతి రుస్తుంఖానుడి చెవిని పడగానే తన సైనికులను పంపించి సోదెమ్మగారిని, పిల్లవాడిని పట్టి తెప్పించాడు. అంతట సోదెమ్మగారాపిల్లవాడు తన పిల్లవాడేగాని రాజుగారి పిల్లవాడు కాడని గోలచేసి యేడ్చిందికాని ఖానుడు వినిపించుకోలేదు. ఆపిల్లవాడి సంగతి కనుక్కుంటా నని చెప్పి చంటిపిల్లవాడి ఎదుట కొన్ని పుస్తకములున్నూ, ఒక ఖడ్గమున్నూ పెట్టించి పిల్లవాడిని వదలగా వాడు ఖడ్గమువైపునకే పోయి దానిని పట్టుకున్నాడట. అంతట ఆ బాలుణ్ణి చూసి ఖానుడు "కూదకేషేర్, బక్రీకా బచ్చా నహీ హై" (వీడు పులిపిల్లగాని మేకపిల్ల కాదు) అని పిల్లవాడిని ఖైదులోవుంచి చుట్టూ కాపలా వేశాడు. సోదెమ్మగారు ఎంతో గోలపెట్టి ఏడ్చింది. ఆవిడ ఖానుగారి భార్యదగ్గరకు పోయి తనకు పుత్రభిక్ష

పెట్టవలసినదని యేడ్చింది. ఆఖరికి ఆవిడకూడా ఆ చెరసాలలో వుండి పిల్లవాడిని పెంచడానికి ఖానుడు అంగీకరించాడు. అయితే ప్రతిరోజూ ఉదయం తాను ముఖం కడుక్కునేటప్పుడాపిల్లవాణ్ణి తన సమక్షానికి తీసుకుని రావాలని భటులకు వుత్తర్వుచేశాడు. ఆపిల్లవాడు క్షత్రియ శిశువేగాని బ్రాహ్మణుడు కాడని ఖాను అంటూ, వీడు బ్రదికివుంటే తనకు ముప్పు వస్తుందని ఆబాలుణ్ణి వధించాలని అనుకునేవాడటగాని తన భార్య మాటలవల్ల అలా చేయకుండా వుపేక్షించాడు.

సోదెమ్మగారు రాత్రింబగళ్లు ఆపిల్లవాడిని కనిపెట్టుకునివుండి వీలైనప్పుడల్లా రుస్తుంఖాను భార్యదగ్గరకు పోయి కడుపు తరుక్కునిపోయేటట్లు చెప్పుకుని ఏడుస్తూ తనకు పుత్రభిక్ష పెట్టవలసిందని ప్రార్థిస్తూవుండేది. రుస్తుంఖాను భార్యకు మనస్సు కరిగి తన భర్త ఆపిల్లవాడికి ప్రాణాపాయం కలిగించకుండా కాపాడుతూవుండేది.

ఇక్కడ పెద్దాపురంలో జరుగుతూవున్న సంగతి సందర్భాలన్నీ సోదెమ్మగా రెప్పటికప్పుడు తన భర్తగారిద్వారా విజయనగరానికి తెలియపరుస్తూవుండేది. అక్కడ విజయనగరంలో సీతారామచంద్రరాజుగారి పినతండ్రికుమారుడైన విజయరామరాజుగారు రాజ్యకాంక్షవల్ల అన్నగారికి విషప్రయోగం చేసి చంపించారు. అంతట రామచంద్రరాజుగారి భార్యయున్నూ భర్తతో సహగమనం చేసింది.

రాజ్యకాంక్షవల్ల అన్నగారిని తుదముట్టించినా విజయరామరాజుగారు తన అన్నకుమారుడైన ఆనంద గజపతిగారిపట్ల విరోధభావం వహించక దయగానే చూసేవారు. అక్కడ పెద్దాపురంలో ఖైదులోనున్న రాయజగపతిరాజుగారిమీదకూడా వారికి బంధుప్రేమ సానుభూతి పూర్తిగానే వున్నది. విజయరామరాజుగారి భార్య చంద్రయ్యమ్మాదేవిగారు దొడ్డ యిల్లాలు. ఆవిడకుకూడా ఈ దిక్కులేని పిల్లవాడిమీద చాలా దయ కలిగింది. అందువల్ల వా రీపిల్లవాడిని ఎలాగైనా చెరలోనుంచి విడిపించాలని చాలా ఆదుర్దాగానే వున్నారు. ఇలా వుంటూవుండగానే కొన్ని సంవత్సరాలు గడిచిపోయినవి. పిల్లవాడు చెరసాలలోనే పెరుగుతున్నాడు.

ఇంతలో రుస్తుంఖానుకుమారుడైన నూరుద్దీనుఖాను తన తండ్రిని వధించి తానే రాజమహేంద్రవరానికి వర్లవక్కారై పెద్దాపురంలోనే మకాముగా నుండి పరిపాలన ప్రారంభించాడు. అయితే చెరలోనున్న రాయజగపతి రాజుగారికి విముక్తి కలుగలేదు. పైగా కొత్తఖాను బందోబస్తు ఎక్కువ చేశాడు. పిల్లవాడిని చంపిస్తాడనే భయం ఎక్కువైంది. ఎందుకంటే రాజవంశమువాడంటూ వుంటే అతణ్ని సింహాసనం ఎక్కించడానికి కుట్ర చేస్తారని అతనిభయం. బాలుణ్ని ఖైదుచేసిన గదికిన్ని, కోటయొక్క బయటి ద్వారానికిన్ని మధ్య ఏడు పహరాలుండేవి. అక్కడ తురుష్కభటులు విచ్చుకత్తులతో పారా యిచ్చేవారు. కోటలోపలికి పోవడానికి సోదెమ్మగారికి తప్ప మరెవ్వరికీ అనుజ్ఞ లేదు. అందువల్ల పిల్లవాణ్ణి తప్పించాలంటే ఆవిడ ఒకర్తే ఈపహరావాళ్ల నందరినీ తప్పించుకోవాలి. లక్ష్మీసోదెమ్మగారు అందుకోసం కొన్ని ఉపాయాలు ఆలోచించి అవకాశంకోసం చూస్తూవుంది. సోదెమ్మగా రెప్పుడూ ముప్పైమూళ్ల బట్ట కట్టుకొని దానిని తన నడుముచుట్టూ చుట్టలుచుట్టలుగా అనేకమార్లు తిప్పి చుట్టుకునేది. పహరావాళ్లాచీరచుట్టలు విప్పించి చూచి మరీ లోపలికి పోనిచ్చేవారు. ఇదేమిటని వా రడిగితే ఇది మాయింటి ఆచారమనేది. వాళ్లు నవ్వుకుని కొన్నాళ్లు చీరెచుట్టలు విప్పించి ఆఖరికి విసిగి వేసరి ఆ చీరచుట్టలు విప్పించడం మానివేశారు. ఆవిడ బహు తరుచుగా బైటకు వెడుతూవుండడం చూసి వాళ్లు ఆవిడను ప్రశ్నించగా అది తన శరీరప్రకృతి యని చెప్పేది. అది వాళ్లు నమ్మి వూరుకున్నారు.

ఇలా వుండగా నూరుద్దీనుఖాను కళింగదేశ దండయాత్రకు బయలుదేరుతాడనే సంగతి తెలిసింది. అంతట తగిన సిబ్బందితో ఒక పల్లకీని పంపించవలసిన

దనిన్ని, దారిలో అక్కడక్కడ అంచెలలో సైనికు లను పెట్టవలసిందనిన్ని సోదెమ్మగారు విజయనగరానికి కబురుచేసింది. ఆ ప్రకారం పల్లకీ రాగా సోదెమ్మగారు బాలుణ్ని తన ఒడిలో వేసుకొని ఆపైన తన చీరను చుట్టి కాపలావారికి అనుమానం కలుగకుండానే పిల్లవాణ్ని బైటికి తీసికొనిపోయి సంకేతస్థలంలో వున్న పల్లకీలో ఎక్కి విజయనగరానికి దారితీసింది.

సోదెమ్మగారు పిల్లవాడిని తీసికొనిపోయిన సంగతి తెలియగానే, ఈ సంగతి తెలిస్తే తమమీదికి వస్తుందని భయపడి రాత్రివేళ సోదెమ్మగారు తప్పించుకొని పోయిన దని కాపలావారు తమ ప్రభువుకు తెలియపరిచారు.

విజయరామరాజుగారి సైనికులు సోదెమ్మగారిని పల్లకీలో అంచెలమీద తీసికొనిపోతున్నారనే సంగతి చారులవల్ల తెలియగా నూరుద్దీనుఖాను వెంటనే తన సేనతో బయలుదేరిపోయాడు. చేబ్రోలు దగ్గర యుద్ధం జరిగింది. అక్కడ విజయనగరమువారి అనకాపల్లి బోయల ఫౌజు ౨౦౦౦ మంది నూరుద్దీను ఖాను ఎక్కిన ఏనుగును ముట్టడించి అంబారీకట్టు పగ్గాలు తెంపి ఖానుణ్ని కిందికి లాగి అతనిని వధించగా అతని సైన్యం చెల్లాచెదరై పోయింది.

విజయరామరాజుగారి జగపతిరాజుగారిని సురక్షితంగా తీసుకునిపోయి అక్కడ తన అన్నకుమారుడైన ఆనందగజపతిరాజుగారితో సమానంగా చూస్తూ పెంచడం ప్రారంభించారు.

ఈ రాజమహేంద్రవరం సర్‌లష్కరు పై యధికారియైన అన్వరుద్దీనుకు రుస్తుంఖానుమీద, నూరుద్దీనుమీద కోపం వచ్చినందువల్ల అతడు విజయనగరంవారికీ, నూరుద్దీనుకూ జరిగిన యుద్ధంలో విజయనగరంవారికే సహాయం చేశాడు. తరువాత పెద్దాపురంకోటను తానే స్వాధీనంచేసుకొని పరిపాలించసాగినాడు. అందువల్లకూడా పెద్దాపురానికి మోక్షం కలుగలేదు. కొంతకాలం తరువాత అన్వరుద్దీనుకు బదులుగా జాఫరల్లీఖాను ఈ నాలుగుపరగణాలకూ పరిపాలకుడైనాడు. అతడు విజయనగరం మీదికి దండెత్తివచ్చాడు. అప్పటికి యుక్తవయస్సు వచ్చిన జగపతి రాజుగారతని నెదుర్కొని జయించగా వారికి రాజీ జరిగినది. తరువాత జగపతిరాజుగారు ౧౭౪౯ లో పెద్దాపురానికి వచ్చి పట్టాభిషిక్తుడై ౧౭౫౮ వరకూ పరిపాలించారు.

కొంపెల్ల లక్ష్మీసోదెమ్మగారు ఇలాగ ఎన్నో కష్టా లనుభవించి శ్రీ రాయజగపతిరాజుగారిని రక్షించి విజయనగరమునకు సురక్షితముగా తీసికొని పోయి వప్పగించి పెద్దాపురం వత్సవాయివారి రాజవంశం నిలిపి పుణ్యం కట్టుకుంది. ఈవిడ చూపిన అఖండమైన త్యాగమునకు, సాహసౌదార్యములకు మెచ్చి విజయనగరంరాజుగారైన శ్రీ విజయరామగజపతిగారు లక్ష్మీసోదెమ్మగారి కుటుంబంవారికి తమ రాజ్యంలో ఒక అగ్రహార మిచ్చి దానికి లక్ష్మీపురాగ్రహార మని ఆవిడపేరును పెట్టించారు. రాయజగపతిగారిని రక్షించినందువల్ల ఈ యగ్రహార మివ్వబడినందువల్ల దీనికి రాయభూపాల పురాగ్రహార మనికూడా పేరు. ఈ అగ్రహారాన్ని కొంపెల్లవారు చాలాకాలం అనుభవించారు.

కొంపెల్లవారు వత్సవాయివారికి చిరకాలం నుండి పురోహితులుగా ఉన్నట్లు గోదావరిజిల్లా మోడేకుర్తివాస్తవ్యులైన బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బరాయశాస్త్రులవారు సిద్ధాంతశిరోమణికి వ్రాసిన ఆంధ్ర పీఠికలో “శ్రీవత్సవాయ ప్రసిద్ధాన్వయ భూవరుల మన్ననగులగురుతు గాంచి” అని వ్రాసినారు. (బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి పెద్దాపుర సంస్థాన చరిత్ర విమర్శనము. ౧౦౮-౧౩౩; ౫౯.)



# భోగిమంటలు



శ్రీ వింజమూరి శివరామరావు ==

శర్వరీనీలకేశపాశమ్మునుండి - జారిపడె కోటితారకాకోరకములు;
ఉదయశైలకోటీరరత్నోజ్జ్వలముగ - మెరసె తరుణభాస్కరశోణకిరణచయము.

పాతాళమ్ముననుండి భూభువనసౌభాగ్యంబు దర్శింపగా
నేతెంచున్ బలి నేడె, పండుగయు నేడే భోగి యం చూరకే
మ్రోతల్ పెట్టుచు తేనెలూర మధుపమ్ముల్ రేగె; నెత్తావితో
వీతెంచెన్ పవనమ్ము; క్రొవ్విరులతో విప్పారె నారామముల్.

అపుడు-బలిరాజు పాలించినపుడు-గడప - గడప నూత్నతోరణముగా, ఎడద నెడద
నిత్యకల్యాణముగ నయ్యె; నేడు మరల - వచ్చు బలిరాజు; బ్రదుకులే విచ్చునేమొ!

అలరుచు గేహదేహళులయందు రసాలకిసాలతోరణ
మ్ములు సవరింపుడీ! ఎడద పొంగగ ప్రాంగణసీమ రంగవ
ల్లులు రచియింపుడీ! బ్రదుకులోవలె వీథులవెంట భోగిమం
టలు వెలిగింపుడీ! పుడమినాలుగుమూల లలంకరింపుడీ!

ప్రాతవై పాడుపడినవై రోతలైన - బ్రదుకులన్ని కాలగ, సుందరములు నూత
నములు వాసంతయువజీవితములు వెలుగ, -కూడి భోగిమంటలు రగుల్కొలుపుడయ్య!



# రమణమహర్షి సందర్శనము

= శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులు =

రమణీయపుష్పవాటికాపరివృతమైన వరండా; తన్మధ్యమున మునిమందిరము; తదంతరమునం దుత్తరదిశ, తూర్పుదెసగా, పర్యంకము; ఆపర్యంకమునం దొక దిండు నానుకొని నిర్వికల్పముగా నున్న యొక్క ముదుసలిమానవాకారము; తదాకార పదాశ్రితులుగ మందిరప్రతీచీభాగమునం దెల్ల స్త్రీపురుషశిష్యబృందము; మందిరదక్షిణభాగమున-తూర్పుపడమరదిశలందున్న పుస్తకాగారములు (బీరువాలు). పర్యంకసమీపమున దక్షిణమున కొంచెమెత్తుగ నున్న పుస్తకపీఠము. దానిప్రక్కగనే యున్న కమండలువు. కమండలుసహచారిగ నున్న దండము-మందిరమునం బ్రవేశించి యిటునటు చూచునంతట గోచరమైనవి.

రమణాశ్రమసందర్శనమున కిదియే ప్రథమము. రమణభక్తుడనై యట కేగలేదు. రమణగాథలగూడ వినియుండలేదు; చదివియుండలేదు. అం దేమి కలదో గ్రహింప తృష్ణమాత్ర మున్నది. విమర్శనబుద్ధి వీడలేదు. ఇట నిత్యకృత్య మేమి? తత్త్వోపదేశ మేమి? సాధనవిధాన మేమి? ఫలిత మేమి?—అను ప్రశ్నలకు సమాధానము నరయుటే నా పోకకు కారణము. ఏతద్విషయప్రత్యక్షానుభవమునకే యట కేగితిని.

మందిరమున బ్రవేశించితిని. మౌనిని గాంచితిని. ఆయన నన్ను చూడలేదు. అందున్నవా రెవరును నన్ను జూడలేదు. ఒక క్షణ మైనది. అట్లే నిలబడితిని. మరుక్షణమునం దేమో మైకము గప్పసాగినది. చేతులు జోడించితిని. సాష్టాంగదండప్రణామ మొనర్చితిని. ప్రణామావస్థనుండి నేనే లేచితినా? నన్నెవరో లేవదీసిన ట్లయినది. ఇంతలో ఆలోచన తట్టసాగినది. గాంధీమహాత్ముని పాదపద్మముల మ్రోల మాత్రమే మ్రొగ్గిన యీతల యిటగూడ నేల వ్రాలినదే! శ్రీరామచరణారవిందముల మ్రోలనే దాసోహమ్మనునీ మన మిట హతోస్మియన్నదే!! ఏల? అచింతితము; అప్రయత్నము అనునొక భావమే *రేకెత్తిన దొక్క త్రుటిలో. అట్లే మరల మనస్సు శాంతిమయ మగుచున్నది. ఋషిపాదముల చెంత నేలపై ఆసీనుడనైతిని.

ఎవరి వంకకు జూచుచుండెనో గోచరముగాని యామునిముఖమువంక కళ్లే రెప్పపాటులేక చూడసాగితిని. కంపితశిరస్కుడైన యామునిముఖ మిటునటు తిరుగుచునేయున్నది. అయిదునిమిషము లైనవి. హఠాత్తుగ నొక్క త్రుటిమాత్ర మాయనదృక్కు నా

వృక్కలో ప్రవేశించినది—చాలుచా లనిపించినది. శరీర మెల్ల గగుర్పొడిచినది. బహిర్ముఖదృష్టి అంతర్ముఖమైనది. శరీరమునం దంత అపూర్వశక్తి విజృంభింప సాగినది. అప్పుడప్పు డతిసూక్ష్మముగ చవిగొనుచున్న యీశక్తికి "త్వమేవ శరణంమమ" యని చెప్పవలసి వచ్చినది. మన స్సెటకు పారిపోయినదో పోయినది. ఒక విచిత్రమైన శూన్యావస్థ సంభవించినది. ౮ గంటలకు మందిరములో ప్రవేశించితిని. ౧౧ గంటలైనది. కనులు విప్పితిని. ఈ మూడు గంటలకాల మొకక్షణ మాత్రముగ నున్నది. "ఈత డణిమాదిసిద్ధుడా? అణిమాదిసిద్ధులు గలవా రిట్టి గారడీల నొనరింపగలరు" అని యీ విషయము వినునంత యోగాభ్యాసశాస్త్రము జదివినవా రన సాహసింతురు. ఒకించుక యనుభవజ్ఞులీపరమశాంత్యనుభూతి నొందగలరు. అయినను చండప్రచండముగ విజృంభించిన మనంబున తర్కము ప్రవేశించినది. వరండాలోనికి వచ్చితిని.

ఇంతలో నొకసంపన్నుడు నాముందు నిలబడెను. ఈతడు చిరునగవున నతికుతూహలుడై నన్నడిగి నాచిరునామాను తెలిసికొనినాడు. "ఆశ్రమమునంతయు చూచితిరా? తమ రాక మహాముని కెరుకయేనా" అని ప్రశ్నించినాడు. "ఇంతవరకు వారి సన్నిధానముననే యుంటిని. నన్ను వా రెరుగరు" అనునంతట నన్నాయన మరల మునికడకు తోడ్కొనిపోయినాడు. నాచిరునామా వారి కెరుకపరచినాడు. హృద్భావము లేవియు ముఖమునం దెరుగరాని యా నిశ్చలప్రశాంత మానవస్థాణువు ముఖగహ్వరమునుండి అల్లన నొక మందహాసము వెలువడినది. "ఈతడు నే నెరుగనివాడా?" యనునట్లున్న దాచిరునవ్వు. కృపారసకణ మొక్కటి చిల్కుచున్న ట్లామునిపుంగవుడు న న్నొకమా రాపాదమస్తకము విలోకించినాడు. అది యేమో ఆ కృపారసదృక్సంకలితమందహాసము శరీరమునెల్ల కలచివైచినది. పావకోజ్వలజాలికాపతితునివలె తహతహలాడితిని. ఆ ముఖసూర్యమండల మవలోకింప దుర్భర మైనది. శిఖాయజ్ఞోపవీతవర్జితుడైన ఆబ్రహ్మర్షిమాన్యుని వదనమండలములోనుండి నా చూ పాయనపాదములవంకకు పరువిడ సాగినది. కౌపీనముకడ నొక త్రుటిమాత్ర మాగినది. ఆ కౌపీన మొక తెల్లని ముతకశుద్ధఖద్దరుగుడ్డ. ఇంతలో "మీ రిట కొలదిదినము లుందురా" యని యా రమణుడు అత్యాదరమున తెనుగుభాషలో ప్రశ్నించినాడు. తెనుగుతల్లికీ పురుషోత్తముని వాఙ్మాధుర్యమున భాగ మున్నదని అమందానంద మొందితిని; మరల మునిసన్నిధానమున మౌనము వహించి సుఖాసీనుడనైతిని.

అచ్చట నున్న వారందరు మౌనవ్రతులే. ఆత్మావలోకనసాధనమం దుందురు. ఆముని మందిరము సంకుచితమైనది గాదు. సుమారు ౧౨ గజముల పొడవును, ౮ గజముల వెడల్పును గలిగియున్నది. ఎత్తయినది. సాధకుల కందరకు నేవిధమైన మరుగు లేకుండగ మునిమాన్యుడు గోచరించుచుండుటకై ఎత్తగు సోఫాపై శిష్యబృంద మాయనను ఆసీనుని జేసియుండిరని గ్రహించితిని. కొండలయందు - అడవులయందు - గుహలయందు-గుట్టలయందు నిరాహారుడై, సదాచారుడై ఎండవానలకు శరీర మర్పించి యాబాల్యము భౌతికశరీరమును క్రుంగదీసినవాడీపరమయోగి. ఆజానుబాహుడు. కాని వంగిపోయినాడు. రూపవంతుడు. కాని వృద్ధాప్యము దాపరించినది. పసిమివర్ణమువాడు. శరీరపోషణయం దుదాసీనుడు. వయోవృద్ధుడు గాకున్నను, నైసర్గికదార్ఢ్యవంతుడైనను, ౬౫ సంవత్సరములే వయస్సయినను, శరీరపాటవము దప్పినవానివలె గోచరించుచున్నాడు. దృఢతరముగ నడువజాలడు. దండాపేక్షగలవాడు. మెత్తని తల్పముపై నాసీనుని జేయుట కీవృద్ధాప్యమే కారణమని విదితమైనది.

ఇంతలో గడియారము ౧౨ గం. కొట్టినది. ఎల్లరు లేచి భోజనశాల కేగిరి. మహర్షికి నన్నెరుకపరచిన శ్రీ టి. ఎస్. రాజగోపాలన్ గారు నన్నును భోజనమునకు గొంపోయిరి. ఆ భోజనశాల బహువిశాలమైనది. ఉత్తరదక్షిణములుగ పొడవును, తూర్పుపడమరలుగ వెడల్పును గల ఆశాలలో మధ్యగ తూర్పునుండి పడమరకు నొక కర్రల కట్టడ ముంచబడినది. ఆ కట్టడమున నుత్తరదిశయందు బ్రాహ్మణజాతియు, దక్షిణదిశయందు

బ్రాహ్మణేతరులును భోజనము చేయుచుందురు. మహర్షి యిరువురకును గోచరించునట్లుగ తూర్పుదిశ గోడవైపున, తన కర్ధభాగమున కట్టుకట్టిన ముండునట్లుగ శిష్యులందరి మధ్య భోజన మొనరించుచుండును. మహర్షి భుజించునదియే శిష్యులకును లభించుచుండును. భోజనము గృహస్థుధర్మము ననుసరించి యున్నది. ఒక ముదుసలితల్లి మహర్షికి అన్నమువడ్డించినది. ఈమెయే గతనలుబదిసంవత్సరములనుండియు మహర్షికీ పట్టణమువెంబడి తిరుగాడి యన్నము సంపాదించిపెట్టుచు తల్లివలె సంరక్షించినదట. ఆశ్రమ నిర్మాణానంతర మందే యుండి అనుదినము రెండువేళల అన్నము తానే వడ్డించుచు తల్లివలె, భక్తురాలివలె మహర్షిని పోషించి సేవించుచున్నది. ఈతల్లి కాశ్రమమున నమస్కరింపనివారు లేరు. ఈముదుసలి భక్తురాలనుదిన ముదయకాలమున మునిమందిరమునకు ముమ్మారు ప్రదక్షిణ మొనర్చి మునికి ప్రణమిల్లుచుండును. ఇట్లే యిట ముని నాబాల్య మెరింగి, యాతని తపస్సిద్ధి నరయుచు, మౌనితోపా టనేకాంతరాయములకు గురియైన వృద్ధు లొకరున్నారు. ఆ ఆశ్రమవాసుల పరిచయము గలిగించుకొనుచు భోజనశాలను వీడితిని.

౧౨ మొదలు 3 గం. వరకు మౌనికి విశ్రాంతి కాలము. ఈవిశ్రాంతికాలములో ఆశ్రమమునకే నా విడిదిని మార్చుకొంటిని. అతిథిగృహమున పవ్వళించి యట్లే అనుభూతి సంస్మరించుచుంటిని. ఏమేమో సంశయము లుదయింపసాగినవి. సమాధానములును రాసాగినవి. చిరకాల మలభ్యముగ నున్న గాఢసుషుప్తి నాడు లభించినది. ప్రశాంతముగ ౫ గం. లకు మునిమందిరమున కేగితిని.

నలుదిక్కుల కిటికీలును, దక్షిణమున రెండు విశాలమగు ద్వారములును గల ఆ మునిమందిరమున చల్లని పిల్లవాయువులు వీచుచున్నవి. మౌనవ్రతులై శిష్యులు ధ్యానమగ్నులై యున్నారు. భక్తు లరుదెంచుచున్నారు. ప్రణమిల్లుచున్నారు. ఫలపుష్పములు సమర్పించుచున్నారు. కొంద రా మందిరమునం దొకింత కాల మాసీనులగుదురు. మరికొంద రప్పుడే భగవానుని ప్రసాదము గొని చనుచుందురు. సన్నిధానవర్తి తెచ్చిన ఫలములలో నొకటిరెండు ఫలములను, పటికబెల్లములో కొంత పటికబెల్లమును మరల భక్తుల కొసగుచుండును. వార లాప్రసాదము కనుల కద్దుకొని వెడలుచున్నారు. ఎవరి నోట నుండిగాని మాట రాదు. చీమ చిటుకుమనదు. అంతయు ప్రశాంతమే. మనుష్యుల మనసే బంధమోక్షములకు కారణ మను గీతావాక్యము (మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః) తోకత్రొక్కిన త్రాచువలె బుస్సుబుస్సుమనుచు గర్భగోళము నుండి ఉవ్వెత్తుగ నిలబడి మనోవీథియందు చిందులు త్రొక్క నారంభించును. ఆ పెనుభూతము నంతర్హిత మొనరించుటే యిట గల సాధనవిధానము. యోగ మనగా చిత్తవృత్తినిరోధ (యోగః చిత్తవృత్తినిరోధః) మను పాతంజలసూత్రమునకట నొకమారైన అనుభూతి లభింపగలదు. ఆమహర్షి యొక శాంతిసముద్రము. ఆసముద్రమున చరమగు సంచలన మున్నది; ఈసముద్రమునం దాత్మావలోకనమను సంచలన మున్నది. ఎవ రీసముద్రావలోకన మొనర్చినను, త్రుటి యం దాసీనులై యుండినను ప్రశాంతవాయువుల నాఘ్రాణింపక మానరు. మానసిక సంచలన మొకింతసేపైన స్తంభించి పరమశాంతి చవిగొనకపోరు. ఇదియే యీపరమయోగి అవ్యాజకరుణ; నిష్కామకర్మ. తిరువణ్ణామలై ప్రయాణమునందు దారిలో గోచరించిన కృషీవలుని కర్మకును ఈ ఆశ్రమమందిరమునం దేకాగ్రప్రశాంతాకారమునం దుండి సల్పు నీముని యోగవ్యవసాయమునకును అవినాభావసంబంధ మున్నది. ఆ కృషీవలుడు 'నేను, నాది' యను అహంకారభావమే మూలప్రేరణమై స్వయంతారణ మొనరించుకొనుచు పరతారణ మొనర్చుచున్నాడు. శరీరపోషణ కాహార ముత్పత్తిచేసి సంఘ సేవకుడు, పోషకుడుగూడ నగుచున్నాడు. ఇచ్చట ఈ కృషీవలుడు వ్యవసాయాత్ముడై అహంకారమును వీడి పరమార్థాన్వేషణ తత్పరుడై సిద్ధుడై నేడు పరార్థప్రాపకుడై యున్నాడు. నరులకును, పశువులకునుగూడ సమానమైన ఆహారనిద్రాభయమైథునముల కతీతమైన విజ్ఞానోత్పత్తి జేసి మానవసేవ

జేయుచున్నాడు. సంఘశ్రేయమున కర్థ మెట్టిదో, విజ్ఞానముగూడ నట్టిదే. విజ్ఞానహీనసంఘము పశుసమానమే. విజ్ఞానహీన ఆర్థికోత్పత్తికర్మయు విజయవంతము కాజాలదు. అయిన నట్టి యర్థము సంఘతృప్తి కనువగుటకు మారుగ అసంతృప్తి అశాంతులకే మూలమగును. ఇదియే నేటి బాహ్యప్రపంచమున గోచరించుచున్న సత్యము.

"ఈశావాస్య మిదగ్ం సర్వం
యత్కించి జ్జగత్యాం జగత్
తేన త్యక్తేన భుంజీథా
మాగృథః కస్య స్విద్ధనమ్"

అను ఈశావాస్య ఉపనిషద్వాక్య మిందులకే ప్రబోధింపబడినది. "సర్వ మీశ్వరమయము. సమస్తమాతనిదే. ఆపరమగు నర్థ మాదృష్టితో త్యాగబుద్ధితో ననుభవించు"మను వాక్యార్థము సునాయాసముగా ననుభూతికి రాగలదా? సర్వసంగపరిత్యాగులై కొందరాయర్థము నుద్బోధింపవలదా? భగవద్భక్తి పునాదిగా గల సంఘమే యిట్టి త్యాగ మొనరింపజాలును. తద్భక్తివ్యాపన కనువగు నాత్మశక్తి నార్జించి తన్మూలమున మానవసంఘమునకు శాంతిమంత్రోపదేశ మొనరించుచుండుటయే భారతఋషిసంప్రదాయము. భారతీయ మునితల్లజుల మహోత్తమనిష్కామకర్మ. రమణమహర్షి సంప్రదాయము వారిదే. తన అగాధతరశాంతి సముద్రమునుండి,సదస్యు లెట్టివారైనను, వారిపై నొక పరమశాంతికణమైనను జిల్కకమానదు. వారిలో 'అహం' నశించి శాంతి ఫలించు పరమబీజావాపన మొనర్పకవీడడు. ఆ హృదయమునుండి యగోచరముగ స్రవించు భక్తిరసమున వారి హృదయక్షేత్రములను తడుపును. ఉత్తమక్షేత్రములయం దా బీజములు మొలకలెత్తి ఫలవంతములై సంఘోష్యయుక్తము లగును. ఊషరక్షేత్రములం దట్లే నశించిపోవును. ఆడని మాటనుండి, చూడని చూపునుండి, చేయని కర్మనుండి, తలవని తలంపునుండి మనోమయకోశము నొకపెట్టున మటుమాయ మొనరింపగల మహాద్భుతశక్తి యేదియో జనించుచు సదస్యుల హృదయకుహరముల నెట్లో ప్రవేశించుచునే యుండును. తంతువులు లేని సమాచారప్రసారమువలె ఈపరాశక్తి సాధనాలయమునుండి సంశయాత్మకులగు సాధకులకు సందేశములు లభించుచునేయుండును. విద్యుద్దీపమువలె హఠాత్తుగ హృదయజ్యోతి వెలింగి ముందుగతి కరతలామలకముగ దోచుచుండును. ఇది యంతయు మహామునిసన్నిధానమునందుమాత్రమే లభించు ననుకొనరాదు. ఎన్నివందల మైళ్లో దూరమునం దున్నను సాధకుడు తన గ్రహణశక్తి ననుసరించి (రేడియోగ్రహణాలయమువలె) విశ్వపరివ్యాప్తమగుచుండిన యీమహాద్భుత శక్తినిలయమునుండి సాధనసందేశములను, జ్యోతిర్మయకిరణములను, శాంత్యనుభూతిని సంగ్రహింపగలడు. అవ్యాజప్రేమకులోనగు భక్తుల నీతడు తనంత తానే వా రెంత దూరమందున్నను శక్తివంతుల నొనరించుచుండును. వారితో నొక వింతయైన, నిరాకారమైన, నిశ్శబ్దమైన, నిర్వ్యాజమైన స్నేహ మేర్పరచుకొనును. వీరివారలమధ్య మహావిచిత్రమగు నొక్క ఆకర్షణవాహిని నిరంతరాయముగ ప్రవహించుచుండును. ఈఋషిసన్నిధానమున భక్తిజ్ఞానకర్మయోగము లన్నింటికి సమానసమన్వయస్థానమే యున్నది. 'అరుణాచలపంచకము'నం దీసిద్ధపురుషుడు భక్తుల మాధుర్యము నిట్లు పేర్కొనినాడు:

"త్వయ్యర్పితమనసా త్వాం పశ్యం త్సర్వం తవాకృతితయా సతతం భజతేనన్యపీత్వా."

పరమేశ్వరార్పితహృదయవేదనలో నీరమణుడు నాదియందు సతీమాతృవత్సలదాసప్రియాదిభావముల నోలలాడినవాడే. దేవాలయములవెంట దిరుగాడినవాడే. దాననే సర్వవేదాంతమార్గ సమన్వయ మార్గ మేర్పరచుకొనగలిగినాడు.

"ఈశావాస్య మిదగ్ సర్వం యత్కించ జగత్యాం జగత్" (ఈశావాస్య)

"ఏకో వశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి తమాత్మస్థయేఽనుపశ్యంతి ధీరాస్తేషాం సుఖం శాశ్వతం నేతరేషాం"

జగన్నియామకుడగు ఈశ్వరుడు సర్వవ్యాపకుడు. ఏకరూపవర్తి. బహురూపవర్తియగు పరమేశ్వ

రుని తన యంతరాత్మయం దున్నవానిగ నెఱుంగ గల వాడే శాశ్వతసుఖము ననుభవింపగలడు" అను సత్యాను భూతి పొందినవాడు. ఏబాటసారికైనను అలుపులు తీరునట్లు శాంతి ననుగ్రహించి శక్తివంతుని జేయుచు ముందుగతిని బట్టించుటయే ఈయోగవ్యగ్రుని నిరంతర కర్మ. తన ధ్యేయమూర్తి నట్లే కరతలామలకమువలె సగుణోపాసకుని సేవింపజేయగల సమర్థుడు. ఇది నిశ్చయము. "అహంబ్రహ్మాస్మి-తత్త్వమసి-ఏకం-ప్రజ్ఞానం బ్రహ్మం" అను నీసిద్ధుడు "సోహం" పథముననేకాక "దాసోహం" పథమునగూడ సాధకుల నుత్తీర్ణుల జేయ గల పరమపురుషుడు. ఈ బ్రహ్మజ్ఞానికి జాతిమతముల విపక్షతలు లేవు. ఈ శాంతిసాధువుసమక్షమున బ్రాహ్మణజాతిసాధకు లున్నారు; బ్రాహ్మణేతర సాధకు లున్నారు. మహమ్మదీయు లున్నారు. క్రైస్త వు లున్నారు. హిందువు లున్నారు. భారతీయు లున్నారు. అరవ లున్నారు; ఆంధ్రు లున్నారు. స్త్రీ లున్నారు; పురుషులున్నారు. పతితు లున్నారు; పావను లున్నారు. బ్రహ్మచారు లున్నారు; గృహస్థు లున్నారు; వానప్రస్థు లున్నారు; సన్న్యాసు లున్నారు. వీరెల్ల రీఅరుణాచలతపస్విని "భగవాన్" అనిపేర్కొను చుందురు.

మధ్యాహ్నకాలమున ధ్యానాయత్తచిత్తులై యున్న సాధకులకు మధ్య మునిసన్నిధానమునం దొక ఆంగ్లేయు డుండును. ఈతడు సైన్యమున మేజరుపని చేసినవాడు. దానిని త్యజించి రమణాశ్రమవాసి యై యున్నాడు. క్రైస్తవశ్రాసువలె కాళ్లను బంధించి బ్రహ్మదండి అట్లే నిలబడియుండునట్లుగ కాళ్లకును, వీపునకును ఒక బెల్టును బిగించి సాధనవ్యగ్రు డగు చుండును. ఎవరినిగాని పలుకరింపడు. ప్రత్యేకముగ నున్న తన కుటీరమునందే వసించుచుండును. అలహా బాదువిశ్వవిద్యాలయమునందు ప్రాచీనభాషాధ్యాప కుడుగా పనిచేయుచున్న డాక్టరు హాసీజు సయ్యదుగా రీభక్తులలో నొకరు. ఈయన ప్రేమాస్పదుడు. సంతోష మయుడు. "రక్తమాంసములతో సులభముగ గోచరించు భగవంతుడే యీరమణమహర్షి"యని యీమహమ్మ దీయవిదుని విశ్వాసము. చిత్రాపట్నప్రొఫెసర్యాటరుగా వెనుక పనిచేసియున్న దేవరాజు మొదలియారు గీతాప్రేమ ఐనకాలసాధకులలో నొకరు. "సాధకుల మార్గముల నద్భుతగులు మహాశిలలై ప్రతిపాత్రములో తర్జించి వేయగల భగవానుడే సిద్ధు"డని మొదల నగారి సం పూర్ణానుభూతి. కలకత్తావాసి డాక్టరు సేనుగారిసతి ఆంగ్లేయయువతి. నయశీల. రూపవతి. సీమ పిడి హైం దవభర్తతో హిందూదేశమునకు వచ్చినది. ఈమె ఎం. డి. డాక్టరు పరీక్షయం దుత్తీర్ణురాలై ఉద్యోగముచేసి దానిని వీడినది. తుదకు సంసారమునుగూడ త్యజించి రమణమహర్షి భక్తురాలై, నిత్య మాశ్రమమున కరు దెంచుచుండును. కృపామూర్తియగు రమణమహర్షి యీమెకు పరమపావనుడు. ఆంధ్రబ్రాహ్మణవితంతువు సూరి నాగమ్మయను కవయిత్రి (శ్రీ దోర్బల శేషాద్రి శాస్త్రిగారితోబుట్టువు. బెజవాడ) యిట గత నాలుగు సంవత్సరములనుండియు మహామునికృపారస మొకింత చవిగొనుచున్నది. సాధకురా లైనది. తన విద్యార్థిదశ నుండియు (౧౯౦౭ నుండియు) ఈమునిపాదాశ్రితుడై చిట్టచివరకు నుద్యోగము విసర్జించి ౧౯౩౫ నుండి దొర స్వామియయ్యరు ఆశ్రమవాసి యైనాడు. ఈయనసతి పట్టణమందు వసించుచు, నాయననుదర్శించుటకుమాత్ర మాశ్రమమున కరుదెంచుచుండును. సాయంసమయమున ౭ గంటలగునరికి అందరుస్త్రీలవలెనే ఈమెయు తిరిగి పోవుచుండును. ఈ దొరస్వామిఅయ్యరు "ఇతఃపరం బెరుగ" నను భక్తుడు. డాక్టరు పి. శివరావుగా రాశ్రమవైద్యులు. ఆశ్రమవాసుల కారోగ్యచికిత్స, తమ కాత్మచికిత్స వీరి నిత్యకృషి. ఎస్. రాజగోపా లన్ సకుటుంబముగ ఆశ్రమప్రాంతమున నివసించు చున్నాడు. ఋషిసన్నిధానవర్తి. గ్రంథాలయరక్షకుడు. కులీనుడు. మంచి చెడ్డల నెరుగగల మర్యాదస్థుడు. బెజవాడ గోవిందరాజుల సుబ్బారావుగా (ప్లీడరు) రిట సాధకులలో నొకరు. "వేదాంతము జీవిత సారము. కష్టానుభవమునగాని అది సాధ్యము గాదు. పూర్వసుకృతమునగాని రమణసంపర్కము గలుగ" దని ఈజిజ్ఞాసువు దృఢాభిమతము. నెల్లూరు ఓరుగంటి

సుబ్బయ్య (M. L. A) గారి వియ్యంకు డిట సాధకు లలో నొకరు. పలువురు విద్యార్థికులు, ధనికులు, భక్తులు, దేశారాధకు లిట కరుదెంచుచుందురు. ఈ విశ్వకర్మా గారమునుండి వలయునంత విజ్ఞానశక్తి గొంపోవుదురు. ఇట సాధకులలో కొందరు "ఓం నమో భగవతే రమణాయ" అని జపించువారును కలరట.

"జ్ఞాతా త్వమేవాసి జ్ఞానం త్వమేవ దృశ్యం త్వమేవాసి ద్రష్టా త్వమేవ కర్తానుమంతాచ భోక్తా త్వమేవ సాక్షీ త్వమేవాసి సర్వం త్వమేవ"

"త్వమేవ నిర్గుణబ్రహ్మ త్వమేవ సగుణేశ్వరి
త్వమేవ విశ్వం భువనం త్వమేవాహం నసంశయః"

"నీవే జ్ఞాతవు; జ్ఞానము. నీవే దృశ్యము; ద్రష్టవు. నీవే కర్తవు; భోక్తవు. అనుమంతవు. సాక్షివి. సర్వమును నీవే. నీవే నిర్గుణబ్రహ్మము. నీవే సగుణబ్రహ్మము" అను ప్రపత్తియోగమునుండి, మధుర భక్తినుండి సర్వము నుపాసనాదైవమయముగ నానందించుచు నీవే నేనను సిద్ధి బొందుటయే వీరి సాధన విధానము కాబోలు. "వాసుదేవ స్సర్వమితి" యను భావానుభూతి ఇట్టిదేమో! రాధానుభూతి చైతన్యానుభూతి ఇట్టివేకదా! మరికొందరు సాధకులు రమణుడు కుమారస్వామిఅవతార మని విశ్వసింతురట. ఈ భావ ప్రచారమున కాంధ్రుడును, ఆంధ్రులకు చిరపరిచితుడును నగు కీ. శే. కావ్యకంఠ గణపతిశాస్త్రిగారే ప్రథములు. ఈ కావ్యకంఠగణపతిశాస్త్రిగారి నామ మాశ్రమమున నిత్యానుసంధానము. ఆయన మహర్షికి గురువు. ఆయనకు మహర్షి గురువు. మహర్షి యాయనను 'నాయన' యనుచుండును. అందువల్ల ఆశ్రమవాసులెల్ల రాయనను 'నాయన' యని తలంచుచుందురు. ఆ పండితాగ్రేసరుడు తన ఆంధ్రగీర్వాణవిద్యావైదుష్యము నీ రమణమహర్షి కర్పించి కవితారూపమున స్వామిని స్తుతించియున్నాడు. ఎందరెందరో ఎన్నియో రీతుల వారివారి యనుభూతుల ననుసరించి ఈ రమణుని కీర్తించుచున్నారు. ఇన్నింట నొకమాటమాత్రము సత్యము. "స్థితప్రజ్ఞస్య కా భాషా" యను గీతా వాక్యమునకు రమణునివంటివా డని సమాధానము నొసంగుటకు వెనుదీయబనిలేదు. ఈ నిర్ణయమే నా ప్రథమదినానుభూతిఫలము.

## ౨

అక్షరాస్యుడు కాకమునుపే అంతరాత్మప్రేరణచే అరుణగిరికి తపస్సుకేగిన బాలుడు కారణజన్ముడు కాడా? ఎక్కడి తిరుచూరు? ఎక్కడి అరుణగిరి? ఎక్కడి వెంకటరామన్? అతడు సిద్ధుడై నేడెట్లున్నాడు? ఆ కారణజన్ముని జన్మకాలమహిమ అట్టిది కాబోలు. క్రీ. శ. ౧౮౭౯ డిశంబరు ౩౦-వ తేదీని పూర్వార్ధమున ౧ గంటకు రమణుడు ఉదయించినాడు. సూర్యసిద్ధాంతానుసారము ప్రమాదిసంవత్సర మార్గశిపదునారవదినమురాత్రి ఒంటిగంటకు; చాంద్రమానమున ప్రమాదిమార్గశీర్ష కృష్ణపక్షద్వితీయసోమవాసరము. ఆనాటి గ్రహకూటము క్రింది కుండలులలో చూపబడినది.

| | | |
|---|---|---|
| చ కే | శు | శ / గు |
| | రాశి | ఉ |
| | ల | రా ర / బు శు |

జననకాలగురుదశాశేషము సుమారు ౫ సం. ౬ మా. ౧౮౮౫.౬ వరకు శుక్రదశయు రాదు. ఈ శుక్రుడు లగ్నాష్టమాధిపతి వ్యయాధిపతితో సంయోగము ద్వితీయస్థితి. ద్వితీయసప్తమాధిపతి చూచుచున్నాడు. రానున్నది శుక్రదశాచ్ఛిద్రము కేత్వంతరము. లగ్నమును జూచుచున్నాడు. దీర్ఘాయుష్మంతుడు, చంద్రకేతుసంయోగము. కర్మస్థానాధిపతి స్వస్థానాత్




కేవలం నాలుగైదు సంవత్సరాల క్రింద స్టేషనుకు వెళ్ళడం చవకగానూ, సుఖంగానూ వుండేది ఇప్పుడు స్టేషనుకు వెళ్ళడానికి బండీ వగైరా ఖర్చులు మునుపటికంటె నాలుగు రెట్లుఅవును. ఒకప్పుడు ఎల్లాగవుండేదంటే. మీరు ఆలస్యం లేకుండా టిక్కట్టు కొనుక్కోగలిగేవారు - ఇప్పుడు అరగంట సేపు త్రోపులాట జరగనిదే టిక్కట్టు దొరకదు. ఒకప్పుడు ఎల్లాగ వుండేదంటే. అర్ధణాయో అణాయో యిస్తే కూలీలు మీరు చెప్పినట్లు చేసేవారు. ఇప్పుడు కూలివాడు దొర్కడమే కష్టం. ఒకప్పుడు ఎల్లాగ వుండే దంటే. మీకు కావలసిన రైలుపెట్టెలో మీరు కోరిన స్థలాన్ని కేటాయించుకొని వుండేవారు.

ఇప్పుడు రైలు యెక్క గలిగితే అదృష్టవంతులన్న మాట. తరుచు రైలునే దాటబెట్టుకుంటారు. ఒక వేళ రైలులోకి యెక్కగలిగి వచ్చినప్పటికీ, మీరు గంటల కొలది నిలబడి వుండవలసి వస్తుంది. ఈ త్రోపులాటలలో, గందరగోళంలో మీరు సామానులను పోగొట్టుకోవచ్చు; చివరకి మీ ఆడవాళ్ళనుంచి కూడా మీరు వేరుఅయిపోవచ్చు. అప్పుడు ఆడవాళ్ళతో ప్రయాణం చెయ్యడం ఇదివరకు వున్నంత సుఖంకాదు.

తెలివి తేటలు కలిగి పేరు మీకుటుంబంకూడా, తిరిగి వెనుకటి సాధారణ పరిస్థితులు యేర్పడేవరకు, రైళ్ళ మాట తలపెట్టుకోకండి.

# ప్రయాణాలు తగ్గించండి

AAA. 678. T. G.

| | | |
|---|---|---|
| చం | కే | గు బు |
| శు | అంశ | |
| ర | శ రా | ల కు |

వ్యయమున భాగ్యకోణమునందు కీర్తిస్థానమునం దుండుటచే సన్న్యాసిగాకుండ నెట్లుండగలడు? పంచమమున గురుడు ఉపపదాత్ ద్వితీయమున గలడు. సిద్ధుడైనాడు. సుఖభావాధిపతికి షష్ఠస్థితి. ఇక శరీరసుఖ మెట్లుండును? తృతీయమున రవిరాహువు లున్నారు. దీక్షకు ప్రతిబంధక మెట్లుండగలదు? అంశయందు గూడ ఆయా భావముల గ్రహములు బలవంతములై యున్నవి. శని నీచలో సప్తమమునం దున్నాడు. ఆబాల్యబ్రహ్మచారి కాగలుగుట వింతయేమి? ఇట్టి మరికొన్నియోగము లిందు గలవు. ఎన్నియోగములును లేక ధ్యేయమూర్తి యెట్లు కాగలడు? ద్వితీయవిద్యాస్థానమున కవిబుధు లిద్దరి కలయికయే రమణమహర్షి కవితాప్రతిభకు కారణము. సంస్కృతాంధ్ర తమిళమళయాళభాషలలో ఋషి మృదుమధురశైలిలో కవిత జెప్పగల సమర్థుడు. ఋషి వ్రాసినవి కొన్ని అచ్చుపడినవి. దస్తూరీ ముత్యాలకోవ. ఆంధ్రమునందు వీరు వ్రాసినపద్యములను జదువునపుడు శరీరము పులకరించును. అందలి తత్త్వోపదేశము, శైలి పరికింపనగును. ఆంధ్రమునగూడ వ్రాయను చదువను మాటాడను నేర్చినవాడు. చదువులయం దెల్ల సారమెరిగిన సకలోత్తమ సిద్ధున కసాధ్యమెద్ది? ఇచ్ఛామాత్రమున సర్వ మెరుకపడుచునే యుండును. అని తారాపథమునవే దృక్పథము నడిపించువాడు కాడు. కాలబద్ధుడు. నియమబద్ధుడు.

తొలికోడి కూయువేళనే శరీరవిశ్రాంతిని వీడును. కాలకృత్యములకై అరుణగిరి కేగును. ౭ గంటలగుసరికి కాలవిధులను నెరవేర్చుచుండును. "అనుదినము స్వామి చేయు ప్రథమకార్యము కూరలదరుగుట. కొన్నిమారు లుదయోపాహారమును వీరే తయారుచేయుదురు. జ్ఞానమునకును, నిత్యవ్యవహారమునకును వైరుధ్యము లేదు. కాయకష్ట మవమానకరము గాదు." (రమణలీలనుండి) ఈకర్మార్థప్రబోధమే స్వామి కీకర్మానుష్ఠానసంకల్పము.

౫ గంట లగుసరికి స్వామి ధ్యానమందిరమున సోఫాపై సుఖాసీను డగును. ౫ గంటల వేళ మొదటిగంట మ్రోగింపబడును. ఇంతలో శిష్యులు ధ్యానమందిరమున జొత్తురు. ప్రభాతశీతవాయువు లరుణోదయతేజోమయములై అల్లనల్లన వీచువేళ వేదాధ్యయనము ప్రారంభింపబడును. ఆశ్రమ వేదపాఠశాలా విద్యార్థులు హృదయానుభూతితో గొంతెత్తి భక్తిపూర్వకముగ జేయు వేదగానమున జొక్కనివారుండరు. అప్పు డొకమా రాసనాతనభారతాధ్యాత్మికవిద్యామాత కనులముందు నాట్యమొనరించుచున్నట్లుండును. ఇంతలో సాయంసమయమం దాశ్రమమును విడిచి అవల నిద్రించుటకై వెడలెడి నారీమతల్లు లరుదెంతురు. మహర్షి స్నానమున కేగును. తదుపరి ౮-౩౦ గంటలకు గంట మ్రోగును. రెండు ఇడ్డెనలు, అరకప్పు కాఫీ అతిథులతోడను, ఆశ్రమవాసులతోడను స్వామి స్వీకరించును. పిమ్మట ధ్యానమందిరమునకు స్వామి వా రరుదెంతురు. సాధకులు స్వామిసాన్నిధ్యమున సాధన సేయుచుందురు. మరికొంద రాశ్రమకార్యనిర్వహణమునకై యరుగుదురు. వేదవిద్యార్థులు దేవాలయ పూజాదికృత్యము లొనరింపబూనుదురు. భక్తు లరుదెంచుచుందురు. శబ్దరూపకముగగాని యాశీస్సుల నందుచుందురు. తృప్తు లగుచుందురు. ౧౦ గంట లగుసరి కొక కాషాయకౌపీనధారి ఆనాటి టపా స్వామి కందించుచుండును. ఈతడు స్ఫురద్రూపి. మధ్యవయస్కుడు. గడ్డము పెంచినాడు. జడ లల్లుకొనుచున్నవి. ఎప్పడో చిరపరిచితుడైన ఆంధ్రునివలె నున్నాడు.

ఈయన స్వామివారి ఆంతరంగికకార్యదర్శి. స్వామి వారికి దేశదేశములనుండి వచ్చు నుత్తరప్రత్యుత్తరములతో నీయన మునిగి తేలుచుండును. టైపురైట రెల్లప్పుడు ఆయనముం దుండును. చాలభాషలలో ప్రజ్ఞావంతుడట. పూర్వాశ్రమమున మదరాసునం దుండెడి న్యాయవాది. ౧౯౩౦ సంవత్సరమువరకు కాంగ్రెసులో పనిచేసిన దేశభక్తుడు. పట్టణమున కరతలభిక్షాటన మొనర్చి రాత్రులందును, మధ్యాహ్నమునందును భోజన మొనరించుచున్న సాధకుడు. భార్యావియోగానంతరమునుండియు నిటనే యున్నవాడు. కాషాయాంబరవేషధారిమాత్రము కాడు. ఆత్మానుభూతి సాధకుడు. మహర్షికి ప్రణమిల్లినపిమ్మట ఈయనను జూచినపిమ్మట చేతులు జోడింప కుతూహల ముద్భవింపక మానదు. పూర్వాశ్రమమున వీరు బి. వి. శివరావుగారు. ౧౨ గంటలగుసరికి భోజనములు, 3గం.సరికి కాఫీ పూర్తియగుచుండును. స్వామి ధ్యానమందిరమున 3 గం.కు ప్రవేశించి రాత్రి ౮ గం. వేళ భోజనమువరకు నచ్చే యుండును. ధ్యానమందిరము నుండి ఉదయ మొకపరి స్వామి గోశాల వంకకు, సాయంకాలమున సాధకుల మందిర మున్న తోట వంకకు కాలకృత్యమున కేగుచుందురు. ఇంతియే వారి చలనము. సాయంసమయమునందు ౫ గం.లకు మందిరమునం దున్న రేడియో సంగీతము ప్రారంభ మగును. కవి, గాయకుడు, భక్తుడు, సిద్ధుడు నైన త్యాగరాజ కీర్తనలు హాయిగ విననగును. స్వామి లలితకళాప్రియుడు. గానామృత మాస్వాదింపగల రసజ్ఞుడు. "సత్యం శివం సుందరమ్" అను అనుభూతి గల సర్వజ్ఞున కేది అప్రియము? అయిన నేమి? భక్తిరసప్రధాన కీర్తన యాలాపింపబడునపుడుగూడ హృదయరంజక సూచకమగు హావభావము లేవియు ఆతని వదనారవిందమున గోచరింపవు. ఇట్లని స్వామి హృదయస్పందనములేని నిర్జీవప్రతిమ గాదు.

ఒక భక్తుని మనుమడు మందిరమున ప్రాక నారంభించెను. ఆ బాలకుని కేరింతల కా ముని యొక త్రుటి యానందవశుడై యొక చిన్నినవ్వు నవ్వెను. అనుదినము ఉత్తరమువైపు కిటికీనుండి ముద్దుల మూటగట్టుచు నొక ఉడుత మౌనిపర్యంకమున కరుదెంచుచుండును. దానికి ముని యాహారమొసంగునప్పుడు ఆయనవదనమునం దొకవిధ మగు నలౌకికానందము స్ఫురించుచుండును. ప్రథమ దిన సాయంసమయమున గోవింద రామాయణము సమర్పించితిని. కొంతతడ వచ్చటచ్చట దానిని తమలో దాము చదువుకొనిరి. చివరకు గల గద్యను చదివి "వీరిదిగూడ పరాశర గోత్రమే" యనిరి. పరాశరసగోత్రోద్భవు డైన యీ ముని దాన నొకింత హర్షమును జూపినటుల దోచినది. మా మాతామహ గోత్రముగూడ భారద్వాజ గోత్రమే యనునెడ మరి కొంత హర్షము గోచరించినది. రామాయణము నంతను పద్యకావ్యముగ వ్రాయుచున్నా ననునంతట స్వామి న న్నాశీర్వదించినట్లు హృద్వేద్యమైనది.

సాయంసమయ మగునంత మరల వేదాధ్యయనము సాగును. పిమ్మట భక్తులు రమణగీతము లాలపింప మొదలిడుదురు. రాత్రి భోజనానంతర మొకింత తడవు భక్తయుక్తుడై స్వామి నిర్వికల్పసమాధ్యవస్థయం దుండును. ఇదియే నిత్యకృత్యము.

మూడుదినము లట నుంటిని. దినమున కొకటిరెండు మారులు తప్ప యాయన మంజులధ్వని వినిపించనే లేదు. మౌనముననే సర్వమును శాసించుచున్నాడు. ఆ ప్రేమ సముద్రుని జేరి ప్రణమిల్లి "సెలవు గైకొందు" నంటిని. ఆశీర్వదింపు డంటిని. ఆమోదకరముగ ఆశీర్వచనసూచకముగ ఆ స్వామి తలయూపినాడు. ప్రసన్నవదనుడై తృప్తిదీర నావంక ఒకపరి అవలోకించినాడు. అదేమో ఆసమ్మోహనాస్త్ర శక్తినుండి కాలు వెనుకంజ వేయకున్నది. మరల ప్రణమిల్లితిని. ఇక పోనిత్తు నన్నటుల తోచినది. మునిమందిరమునుండి హృదయశాంతితో బయటకు వచ్చితిని. ధన్యోస్మి యనుకొంటిని.

"తెలివి యొకింత లేనియెడ
దృప్తుడనై కరిభంగి సర్వమున్
తెలిసితి నంచు గర్వితమ
తిన్ విహరించితి తొల్లి నిప్పుడు

జ్వలమతులై  ండితుః
సన్నిధి నించుక బోధశాలినై
తెలియనివాడనై మెలగి
తిఙ గతమయ్యె నితాంత గర్వమున్."

అని స్మరించుచు ఆశ్రమవాటికను వీడితిని.

"వయ మిహ పరితుష్టా వల్కలై స్త్వం దుకూలైః
సమ ఇహ పరితోషో నాస్తి కించి ద్విశేషః"

అను భర్తృహరి సుభాషిత మాత్మానుసంధాన మైనది.

"వ్యతిషజతి పదార్థా నాంతరః కోపి హేతు
ర్న ఖలు బహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయంతే."

అను భవభూతివాక్య మప్లే హృత్ఫలకమున లిఖించిన ట్లయినది. శరీరము గగుర్పొడిచినది. మహామునికి దాసోహమని హృదయపూర్వక నమోవాక మర్పించితిని.

# చిత్రశాల

**శ్రీ కె. యస్. రెడ్డి =**

ప్రకృతి దేవత నిద్ర వీడకయమున్నె
కాకములుగూడ నిద్ర మేల్కనకమున్నె
ఎపుడు మేల్కాంచితివి నిద్ర యెట్టులిన్ని
చిత్రములు వ్రాయగలిగితి చెప్ప దేవ?

ఎచటి వీరంగు లెవరు పంపించినారు?
ఈయనంతంబు నెట్లు చిత్రించినావు?
నిమిషములలోన నెంతటి నిపుణివౌకద!
ఎవరు నేర్పించినారు నీ కిట్టి విద్య?

కల్పవృక్షప్రసూనాల కాంతి దెచ్చి
చంద్రసూర్యుల కిరణాల చాయ గలిపి
పాలమున్నీటిలోని తుంపరలు మెదిపి
చిత్రములు వ్రాయుచుందువో చిద్విలాస!

ఆకసంబున చిత్రంబు లార్చితీర్చి
తూలఖండములట్టి మేఘాల నెక్కి
నిమిష మొకచోట నిలువక నీ యనంత
విశ్వమంతయు దీప్తిగావింతువుకద!

ఎంత యానందజీవి వోయీమహాత్మ!
నిత్యమును నూత్నకళలచే నింపుకొనుచు
చిత్రశాలను దప్ప యోజింప వేల?
స్వార్థ మనునది నీకు లేశమును లేద?

# నరుఁడు



— శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామ శాస్త్రి —

కరచరణాదు లొక్కొకటి కావలె కావలె నన్న కాంక్షచే
నరుఁడెగడించుకొన్నటు కనంబడుచున్నది యెన్ని దివ్యవ
త్సరములు పుట్టి చచ్చెనొకదా! యొక ప్రాణముతోనె యీతఁడా
పరమతపస్సు వీడఁడొక ప్రక్క ప్రపంచమునందు మున్గియున్.

తరుణిరో! తత్తపస్సునను తా నభివృద్ధికి జన్మమెత్తుచున్
మరణముఁ జెందుచున్ నరుఁడు మాటికి నింక నెవండొ సర్వమున్
జరిపెడి నంచు బుద్ధి దిగజార్చు నిటుల్ పొనరింప గండగ
త్తెర యది యేమి వచ్చినదొ దేవునికిన్ తలపోయఁ డింతయున్.

పడతుక పానపాత్రికనె భగ్నము జేయఁగనోపఁ డెట్టి మం
దుఁడుఁ దన చేతిమీఁదుగ నినున్ సృజియించుట దైవమైనచోఁ
గెడపఁగలేఁడు లీలయనఁ గేవలమున్ మిము నీకు నీవెగా
మడిసి జనింతు వంట యసమంజస మాత్మపురోభివృద్ధికిన్.

తడవకు నొక్కరూప మిడి తా నరిచూచుచు నిన్ను దిద్ద నీ
యెడద జ్వలించు నీతపసునే యొక మృత్యువుగా శరీరమున్
విడిచెడివేళ నీవు పలవించుచు నుందువు చూచుచుండమో
బుడుతఁడు వంతులయ్యె నొక భూతముగాఁ దలపోయుచుండుటల్.

మగసిరి యాఁడుపోడిమియు మానవుఁ డొక్కరుఁడే వహించి నం
తుగనిన కాలమేని కలదో యనిపించుచునుండు నెంతగా
వగచెనొ యర్ధనారియగు వైఖరికై యలనాఁడు పాప మెం
తగ తపియించెనో యిటుల తా విడిపోవుటకున్ మనమ్మునన్.

కాల మదెంత పట్టినదొ కాంతరొ! యీమగయాఁడురూపులన్
జీలఁగ నెన్ని సాధనలఁ జేసిఁగూడను నొక్కరొక్కరిన్
బోలుట యెచ్చటేనిఁ గనమో మును పుండఁగఁబోలు పౌరుషో
స్మిలన కాఁడువారలును మీసలు దువ్వినయట్టి రోజులున్.



# నాగార్జునకొండ - కళాక్షేత్రము



= శ్రీ కొ. నరసింహాచారి =

నాగార్జునకొండ' గుంటూరుజిల్లాలో పల్నాడుతాలూకాయందు కృష్ణానదియొక్క దక్షిణపుటొడ్డున నుండు నొక రాతిమయమగు కొండ. ఇది మాచర్ల రైలుస్టేషనుకు పదునారుమైళ్ల దూరమున నున్నది.

## స్థలపురాణము

ప్రఖ్యాతివహించిన బౌద్ధగురువు నాగార్జునుడు తన యంతిమకాలమును ఈ కొండమీది బౌద్ధమతము లందు గడపిన కారణముగా నిది నాటినుండి నేటివరకు 'నాగార్జునకొండ' యనబరగుచున్నది. నాగార్జునకొండకు బోవలె నన్న మాచర్లస్టేషనులో దిగి పది మైళ్ల దూరమున నున్న నాగులవరమునకు బండికట్టుకొనిపోయి యచటినుండి కాలిబాటను ఆరుమైళ్లు నడచి నాగార్జునకొండను జేరవలసియుండును. కాలిబాట మొదటి రెండుమైళ్లును కొండల యడివారము వరకు ఆనందదాయకమైయుండి అటుతర్వాత నిట్రముగా నుండు కొండపై కెక్కవలసియుండుటవలన కష్టమనిపించును. ఈ బాట కొండపై నుండు బల్లప అపుభాగము చేరి అటనుండి మరల క్రిందికి దిగి పెద్ద పెద్ద గుండ్రాళ్లమయమగు ఇరుకులోయగుండా పోయి తుద కొక బయలును చేరును. ఇరుకులోయలో మార్గమున కిరుప్రక్కలను ముండ్లచెట్లు దట్టముగా పెరిగి దుర్గమ మనిపించును. లోగటి బయలుప్రదేశము ఎర్రమట్టి నేలయై మూడుమైళ్ల వెడల్పు గలిగి పశ్చిమమున నిజాము రాష్ట్రమునకు ఎల్లగా నుండు కృష్ణానదితోను, కొండలవరుసలతోను చుట్టబడియున్నది. ఇచ్చట కృష్ణానది అరమైలువెడల్పు గలిగి వర్షాకాలమున సముద్రపర్యంతము చిన్న చిన్న పడవల రాకపోకల కవకాశ మిచ్చునదియైయున్నది. ఈ లోగటి బయలునుండి వెలిదేశమునకు రావలె నన్న పైజెప్పబడిన ఇరుకులోయయందలి కాలిబాటగాని, కృష్ణానదీమార్గముగాని యాధారము. ఈ బయలునకు వాయవ్యమున నదియొడ్డున నిట్రముగా నుండి దాదాపు ఒక మైలు పొడవును, రెండువందల ఎకరముల విస్తీర్ణమును గలిగి శిఖరమున బల్లపరపు రాయిగలిగి దానియంచుల యందు గొప్పగొప్ప నిట్రమైన రాళ్లతో చుట్టబడియొక నైసర్గికపు కోట యనదగునది యీ 'నాగార్జునకొండ'. ఈనైసర్గికపుకోట ఇటుకరాళ్లతోను, సున్నముతోను మిక్కిలి బలపరుచబడియుండిన చిహ్నములను జూడ నిది నిజముగా నొక కోటగా నుపయోగింపబడియుండవలెను. ఇందు రెండు చిన్నహిందూదేవాలయములును, నొక మధ్యయుగపు రాతిద్వారమును తప్ప మరే పురాతనకట్టడముల చిహ్నములును కానరావు. బౌద్ధాలయము లన్నియు క్రిందనుండు మైదానముననే కలవు. ఇచ్చటి కట్టడములలో నుపయోగింపబడిన ఇటుకరాళ్లు ౨౦" × ౧౦" × 3" పరిమాణము కలిగి, ఇచ్చటికి పెక్కువందల మైళ్లదూరమున నుండు

అశోకుని ముఖ్యపట్టణముగా వెలసిన పాటలీపుత్రము నందలి కట్టడములందు మాత్రమే యుపయోగింపబడి, మరెచ్చటను ఇట్టి నమూనాలు లేకుండుట యొక విశేషాంశము.

లోయమధ్య భాగమున, నిపుడు పుల్లారెడ్డిగూడె మను గ్రామముకలదు. దానియందు కొందరు హిందువులును, చెంచులును, లంబాడీలు మాత్రమే నివసించుచున్నారు. లోయలో నచ్చటచ్చట పురాతన బౌద్ధాలయములకు చేరిన కూటములయొక్క స్తంభములు మాత్రము కానవచ్చును. లోయ మధ్యమున రాజాంతఃపురము యొక్క చిహ్నములు కనబడుచున్నవి. అమరావతి స్తూపములుండు ప్రదేశవైశాల్యముకన్న నీలోయవైశాల్యము గొప్పదై యుండుటవలన నిచ్చట ఆలయస్తూపాదులుకాక లౌకికుల గృహములుగూడ ననేకములుండి యుండవలెను. మూడుప్రక్కల పెట్టని కోట లనదగు కొండలును, కృష్ణానదియు, దానియొడ్డున రెండు బలిష్ఠములగు కొండదుర్గములును రక్షించుచుండు నీలోయ పూర్వకాలమున శత్రుదుర్భేద్యమై మిక్కిలి ప్రసిద్ధిచెందిన నగరముగా నుండియుండవలెను. ఇదికాక కృష్ణానదియొడ్డునను, నది పారునట్టి లోయలోను కల 'గోలి', 'చేజెర్ల', 'అమరావతి', 'జగ్గయ్యపేట', 'ఘంటసాల', 'గుమ్మడిదుర్రు', 'బెజవాడ', 'భట్టిప్రోలు' మొదలయిన బౌద్ధనగరములతో రాకపోకలు గలిగియుండవలెను.

ఇట్టి ప్రఖ్యాతి జెందియుండియు నామమాత్రావశిష్టమయియుండిన ఈప్రదేశమును తొలుత కీ. శే. రంగస్వామిసరస్వతిగారు (**Telugu Asst. to the Archeological Superintendent for Epigraphy, Madras**) కనిపెట్టిరి. తర్వాత లాంగ్‌హర్ట్సు (**Long hurst**) దొరవారు ఈ ప్రదేశమును చక్కగా పరిశీలించి పాడుపడియు పూడుపడియు నుండిన యత్యద్భుత శిల్పములను బహిరంగమునకు దెచ్చి తెలుగుదేశమునకు మహోపకారము చేసినవారైరి. వారు ఇచ్చట నూర్లకొలది శాసనములను గల స్తంభములను, శిల్పములను, ఆలయములను, స్తూపములను, మఠములను, నాణెములను, విగ్రహములను, బుద్ధభగవానుని స్మారకచిహ్నములను కనుగొనిరి. ఇచ్చట దొరకిన శాసనములు, చారిత్రకాంశములను గురించి యెక్కువ విపులముగా జెప్పకపోయినను ఆకాలమున ఆంధ్రరాష్ట్రమును ౨, 3 శతాబ్దములలో దక్షిణఇక్ష్వాకువంశరాజులు పాలించుచుండినట్లు తెల్లముచేయుచున్నవి.



నాగార్జునకొండ కళాక్షేత్రములోని ఒక శిల్పఖండము

(మాయాదేవి లంబినీవనమున గౌతముని గనుట)

## ఆంధ్రరాజుల కాణాచి

ఈ ఇక్ష్వాకులు చాల ప్రసిద్ధిజెందిన యాంధ్రరాజులు. వీరు 'వనవాస' (**North canara**) మహారాజులతోను, ఉజ్జయిని నేలుచుండిన మహాక్షత్రపచష్టనుని వంశీయులగు రాజులతోను సంబంధబాంధవ్యములు కలిగియుండిరి. ఈరాజులను గురించిన ఒక విచిత్రవిషయ మేమనగా, పురుషులు హిందూమతావలంబకు

లయి వైదికకర్మాచరణపరాయణు లయియుండ స్త్రీలు బౌద్ధమతావలంబులయి యనేకబౌద్ధమఠములను, విహారములను, ఆలయములను గట్టించి బౌద్ధజనోపయోగము లగు ధర్మకార్యములం దాసక్తి గలిగియుండిరి. నాగార్జునకొండయందలి బౌద్ధకట్టడముల నిర్మాణములందు పురుషులు శ్రద్ధవహించినవారు కారు. అయ్యును ఇచటి ఆలయాదుల నిర్మాణమునకు ఇక్ష్వాకువంశపు రాణులయొక్కయు, రాజపుత్రికలయొక్కయు భక్తియే కారణము. ఇట్టి రాజస్త్రీలలో మిగుల ప్రఖ్యాతి గాంచిన యామె శాంతిసిరి యను రాజకుమారిత. ఈయమ శ్రీవీరపురుషదత్తు డను రాజుకాలమున నొక మహాచైత్యమును, ఇంకను నొక దేవాలయమును, దానిప్రక్కన నొక కూటమును కట్టించెను. శాంతిసిరికి తోడ్పాటుగ నీధర్మకార్యములం దాసక్తికలిగినవారు మరిముగ్గురు స్త్రీ లుండిరి. ఈయమ కట్టించిన మహాచైత్యమునకు తూర్పున రెండు ఫర్లాంగుల దూరమున నాగరాళ్లబోడు అనబడు నొక చిన్న గుట్టపై మిక్కిలి ముఖ్యములగు కొన్ని మఠములును, ఆలయములును, స్తూపములును గలవు రాజస్త్రీలు కట్టించిన స్తూపాదులకు తోడు బోధిసిరి అను నొక సామాన్యబౌద్ధోపాసిక కట్టించిన ఆలయముకూడ ఇట కలదు. ఇది కాశ్మీర, గాంధార, చీనా, తోసలి, అపరాంత, వంగ, వనవాస, యవన, దమిల, తామ్రపర్ణి ఇత్యాదిదేశములందు బౌద్ధమతప్రచారములు చేసి యందలి జనుల ననేకుల బౌద్ధమతావలంబులుగ జేసిన సింహళద్వీప సులగు బౌద్ధసన్యాసుల జ్ఞాపకార్థమును, గౌరవార్థమును కట్టబడెను. బోధిసిరి ఇదికాక కృష్ణానదీముఖమున కంటకోసల యనుచోట గల మహాచైత్యముయొక్క తూర్పుద్వారమువద్ద నొక రాతి కొళ్లమంటపమును కట్టించినట్లు శాసనములందు గలదు. ఈ శాసనములలో నాగార్జునకొండవద్దనుండు లోయ బయలున నుండిన నగరము విజయపురి యనియు, ప్రస్తుతము నాహరాళ్లబోడు అనబడు కొండ శ్రీపర్వతమందలి చిన్న ధర్మగిరి యనియు పేర్కొనబడియున్నవి. నల్లమల లను కొండలకు పూర్వము శ్రీపర్వత మను నామ ముండినట్లు శాసనములవలన నేర్పడుచున్నది. ఈ నల్లమలలలోనిదే కర్నూలుజిల్లాలోని శివక్షేత్రమగు శ్రీశైలము.

## దేశదేశాలతో వ్యాపార వ్యవహారాలు

సింహళద్వీపబౌద్ధసన్యాసులకుగాను నాగార్జునకొండయందు మఠములు కట్టబడియుండుటను జూడ ఆకాలమున సింహళమునకును, కృష్ణాలోయలోని నగరములకును రాకపోకలు విశేషముగా సాగుచుండి యుండవలెను. సింహళద్వీపమునకును, కృష్ణాముఖద్వారమున నుండు కంటకోసల (**Masula**) కును విశేషవ్యాపారము జరుగుచుండెను. ఈ వ్యాపారమే కృష్ణాలోయయందు బౌద్ధమతవ్యాప్తికి ప్రోద్బల కారణమయియుండెను. ఏలన, వర్తకము చేయుచుండినవారనేకులు బౌద్ధులైయుండిరి. ఐశ్వర్యవంతులగు వణిజులు బౌద్ధు లగుటవలన బౌద్ధా



నాగార్జునకొండ కళాక్షేత్రములోని మరి ఒక శిల్పఖండము
(గౌతముని జాతకము వ్రాయుట)

యము లిచ్చుట ప్రబలుటకు అవకాశము కలిగెను. ఇదికాక ఈ కృష్ణానదీ ప్రాంతదేశములకును, పశ్చిమమున రోమకరాజ్యమునకునుగూడ విశేషవ్యాపారము జరుగుచుండెను. ఈ వ్యాపారమువలన మన దేశీయులు విశేషధనవంతు లయియుండిరి. కాలక్రమమున రోమకరాజ్యపతనముతో మన దేశపు వ్యాపారము క్షీణించుటయు, అది కారణముగ కృష్ణానదీప్రాంతదేశముల బౌద్ధుల సాంఘికమును క్షీణించమొదలిడెను. ఇదేకాలమున సముద్రగుప్త చక్రవర్తియొక్క దక్షిణదేశ దండయాత్రయు, హిందూమతావలంబులగు పల్లవ, చాళుక్య రాజులు దక్షిణదేశమున ప్రబలు లగుటయు బౌద్ధమత వ్యాప్తి కొక యంతరాయమును, క్షీణదశయు కలిగించెను. హిందూమతోద్ధారకు లగు శ్రీ ఆదిశంకరులవారు తమ పరివారముతో నాగార్జునకొండకు వచ్చినట్లును, అచ్చటి బౌద్ధాలయముల నన్నింటిని ధ్వంసము చేయించినట్లును నొక లోకవాదము ఈ ప్రాంతమున కలదట. శ్రీశైలముగూడ తొలుత బౌద్ధ క్షేత్రముగా నుండి శ్రీ శంకరులవారి కాలమున శివక్షేత్రముగా జేయబడినట్లు చెప్పుదురు.

నాగార్జునకొండ శాసనములను బట్టి చూడ ౨, 3 శతాబ్దములలో విజయపురి యను నిచటి నగరము దక్షిణ హిందూ దేశమున ప్రఖ్యాతి వహించిన బౌద్ధ క్షేత్రములలో నొకటి యనియు, హిందూదేశమునందన్ని ప్రాంతములనుండియు, సింహళము చీనాదేశముల నుండియు బౌద్ధ యాత్రికులును, విజ్ఞానులును, విద్యాభిలాషులును వచ్చుచుండినట్లు తెలియుచున్నది. అయిన హియక్ త్సాంగ్ ఈదేశమునకు వచ్చిన కాలమునకే ఇది పాడుపడి శిథిలములతో నిండిపోయెను.

## వ్యాపారకేంద్ర చిహ్నములు

నాగార్జునకొండయందలి ఆలయములు ఇచ్చటి పుణ్యక్షేత్రతను చాటునట్లే, ఇది గొప్ప వ్యాపార స్థలమని చాటు చిహ్నములుగూడ ఇందు కలవు. ఇచ్చట కృష్ణాతీరమున నొక రేవుఅరుగు (**wharf**) కలదు. ఈ యరుగు ౨౫౦ అడుగులపొడవును ౫౦ అడుగుల వెడల్పును గలిగి నీటిమట్టముపైకి ౬ అడుగుల యెత్తుగలిగి యున్నది. ఈఅరుగు పొడవుననునిపుడు మూడువరుసల స్తంభములు నిలచియుండుట జూడ నిది వర్తకపు సరకులను దింపి నిలువ చేయుటకుగాను కట్టబడిన పాక (**goods shed**) గా నుండవచ్చును.

ఇచ్చట దొరకిన శిల్పములును, శిలావిగ్రహములును, శాసన స్తంభములును అసంఖ్యాకములుగ నుండుటవలనను, దక్షిణహిందూదేశమున సేకరింపబడిన శిథిలము లన్నిటికంటెను ఇవి ప్రఖ్యాతి చెందినవి కావునను లాంగ్ హర్స్టు దొరగారు వీటినన్నిటిని నిచ్చటనే ఒక ప్రదర్శనశాలయందువలె నేర్పరచుటకు సంకల్పించుకొనియుండ ఈకారణముననే ఈ ప్రదర్శనార్హములగు శిథిలములను వేరొక ప్రదేశమునకు గొంపోవు తలంపు ఆంధ్రలోకము నాందోళనపడ జేసినది. ఇట్టి ప్రదర్శనార్హము లగు శిల్పములు లెక్కకు మించియొక స్థానమందే లభించి యా స్థాన ప్రాముఖ్యతను చాటునవగుచున్నప్పుడు అట్టివానిని వాని స్వస్థానమందే యుంచి వాని దర్శనార్థము జనుల నాకర్షింపజేయుటకు కావలసిన ప్రచారమును, వసతులనుచేయుటయే మిక్కిలి ప్రశంసార్హమగు కార్యమగును.

# నాగార్జునుని గూర్చి



= శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి =

ఆచార్యనాగార్జునుఁడు బౌద్ధమతమున 'మధ్యమక' సిద్ధాంతమును వెలయించిన ఁడు. అతని 'మధ్యమకకారికల' ననుసరించి మధ్యమకావతార మను గ్రంథము నాఱవశతాబ్దిలో రచించిన చంద్రకీర్త్యాచార్యుఁడు తన గ్రంథమున నాగార్జునాచార్యుని ధర్మతత్త్వ నిర్ణయము ప్రమాణమగుట యెట్లని శంకించుకొని కొంత వింతవిషయము వెల్లడించినాఁడు. దీని నింతవఱకు చరిత్రపరిశోధకులు గుర్తించినట్లు నా కెఱుకపడలేదు. కారణ మాగ్రంథము చైనా టిబెట్టుభాషలలో నుండుటయే. ఈనడుమ శ్రీ అయ్యాస్వామి శాస్త్రిగారు దానిని సంస్కృతీకరించి కొంత ప్రకటించుటచే దానిని నేను గుర్తింపఁగల్గితిని. మధ్యమకావతారముషష్ఠప్రకరణమున—

"జానాతి ధర్మం స మహాగభీరం
యథాగమేనాపి నయేన చాన్యైః
తథార్యనాగార్జునశాస్త్రనీత్యా
యథావ్యవస్థం మత ముచ్యతే హి.

వ్యాఖ్యా:—యథా బోధిసత్త్వః ప్రజ్ఞాపారమితాయాం చరన్ యథాతత్త్వం ధర్మాణామాత్మతాం పశ్యతి, తథార్యనాగార్జునే నావిపరీత మాగమం జ్ఞాత్వా యుక్త్యాగమాభ్యాం ధర్మాణా మాత్మభావో యథాభూతో నిస్స్వభావలక్షణకస్సన్దృష్టం దేశితః. తస్మాత్ యథైవ నాగార్జునపాదాః యుక్త్యాగమాభ్యాం ధర్మాణాం తత్త్వ ముపాదిశన్—తథా మయా తదుపదిష్టం మతం యథావ్యవస్థ ముచ్యతే. అథ తావత్ కథం తస్య నాగార్జునస్య అవిపరీతాగమనిర్ణయః స్యాత్-ఇతి. ఆగమాత్. యథోక్తమార్యలంకావతారే—

దక్షిణాపథదేశాయాం భిక్షుః శ్రీమాన్ మహాయశాః,
నాగాహ్వయ స్స నామ్నా తు సదసత్పక్షదారకః.
ప్రకాశ్య లోకే మద్యానం మహాయానమనుత్తరమ్,
ఆసాద్య భూమిం ముదితాం యాస్య తేసౌ సుఖావతీమ్.

ఆర్యద్వాదశసహస్ర మహామేఘేప్యుక్తమ్.—

లిచ్ఛవికుమారోయం సర్వసత్త్వానాం దర్శనే నన్దక ఇత్యానన్దః. నిర్వాణాచ్చతుశ్శతేషు వర్షేషు వ్యతీతేషు నాగాహ్వయో భిక్షుర్భూత్వా మద్దేశనాం విస్తరేణప్రకాశ్య అనుపూర్వేణ సువిశుద్ధ ప్రభాభూమి జామకలోకధాతౌ తథాగతః అర్హన్ సమ్యక్ సంబుద్ధః జ్ఞానాకరప్రభాభిధో భవిష్యతి. అతోస్యావిపరీతాగమనిర్ణయఃసిద్ధః"

దీనిసారము:—

"బోధిసత్త్వుఁడు (అనఁగా బుద్ధుఁడు) ప్రజ్ఞాపారమితభూమికలోఁ జరించుచుండువాఁడుగాన ధర్మస్వరూపమును గుర్తింపఁగలఁడు. అట్లే యార్యనాగార్జునుఁడు గూడ నవిపరీతముగా ధర్మతత్త్వమును గ్రహింపఁగలఁడు. నాగార్జునుఁడు యుక్త్యాగమములచే ధర్మతత్త్వమును నిరూపించెను, దానినే నేను వివరింతును. (అని చంద్రకీర్తి అన్నది) కాని బుద్ధునికిఁబోలె నాగార్జునునికి నవిపరీతాగమనిర్ణయమెట్లు కుదురును అని యాక్షేపమేని, దానికి సమాధాయకముగా నాగమ మున్నది. ఆర్యలంకావతారసూత్రమునందు (ఇది బుద్ధుని యుపదేశమే) ఇట్లున్నది:

దక్షిణాపథదేహాళియందు (వేదళి యని లంకావతారసూత్రమున నున్నది. ఇది జపానులో ముద్రితము. దక్షిణాపథవేదళి యనునది యాంధ్రదేశమున నేటి యేగ్రామమగునో గుర్తింపఁగాకున్నది. అది నాగార్జునకొండకు సమీపప్రదేశముననే యుండఁబోలును.) నాగార్జునుఁ డని భిక్షువు వెలయును. అతఁడు మహాయాన మనుపేర నా(బుద్ధుని) మార్గమును నెలకొల్పి సుఖావతీ భూమికను బొందఁగలఁడు.

మఱియు బుద్ధోపదేశమే యగు 'ద్వాదశసహస్ర మహామేఘ' మను గ్రంథమున నిట్లున్నది:

లిచ్ఛవికుమారుఁడు సర్వసత్త్వములకు దర్శనమాత్రచే నానందజనకుఁ డగుటచే నానందుఁ డనఁబరగినవాఁడు. నిర్వాణముచెందినపిదప నాల్గువందల యేండ్లకు నాగార్జునుఁ డను భిక్షువై వెలసి నాయుపదేశమును విస్తరముగాఁ బ్రకాశింపఁజేసి సువిశుద్ధప్రభాభూమి యను లోకమున సమ్యక్సంబుద్ధుఁడై జ్ఞానాకరప్రభుఁ డనుపేర వెలయును.

కాన అతనికి నవిపరీతాగమనిర్ణయము సిద్ధమయ్యెను" అని.

పైగ్రంథమునుబట్టి చూడఁగా, నాగార్జునుఁడు క్రీస్తుకుఁ బూర్వము ప్రథమశతాబ్దిలో నుండినవాఁడగును. లేక క్రీస్తుతర్వాత ప్రథమశతాబ్దివాఁడేని కావచ్చును. లంకావతారసూత్ర మన్న గ్రంథము క్రీస్తుతర్వాత రెండవశతాబ్దిలోని దందురు. కాన నాగార్జునుఁడు దానికిఁ బూర్వ మున్నవాఁడు కాఁదగును.

పంచఖండాత్మకమై నిత్యనాథసిద్ధునిచే రచితమయిన రసరత్నాకర మన్న వైద్యగ్రంథములో నొక ఖండమున శ్రీశైలవర్ణన మద్భుతముగా నున్నది. ఆగ్రంథమున వాదఖండాదులలోఁ బెక్కుచోట్ల "పురా నాగార్జునోదితమ్" ఇత్యాదివిధముల నాగార్జునాచార్యప్రశంస కలదు. దీనినిబట్టికూడ నాగార్జునుఁడతిప్రాచీనుఁ డని, శ్రీశైలప్రాంతవాసి యని తేలును. నాగార్జునుని గ్రంథములలో 'కక్షపుటతంత్ర' మను గ్రంథమునఁగూడఁ బెక్కుచోట్ల నాతని సిద్ధపురుషత్వము గోచరించును. ఇది ప్రాచ్యలిఖితపుస్తకశాలలో నున్నది. నాగార్జునుని బౌద్ధ, రసవాదవైద్యశాస్త్ర గ్రంథములు పెక్కు లింక నముద్రితములే. టిబెట్టు చైనాదేశములలో నాతని బౌద్ధగ్రంథము లున్నవి. వైద్యగ్రంథమొకటి ముద్రితమయినది.



# పౌష శ్రీ

## = శ్రీ పాలెపు వేంకటరత్నం =

ఒక ప్రాభాతికవేళ శీతఘనబాధోద్వృత్తి నే సాలువా
సకలాంగంబులకున్ ముసుంగిడి సుఖాశన్ సుప్తి నుండంగఁ, 'గొ
క్కురోకో' యని తామ్రచూడవర మాఘోషింప కన్విచ్చి, లే
చి కనుంగొంటి మనోజ్ఞపౌషప్రకృతిశ్రీచిద్విలాసాకృతిన్.

పచ్చనై కన్పట్టు భవ్యశాద్వలతలిన్ జాలుగా మంచుముత్యాలు చేరె
అరవిచ్చు చేమంతి విరిసోయగము మెచ్చి భ్రమరాళి వలగొని పాటపాడె
ముంగిళ్లఁ జెలువారు రంగవల్లికలలో బంతిగొబ్బెమ్మలు పాదుకొనిరి
ప్రక్కవీథిని పాట పాడు సాతానిజియ్యరు కాలిచిఱుగజ్జియలు నదించె
గొబ్బి తట్టెడు బాలికాకోమలాస్య - జనితమృదుహాసలహరులు సంచరించెఁ
బాలముచాయల వినిపించెఁ బాలియగాని - గూర్చి పాడుచుఁ గుప్పల నూర్చుసద్దు.

చేత మర్కటరాజు సింగారమును గూర్పఁ బడుచుకోయత బిచ్చమడుగవచ్చె
కుఱుమాపుపైఁటలోఁ గూన నుంచుక వచ్చె నెఱుకులకొలపు బాలెంతరాలు
పికిలియీఁకలకుచ్చు వెలయు కుళ్లాయితో నొక చెంచు చనుదెంచి బికిరమడిగె
జేగుఱురాళ్లను చిక్కన నిడి విక్రయార్థమై ఘోషించె నాటవికుఁడు
డోళ్ల వాయించి మంగలికోళ్ల నాఁది-వచ్చి గంగెద్దుదాసరి బిచ్చమెత్తె
నంతలోఁ దన్మయతఁ జెందునట్టి నన్ను-వనిత పరిహాస మొనరించి పలుకరించె.

ధవళాద్రినిర్మలత్వము ధిక్కరించు నీ వెల్లపూసిన యిండ్ల తెల్లఁదనము
లక్ష్మీనివాసవిలాసంబులం దెల్పు పసుపుఁగుంకుమల నొప్పెసఁగు గడప
లలరుదండలు కాంతులొలుకఁబోసినవి సుందరశిల్పముల నొప్పు ద్వారసమితి
కమనీయహేమనిష్కసమానకాంతుల ధాన్యరాసులతోడఁ దనరెఁ బంచ
లెంత సౌభాగ్యసౌందర్యవంతురాల - వమ్మ! ఆగర్భధనవంతురాల పౌషి !
నీవిమల దివ్యతరకమనీయసుషమ-కవిహృదయసీమ శతరత్నకాంతి నించె.

చిన్నబావ ప్రయాణసన్నాహ మొనరింప మఱఁదలు చేసంచి మాటుపఱిచె
చీరపై జలతారుచారలు లేవని పుత్రిక నాన్నపై మోము ముడిచె
విందువంటకు సగ్గుబియ్యమేవీ! యని వెలఁది నాథునితోడ విరసమాడె
చాటుగా మగనితో మాటలాడిన యాఁడుబడుచు వధూటిక పరిహసించె
కృషి ఫలింపఁగ మంచి జోడెడ్లు కాఁడి - మేడిహాలమును రైతు ప్రేమించి కొలిచె
సకలసౌభాగ్యకల్యాణసదనమైన - స్వర్ణసంక్రాంతికాంతులు జగతి వరల.

ప్రకృతిదేవీమృదుల నాట్యపాటవమున - సరసనైసర్గికవిలాసచాలనముల
నణువణువునందు శుభగీతు లాలకించి - సుకవి నిశ్చలానందము చూఱగొనియె.




ఫేషను

# నవ్యసాహిత్యపరిషత్తు



= శ్రీ నోరి నరసింహశాస్త్రి =

వంగాది దేశములలోవలెనే తెలుగు దేశములో కూడా ఆంధ్రసాహిత్యపరిషత్తు పుట్టి విశేష భాషాసేవ చేసింది. దాని జన్మము చెన్నపురిలో ౧౯౧౧ సం.లో. ఆ పరిషత్తుకు మూలకందము శ్రీ జయంతి రామయ్యపంతులు. దాని భారము వహించిన మహానుభావులలో ప్రధానులు శ్రీ పిఠాపురము మహారాజావారు. అప్పుడు అసంఖ్యాకులైన పండితులూ, కవులూ చేరి ఆంధ్రసాహిత్యపరిషత్తును ఉన్నతశిఖరము అధిరోహించునట్లు చేసినారు. ఆంధ్రప్రాచీన గ్రంథవిమర్శనము, పరిశోధనము విస్తారముగా జరిగినవి. చక్కని గ్రంథాలయము స్థాపించి అమూల్యమైన గ్రంథజాలము సంపాదించినారు. బహుద్రవ్యప్రయాస సాధ్యమైన సూర్యరాయాంధ్రనిఘంటువు తుదనెగ్గించినారు. పరిషత్పత్రికద్వారా భాషాసేవ జరిగింది. శ్రీ జయంతి రామయ్యపంతులుకీర్తికి ఆంధ్రసాహిత్య పరిషత్తు జయస్తంభము!

అయితే ఆంధ్రసాహిత్యపరిషత్తు ప్రభవించిన రోజులలోనేనో, లేక తర్వాత కొద్దికాలానికో ఆంధ్ర భాషాలోకములో కొత్త సాహిత్యబీజ మొకటి మొలకెత్తి గోచరమైనది. దాని విలువ ముందుగా తెలుసుకొని పదిలపరచడానికి శ్రద్ధపట్టినవారు శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ గిడుగు రామమూర్తి. ప్రథమదశలో దానిని ఆదరించినవారు ఆంధ్రభాషాజ్ఞానము విశేషము లేని ఇంగ్లీషుచదివినవారు. కాని క్రమముగా, ముందు కథకులూ, పత్రికాలేఖకులూ, నాటకరచయితలూ, చివరకు కవులూ, పండితులూ దానియందు అభిమానము కలిగినవారైనారు. ఇది వ్యావహారిక భాషావాదము! ఈపక్షమువారికి పూర్వగ్రాంథికముమీద ఆదరాభిమానాలు ఏమాత్రమూ తక్కువకాదు. తండ్రిని గౌరవించక కాదనే కుమారునికి ఆస్తికలోకంలో స్థానము లేదు. శిష్టుల వ్యావహారిక భాషకుకూడా గ్రాంథికమయ్యేయోగ్యత ఉన్నదనిమాత్రమే వీరి ప్రధానవాదము. లాప్రకారము మాట్లాడితే, కుమారుడు తనకు జన్మతోనే కుటుంబాస్తిలో హక్కు ఉన్నదికనుక వ్యక్తత రాగానే భాగము పంచిపెట్టుమని తండ్రిని కోరినాడు.

ఇది ఆంధ్రసాహిత్యపరిషత్తు అధికారవర్గములోనివారికి ఇష్టము లేకపోయింది. ఈ నూతనవాదమును వా రొక నూతనభాషాంకుర మని గమనించక పోగా పూర్వభాషకు వేరుపురువని తలంచి దానిని ప్రతిఘటించి చిదిపివేయవలె నని ప్రయత్నించినారు. ఇది ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రచురించిన రజతోత్సవసంచికలో 'పరిషచ్చరిత్రము' అనే శీర్షికతో శ్రీ జయంతి రామయ్యపంతులువ్యాసమువల్ల విశదమవుతుంది. అందులో ఈమాట లున్నవి:

> " అన్ని విషయములలోను యథేచ్ఛావాదు లెప్పటికి నుందురు. వారి నడ్డుపెట్టువారు లేరు. కాని వాదమునకు రాజాదర ముండుచో నది యనర్థదాయక మగును. గ్రామ్యవాదమున కట్టి యాదరము లేకుండఁజేయుటయే పరిషత్తు నిర్వహించిన ఘనకార్యములలో నొకటి. "

* ఈ వ్యాసములోని విషయాలకు బాధ్యత వ్యాసకర్తదేకాని అందుకు పరిషదధికారము లేదు. ఈ వ్యాసకర్త నవ్యసాహిత్యపరిషత్తులో కేవలము సామాన్యసభ్యుడుమాత్రమే! నో. న. శా.

పైవాక్యములలో ఎంతో అర్థ మిమిడిఉన్నది. పై ఉపమానము పెంచితే పరిషత్తు తన పుత్రునికి ఆస్తి లేకుండాచేయడానికి ప్రయత్నించినట్లు స్పష్టమవుతుంది. కుమారునికి హక్కు స్థిరపడేవరకూ రాజాదరము తండ్రిదే. అందుకు సందేహ మేమున్నది! శ్రీ రామయ్యపంతులు విద్వాంసుడు. బహుభాషాకోవిదుడు. భాషాభిమానములో ఎవరికీ తీసిపోని ఉదాత్తవ్యక్తి. ఐనా వ్యక్తులు ఎంత గొప్పవారైనా వారికంటె సంస్థలు తరుచుగా గొప్పవి. ఆంధ్రసాహిత్యపరిషత్తు సభలకు అధ్యక్షపీఠ మలంకరించినవా రెందరో వ్యావహారిక భాషావాదము న్యాయసిద్ధమని అంగీకరించినారు, నెమ్మదినెమ్మదిగా. కాని శ్రీ జయంతి రామయ్యపంతులు మారలేదు. ఇంకా వారికి భగవంతుడు దీర్ఘాయుర్దాయముప్రసాదిస్తే మారేవారేమో! వారివలెనే ఆంధ్రసాహిత్యపరిషత్తుకూడా మారలేదు!

తండ్రి కుమారుని ఆదరించక భాగము పంచి ఇయ్యడానికి నిరాకరిస్తే కుమారుడు పంపిణీకి దావా వేస్తాడు. నవ్యాంధ్రభాష చేసినది సరిగా ఇదే! ఆంధ్రభాషాభిమానులకు చాలామందికి తనయం దభిమానము కలిగించుకొని ఆంధ్రలోక మనే న్యాయస్థానములో దావా వేసింది. ఆ దావా వేయడమే నవ్యసాహిత్యపరిషత్తు స్థాపనము !

ఈ భాషాభిమాను లంతా ఆంధ్ర సాహిత్యపరిషత్తులో చేరి దానిచేతనే ఈవాదము అంగీకరించేట్లు చేసి కలిసికట్టుగా పోరాదా అని అడగవచ్చును కొందరు. ఆ ప్రయత్నము జరగకపోలేదు. శ్రీ గిడుగు రామమూర్తి యావజ్జీవమూ ఆ పరిషత్తులో సభ్యుడే. నవ్యసాహిత్య పరిషత్తుకు ౧౯౩౬ సం. నుంచీ కార్యదర్శిగా ఉంటూన్న శ్రీ తెలికిచర్ల వెంకటరత్నము ఇప్పటికీ ఆంధ్రసాహిత్య పరిషత్తులో సభ్యుడే! నవ్యసాహిత్య పరిషత్తులో ఇంకా ఇతరులుకూడా ఒకప్పుడైనా అందులో సభ్యులైనవా రున్నారు.

సామాన్యముగా ఆంధ్రలోకానికి తెలియని విశేష మొకటి ఉన్నది. ఆంధ్ర సాహిత్యపరిషత్తువారి ౧౩-వ వార్షికసభ తణుకులో జరిగింది. అందులో "గ్రామ్యము కాని వ్యావహారికాంధ్రభాషలో పూర్వ సాంప్రదాయము ననుసరించి గ్రంథములు రచింపవచ్చును." అనే తీర్మానము చేసినారు. ఆ తీర్మానము నిలవలో ఉంటే నవ్యసాహిత్యపరిషత్తు వేరుగా పెట్టవలసిన అవసరము లేదు. అయితే ఆతర్వాతి వార్షికసభకు శ్రీ జయంతి రామయ్యపంతులు హాజరై ఆ తీర్మానము రద్దుపరపించి అటువంటి తీర్మానము పునర్విమర్శనము జరగడానికి సామాన్యావకాశం లేకుండా తీర్మానం చేసినాడు. ఆపైన వ్యావహారిక భాషావాదులు ఏమి చేయగలరు! ఆ పరిషత్తుకే వెళ్లి ఆందోళన చేయవలె; అది అల్లరిగా పరిణమిస్తుంది. వ్యావహారిక భాషావాదులు అట్లు చేయక మర్యాదస్థులకు యోగ్యమైన పని చేసినారు: నవ్య సాహిత్య పరిషత్తు స్థాపించినారు.

౨

ఆంధ్రదేశమున నవ్యసాహిత్య పరిషత్తు స్థాపన మంటే వ్యక్తత వచ్చిన కుమారుడు తండ్రిమీద వేసే పంపిణీదావావంటి దని చెప్పినాను కదా! రాజాదరము ఆంధ్రసాహిత్యపరిషత్తువారికే! నవ్య సాహిత్య పరిషత్తువారు అందువల్ల పాపరుదావా వేసినారు. ౧౯౩౩ లో స్థాపించిన ఈ పరిషత్తుకు ౧౯౩౬ దాకా చిత్తు నిబంధనలుకూడా లేవు. పత్రిక లేదు. వార్షిక సభలకు నలుగురూ కలవడముతో సరిపోయేది. ఆ మూడు సభలకూ శ్రీ చిలుకూరి నారాయణరావు, శ్రీ రాయప్రోలు సుబ్బారావు, శ్రీ తల్లావజ్ఝల శివశంకర శాస్త్రి క్రమముగా అధ్యక్షులుగా ఉన్నారు. అందరూ సమర్థులే. బరంపురంలో జరిగిన మొదటి సభ 'అభినవాంధ్రకవి పండితసభ' అనే పేరుతో శ్రీ గురుభాగవతుల ధర్మారావు, శ్రీ పంచాగ్నుల ఆది నారాయణ శాస్త్రుల ఆహ్వానమువల్ల జరిగింది. ఆ సభకు ప్రారంభకులు గిడుగు రామమూర్తి. రెండవ సభ రాజమహేంద్రవరములో శ్రీ గిడుగు రామమూర్తి సప్తతితమ జన్మవాసరోత్సవముతోపాటు జరిగింది,

మూడవది అనంతపురంలో జరిగింది. ఐనా ఈ మూడింటిలోకూడా పరిషత్తుకు నిశ్చయరూప మేర్పడలేదు.

౧౯౩౬లో కాకినాడలో నాల్గవ వార్షిక సభ జరిగింది. దానికి అధ్యక్షులు శ్రీ పంచాగ్నుల ఆది నారాయణ శాస్త్రి. ప్రారంభకులుగా ఉండవలసిన శ్రీ దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులు ప్రారంభ కార్యక్రమము జరుపువేళకు రాలేక సభాంతమునకు వచ్చి సభ ముగిస్తూ ఇచ్చిన గంభీరోపన్యాసము చెవులలో ఇప్పటికీ మారుమోగుతున్నది. నవ్యసాహిత్య నిర్మాతలలో ప్రధానులు ఒక సంఘముగా చేరి నవ్యసాహిత్యాభివృద్ధి ఏతీరున జరుగవలెనో ఆలోచింపవలె ననీ, సంకుచితాభిప్రాయాలు విడువవలె ననీ వారు ఉద్బోధించినారు.

ఆ సభ జయప్రదముగా కొనసాగడానికి అదృష్టవశమువల్ల ఎన్నో కలిసివచ్చినవి. ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసుకమిటీసమావేశము అప్పుడు అక్కడ జరగవలసిఉండెను. అది అప్పుడు జరగక వాయిదాపడ్డది. ఆ సభ అప్పుడు జరిగిఉంటే ప్రజల దృష్టిని రాజకీయములు ఆకర్షించి సాహిత్యవిషయములు విస్మృతిపథము అలంకరించిఉండేవి. ఆ సభకు సిద్ధముచేసిన విశాలమైన పెండాలు నవ్యసాహిత్యపరిషత్సభ వశమైనది. స్వతంత్రమైన ఆదర్శములమీద అభిమానమున్న కాకినాడపురజనులు పరిషత్సభలను విశేషమాదరించినారు.

పరిషత్తువారు రెండు నాటికలు అద్భుతముగా ప్రదర్శించినారు. అందులో ఒకటి శ్రీ చింతా దీక్షితుల 'తిరుప్పాణాళ్వార్' అనే వచననాటిక. రెండవది శ్రీ శివశంకరశాస్త్రిది 'పద్మావతీచరణచారణచక్రవర్తి' అనే ఒక విశిష్టమైన పద్యనాటిక. పద్మావతి వేషము ధరించిన శ్రీ బి. వి. నరసింహారావు నాట్యకౌశలము దాని ప్రయోగము జయప్రదము గావించింది. అన్నీ కలసి నవ్యసాహిత్యపరిషత్తువారి కళావైదగ్ధ్యము వెల్లడిచేసినవి.

అం    ఆసభకు దూరభాగములనుండికూడ అనేకమంది కవులు, భావుకులు వచ్చినారు. ఆ సభాసందర్భములోనే మొదటిసారి ఈ పరిషత్తుకు ఒక్క నియమావళి, కాన్‌స్టిట్యూషను అంటూ సిద్ధమయింది. అందులో చేసిన నిబంధనలమీదనే కొద్దిమార్పులతో ఇప్పటికీ పరిషత్కార్యక్రమము సాగుతున్నది. అప్పుడే నవ్యగ్రంథప్రచురణము ప్రారంభించవలె ననీ, అందు కొక నవ్యగ్రంథవిక్రయశాల ఏర్పాటుచేయవలె ననీ, పరిషత్తుతరఫున ఒక కేంద్రగ్రంథాలయము స్థాపించవలెననీ తీర్మానించినారు. ఆసభలో చేసిన తీర్మానముమీదనే నవ్యసాహిత్యపరిషత్తుతరఫున 'ప్రతిభ' అనే త్రైమాసికపత్రిక ప్రకటన శీఘ్రకాలములో ఆరంభమైనది. ఇంకా దేశమంతటా సభలూ ఉత్సవాలూ జరుపుతూ నవ్యసాహిత్యప్రచారము చేయవలె నని కూడా తీర్మానించినాము. ఈతీర్మానా లన్నీ మొత్తముమీద అల్పారంభములుగా కార్యరూపము ధరించినవి.

ఈవిధముగా నాల్గవ వార్షికసభతో నవ్యసాహిత్యవాదుల పాపరుపిటిషను ఖాయమై దావాగా నెంబరైనది. నవ్యసాహిత్యపరిషత్తువారి వ్యాజ్యవ్యవహారము అఖిలాంధ్రభాషాభిమానిలోకముముందు విచారణకు ఏర్పాట్లు సాగినవి. అయితే ఈ దావాకు క్రమమైన ప్రతివాదము కనపడలేదు. నవ్యసాహిత్యము ప్రాచీనాంధ్రసాహిత్యముకు సంతానము కాదనవలసి వస్తుంది. అటువంటి వాదన ఏ న్యాయస్థానములో ఋజువవుతుంది!

సాహిత్యపరిషత్తుల విధు లేమిటి? నవ్యసాహిత్యపరిషత్తువారు చేస్తున్న ఘనకార్య మేమిటి? ఈ ప్రశ్నలు వెంటనే కలుగుతవి.

మన దేశములో పూర్వము ధర్మనిర్ణయము చేయవలె నంటే, శిష్టులూ, వేదశాస్త్రనిష్ణాతులూ, మధ్యస్థులూ ఐన పెద్దలను చేర్చి వారికి విషయము నివేదించి వారు చేసే నిర్ణయముప్రకారము వ్యవహరించడము

ఆచారముగా ఉండేది. ఏదైనా సత్కార్యము చేయవలెనన్నా, ప్రమాదాదులవల్ల జరిగిన దుష్కార్య నిర్వృతికి ప్రాయశ్చిత్తము నిర్ణయించవలసినా అటువంటి పరిషత్తు అనుజ్ఞ తీసుకోవడ మత్యవసరముగా ఉండేది. అదే ఇప్పటికీ 'పరిషదనుజ్ఞాం గృహీత్వా' అనే వాక్యాలలో కనబడుతున్నది. రానురాను అది యాజ్ఞికమే కేవలము జీవనోపాధిగా ఉన్నవారి చేతులలో పడి 'పరిషద్దక్షిణాం గృహీత్వా' లోకి దిగింది. కాబట్టి పరిష్కారము చేసేది పరిషత్తు!

అయితే పూర్వము మనదేశములో ఇటువంటి ధర్మపరిషత్తులే కాని సాహిత్యపరిషత్తులు కాని కలాపరిషత్తులు కాని ఉన్నట్లుగా తోచదు. ఒక్క తమిళదేశములో మాత్రము 'మణిమేఖలై' ఇత్యాది కావ్యాలు పుట్టిన రోజులలో సాహిత్యపరిషత్తు వంటి దొకటి ఉన్నట్లు తెలుస్తుంది. అయితే ఆ పరిషత్తు వారు కవుల ముఖాన విన్న కావ్యాలలో దోషము వినపడ్డప్పుడల్లా ఆ పరిషదధ్యక్షునికి బాధ కలిగి తన తలమీద కొట్టుకొని గాయము చేసుకునేవా డనికూడా అంటారు. కాని దానికికూడా ప్రత్యేకశాసకత్వము ఉన్నట్లుగా తోచదు.

మన సాహిత్యపరిషత్తులు చూడగా, ఐరోపాలో 'ఎకాడమీ' అనే పేరుతో ఉన్న కలావాఙ్మయ సంస్థలు మనస్సులో ఉంచుకొని వాటి అనుకరణములుగా పుట్టినవని చెప్పవచ్చును. ఆ 'ఎకాడెమీ'కి పర్యాయపదమే పరిషచ్ఛబ్దము!

అటువంటి సంస్థలలో ఫ్రాన్సులోని ఫ్రెంచి ఎకాడెమీకి చాలా పలుకుబడి ఉండేది. అందులో నలభై మందికంటె సభ్యు లుండే వీలు లేదు. సభ్యత్వ గౌరవము బహుకష్టసాధ్యము. ఆ ఎకాడెమీ గ్రంథకర్తలను చాలాకాలము శాసించడానికి ప్రయత్నము చేసింది.

ఇంగ్లండులో రాయల్ ఎకాడెమీ ఆఫ్ ఆర్ట్సు ఉన్నది. చిత్రకళలోను, శిల్పములోను సిద్ధహస్తులే గాని అందులో సభ్యులుగా ఉండేందుకు వీలు లేదు. వారు సభానియమాలకే కాక కొన్ని కళానియమాలకుకూడా బద్ధులుగా ఉంటారు. అయితే ఎకాడెమీసభ్యులు కానివారినికూడా చాలామందిని లోకమాదరిస్తున్నది. 'ఎప్‌స్టీను' వంటి శిల్పి రాయల్ ఎకాడెమీని ధిక్కరించి గొప్పశిల్పి అనే లోకఖ్యాతి పొందినాడు.

నవ్యసాహిత్య పరిషత్సభ్యులలోకూడా రచనలో కొన్ని నిశ్చితమైన నియమాలు ఉండవలె నని తలచేవారు లేకపోలేదు. ఈ సాహిత్యపరిషత్సభ్యులైన శ్రీ వేటుమళ్ల కామేశ్వరరావు 'వాడుకభాష: రచనకి కొన్ని నియమాలు' అని ఒక గ్రంథము నవ్యసాహిత్యపరిషత్తు తరఫున ప్రచురించినాడు. శ్రీ గిడుగు రామమూర్తి దానికి వ్రాసిన పీఠికలోనే ఆ ప్రయత్నము ఖండించినాడు.

ప్రభుసమ్మితమైన పరిషత్తులకు వాఙ్మయలోకములో అవకాశము లేదు. అందులో ఈకాలములో భాషాశాసనము కాని, రచనాశాసనము కాని సాహిత్యపరిషత్తులు నిర్వహించవలెనంటే అంగీకరించేవారుండరు. అటువంటి శాసకసభగా ఉండవలె ననే ప్రయత్నముతో నవ్యసాహిత్యపరిషత్తు ఉపక్రమించ లేదు!

ఇక నయితే నవ్య సాహిత్య పరిషత్తు చేసేదేమిటి! వార్షికసభలకు చేరి లోకుల ఖర్చుమీద 'దేశాభిమానము' చేయడమేనా! విచారిద్దాము!

## ౪

పరిషత్తులు వాఙ్మయములో శాసనములు చేస్తే ఏమవుతుంది? అవి పరిషత్తువారు తీర్మానాలు వ్రాసిన కాగితాలలోనే ఉండిపోతవి. ఆచరణలోకి రావు. పరిషత్సభ్యులే అవి ఆచరణలో పెట్టకపోవచ్చును. లేకపోతే వారు చీలిపోయి స్వతంత్రముగా వ్యవహరించవచ్చును. అప్పు డీ తీర్మానములు ఏమి కావలె!

రాజశాసనము బలవత్తర మైనది. దానికి లోకములో విశేషగౌరవ మున్నది. అది ఉల్లంఘించిన

వారిని తగినవిధముగా శిక్షించే శక్తి ప్రభుత్వానికి ఉన్నది. అటువంటి రాజశాసనమే తమ స్వతంత్రాభిప్రాయాలకు విరుద్ధముగా ఉన్నదని తలచి అట్టిది ఉల్లంఘించడము తమ విధిగా భావించి ప్రాజ్ఞులైన వారే ఎందరో కారాగారములు చేరుతున్నారు. కాంగ్రెసువారు ప్రభుత్వపదవి అంగీకరించిన రోజులలో అటువంటి శిక్షితులే మన రాజమంత్రులై ప్రభుత్వము నిర్వహించినారు.

ఇక శాసనము ఉల్లంఘించడము కొందరికి లాభకారిగా ఉన్నది. అటువంటి ఉల్లంఘనను అరికట్టడానికి ప్రభుత్వమువారు శిక్షలు ఎంత ఎక్కువ చేసినా, ప్రజలు ఎంత సహాయము చేసినా బ్లాకుమార్కెటు వృద్ధి అవుతూనే ఉన్నది.

ఈ కాలమే అటువంటిది! అందుకనే శ్రీ గిడుగు రామమూర్తిపంతులు తన అధ్యక్షోపన్యాసములో దీనికి 'ధిక్కారయుగము' అని నామకరణము చేసినారు. తమ శాసనములు అమలుజరిపేందుకు ఏవిధమైన అధికారమూ, అంగబలమూ లేని సాహిత్యపరిషత్తులు వాఙ్మయమును శాసించడానికి పూనుకుంటే ఈ 'ధిక్కారయుగము'లో ఏ మవుతుంది? కేవలము పరిషత్తు పరిహాసపాత్ర మవుతుంది! సాహిత్యపరిషత్తును శాసింపవలె ననేవారు దీనిని పరిహాసపాత్రము చేయడానికి సమ్మతించవలసివస్తుంది.

ఇక ఈ నవ్యసాహిత్యపరిషత్తు కేవలము పురావృత్తపరిశీలన చేసే పండితుల పరిషత్తు కాదు. ఇది కవిపండితపరిషత్తు. 'అభినవాంధ్రకవిపండితసభ' అని కాదూ ప్రథమసమావేశమైన దని చెప్పినది! ఇందులో కేవలపండితులకూ, కేవలకవులకూ, కవిపండితులకూ, పండితకవులకూ స్థాన మున్నది. కాని రచనతో సంబంధము లేనివారికి ఇందులో స్థానము లేదు.* రచనవల్లనే గదా పండితుల విద్వత్తూ, కవుల వైదగ్ధ్యమూ లోకానికి ఉపకరించేది! రచనవల్లనే కదా వారి చైతన్యము స్ఫురించేది! పరిషత్సభ్యులు పద్యకావ్యములో, వచనకావ్యములో, కథలో, నవలలో, నాటకములో, వ్యాసములో, విమర్శలో—ఏదో ఒకటి రచించినవారుగా ఉండవలె! ఐతే పరిషత్తు శైశవదశలో ఉన్నందున సభ్యులు కావడానికి ప్రతిబంధకాలు ఎక్కువ లేకుండా ఉంచినారు. సభ్యుల కెవరికీ వ్యావహారికభాషలో వచనరచన ఐనా చేయడానికి అభ్యంతర ముండగూడదు. ఈ నియమమునుబట్టి శిష్టవ్యవహారములో ఉన్న భాష గ్రాంథికత్వగౌరవానికి యోగ్యమని నిశ్చయము కలవారిదే ఈపరిషత్తు అని స్పష్టపడుతుంది. వ్యావహారికభాషను గ్రామ్యభాష అని ద్వేషించేవారి కీ పరిషత్తులో స్థానము లేదు.

ఇక ఈకాలపు రచయితలు బహువిధాలుగా ఉన్నారు. నన్నయాదులవలె భారతరామాయణాదులు వ్రాసేవారి దగ్గరనుంచీ ప్రబంధధోరణిలో కావ్యాలు వ్రాసేవారిదాకానూ, కావ్యద్రష్టలవద్దనుంచీ కావ్యశిల్పులదాకానూ, ఆంధ్రాభిమానమునుంచి సోవియటు విభ్రమముదాకానూ, 'భావకవిత్వము' నుంచీ శ్మశానకవిత్వముదాకానూ, ఆధ్యాత్మికానుభూతుల వద్దనుంచీ 'కాం టె కో ణా లు,' 'ఫిడేలురాగాల డజను' 'నవమిచిలుక'లదాకానూ,— వివిధకావ్యాలు వ్రాసే కవు లున్నారు. కథకులలో భక్తుల వేదనవద్దనుంచీ కేవలకాముకవికారాలవరకూ, నకనకలాడే కడుపులోని ఆకలిచిచ్చువరకూ చిత్రించేవా రున్నారు. నాటకరచయితలలో స్వతంత్రమైన చక్కనిఏకాంకికల దగ్గరనుంచీ ఇతరుల నాటికలు చెప్పకుండా స్వాయత్తము చేసుకొని పాడుచేసేవారివరకూ, 'కంపెనీడ్రామానాటకాలు' వ్రాసేవారివరకూ ఉన్నారు. విమర్శకులలో నిష్పక్షపాతముగా సూక్ష్మదృష్టితో పరిశీలించేవారే కాక కేవలస్తోత్రపాఠము చేసేవారివద్దనుంచి సమస్తమూ దూషణమయము చేసేవారివరకూ ఉన్నారు. ఎంత స్వల్పవిషయముకూడా ఓజస్సుగల భాషతో ప్రదర్శించేవారితోపాటు ఎంత ఉదాత్తవిషయమైనా

*ఈ వ్యాసము వ్రాసిన తర్వాత జరిగిన దశమ పరిషద్వార్షికసభలో ఇది కొంచెము మార్పు చెందినది.

నో. న. శా.

పేలవముగా చెప్పేవా రున్నారు. ఇన్నిరకాల రచయితలు ఆంధ్రలోకములో ఉన్నప్పుడు ఇందరూ నవ్యసాహిత్యపరిషత్తులో కనపడడము ఎవరికీ వింతగా ఉండరాదు.

రచనలో కవికీ కవి సామర్థ్యభేద ముంటుంది, దృష్టిభేదముంటుంది, మా ద ముంటుంది. ఇందరూ ఎవరికి వారు ఉత్తమసాహిత్యము నిర్మిస్తున్న సృష్టికర్తల మనుకోవడము కద్దు. అది సహజముకూడాను. కాకిపిల్ల కాకికి ముద్దు! ఈ రచయితలలో బహుసంఖ్యాకులను సాధ్యమయినంతవరకూ ఏకముఖము చేయడమే నవ్యసాహిత్యపరిషత్తు ప్రధానోద్దేశము. ఈ పరస్పర సాహచర్యమువల్ల అనేకముఖమైన వాఙ్మయస్వరూపము పరమార్థదృష్టివంటి దృష్టిలో ఏకైకమే అని రచయితలకు విశదమవుతుంది. కాక ఒక్కముఖమే దర్శించినవారికి బహువిధమైన ఇతరముఖాలు ప్రదర్శిస్తుంది. ఉత్తములు తమ సద్గుణములు అతిశయింపజేసుకుంటారు. ఒక మార్గమువారికి ఇంకొక మార్గము అభీష్టము కాకపోయినా దాని స్వరూపస్వభావములైనా వారు తెలుసుకో గలుగుతారు. యువకులై వృద్ధిలోకి రావలసినవారు ఏమార్గము అవలంబిస్తే తమ ప్రజ్ఞ వికసిస్తుందో అవగాహన చేసుకోగలుగుతారు. రచనలలో పుష్టి, సమగ్రత వృద్ధి అవుతవి.

వాఙ్మయ సౌధనిర్మాణములో దూరదృష్టి గల మహాశిల్పులవద్ద నుంచి మట్టిమోసే చిన్న కూలివాని వరకూ అందరికీ పని ఉన్నది. ఎవరి పని వారు తెలుసుకొని ఇది అందరూ కలిసిచేయవలసిన మహాత్కార్య మనిమాత్రము రచయితలు గమనించవలసి ఉంటుంది. ఇదే నవ్యసాహిత్యపరిషత్తువారు చేసే ప్రయత్నము. అయితే ఈపని ప్రభుసమ్మితముగా చేయబూనకోక సుహృత్సమ్మితముగాను, కాంతాసమ్మితముగాను బోధించడానికి పూనుకున్నది.

నవ్యసాహిత్యపరిషత్తు వార్షిక సమావేశాలు ఇదివరకు తొమ్మిదిజరిగినవి.* ఆసభలకు కేవలపండితులైన శ్రీ గిడుగు రామమూర్తి, శ్రీ చిలుకూరి నారాయణరావు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిలు అధ్యక్షులైనారు. పండితకవులైన రాయప్రోలు సుబ్బారావు, శివశంకరశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ అధ్యక్షత వహించినారు. కేవలకవి ఐన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ఒక సంవత్సర మధ్యక్షుడు. గేయకవీ, కథకుడూ, నవలాకారుడూ, చిత్రకారుడూ ఐన శ్రీ అడవి బాపిరాజు చెన్నపట్టణములో అధ్యక్షపీఠము అలంకరించినాడు. ఒకసారి ఆంధ్రభాషాభిమాని ఐన శ్రీ బుర్రా శేషగిరిరావు అధ్యక్షుడు. ప్రధానముగా కవి అనదగిన శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు దశమవార్షికసభకు అధ్యక్షుడుగా నియమితుడైనాడు. ఇంతటి సమర్థులు పరిషత్తుకు అధ్యక్షత వహించినారు. ఈ సభలకు దయచేసిన రచయితలూ, ఉపన్యాసకులూ గణించ సాధ్యము కాదు.

ఇక వార్షికసభలు జరిగిన ప్రదేశాలా అంటే, ఆ చివరనుంచి ఈ చివరదాకా, ఈ దిక్కునుంచి ఆ దిక్కుదాకా! బరంపురము, రాజమహేంద్రవరము, కాకినాడ, ఏలూరు, బెజవాడ, చెన్నపట్టణమూ— బందరు, గుంటూరు అనంతపురము! సారస్వతప్రియులు విశేషమున్న నెల్లూరు హైదరాబాదులలో ఇప్పటికి జరగకపోవడానికి కారణము పరిషత్తులోపము కాదు. కడప, కర్నూలు, బళ్లారి—ఇక్కడ కూడా జరగవలసి ఉన్నవి. ఇక నవ్యసాహిత్యపరిషత్తువారి పేరుతో ప్రచురించిన గ్రంథాలు అనేకమున్నవి. శైశవములో ధనాభావముతో వ్యవహరి న్న ఈ సంస్థ ఇన్ని గ్రంథాలు ప్రచురించడమే ఒక గొప్పవిశేషము!

నవ్యగ్రంథవిక్రయశాల అనే పేరుతో లభించి నన్నినవ్యగ్రంథాలు ము చేసి క్రయముచేస్తు

* పదవది తెనాలిలో మొన్ననే ౧౯౪౪ సం. డిశంబరు ౨౩, ౨౪ తేదీలలో జయప్రదముగా శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు అధ్యక్షుడుగా జరిగింది.

న్నది. ఆగ్రంథములు అమ్మగా వచ్చిన ద్రవ్యములో పరిషత్తు భాగము పంచుకోవడములేదు.

పరిషత్తుతరఫున గుంటూరులోను, బందరులోను వాఙ్మయోపన్యాసములు, కావ్యపఠనములు విస్తారముగా జరుగుతున్నవి. ఇంకా ఇతరప్రదేశాలలో కూడా జరుగుతున్నవి; జరుగగలవు.

ప్రస్తుతము పరిషత్తుకు గుంటూరు ప్రధానకార్యస్థానమైనందున అక్కడ గ్రంథాలయ మొకటి స్థాపించినారు. దానిని వృద్ధిలోకి తెచ్చి ఉపయోగించుకొనవలసిన భారము ఆంధ్రపండితలోకముమీద ఉన్నది.

ఈ పరిషత్తుకు హైదరాబాదులో ఒక శాఖ స్థాపించవలెనని ప్రయత్నము జరుగుతున్నది. ఆవిధముగానే దేశమంతటను అనేకశాఖలు వృద్ధికాగల వని హించడానికి ఆధార మున్నది.

నవ్యసాహిత్యపరిషత్తువారు 'ప్రతిభ' అనే త్రైమాసికపత్రిక ౧౯౩౬ లో ప్రారంభించి ఆరు సంపుటములు ప్రచురించినారు. యుద్ధనిబంధనలవల్ల ఆ తర్వాత ప్రకటించడానికి వీలుపడక తాత్కాలికముగా ఆగిపోయినది. ఏలూరువార్షికసభ జరిగినపిమ్మట నవమ వార్షికోత్సవసంపుట మొకటి పరిషత్తు ప్రచురించినది.

ఈ 'ప్రతిభ' పత్రికలోని విశిష్టత ఏమిటి, ఈ ప్రతిభలో విశేష మేమున్నది?—అని అడిగినవారున్నారు. 'ప్రతిభ'లో నవ్యకవు లందరి ప్రతిభా ఏకస్థము చేసి ప్రదర్శించడానికి నవ్యసాహిత్యపరిషత్తు ప్రయత్నిస్తున్నది. ఈ ప్రదర్శనముతో తృప్తిలేని వారికి నవ్యకవుల ప్రతిభతోనే తృప్తి లేదన్నమాట! అందుకు ఎవరేమి చేయగలరు!

సజీవమైన ప్రతిసంస్థకూ గుణదోషాలు ఉంటవి. అయితే అది చైతన్యయుక్తముగా ఉన్నంతవరకూ అభ్యుదయానికి అవకాశాలు ఉంటవి. నవ్యసాహిత్యపరిషత్తు తన ఆదర్శములు నిర్వహించుకోలే దనేవారే ఈ పరిషత్తుకు ఆప్తమిత్రులు. అటువంటివారు పరిషత్తుభారము వహించుటలో ఎక్కువగా పాల్గొని పరిషత్తును ఇతరోన్నతమైన స్థానమునకు తీసుకొనిపోవలసిన బాధ్యత తమమీదనే ఉన్నదని గుర్తించవలసి ఉన్నది.

నవ్యసాహిత్యపరిషత్తు తాను చేయవలసిన విధి సమస్తమూ నిర్వర్తించిన దని తృప్తిపడడము లేదు. ఏ సంస్థకైనా ఆ సంతృప్తికలిగినప్పుడు ఆ సంస్థతో పని లేదని నిశ్చయించవచ్చును. ముక్తుడైన జ్ఞానికి కర్మతో పనిలేదు. విగతజీవమైన దేహము శవమే. తన పని ఐపోయిన దని తలచే సంస్థ శవప్రాయమే!

నవ్యసాహిత్యపరిషత్తుకు తా నిప్పటికి చేసిన పనితో తృప్తిలేదు. ఇంకా అది అనేకముఖాలుగా విస్తరిల్లవలె నని ఆవేదనపడే భావుకులే దాని శ్రేయఃకాములు. పరిషత్తు ఇప్పటికి చేసిన పని స్వల్పీయము; చేయవలసినది అనంతము. పరిషచ్ఛ్రేయఃకాములకు మా మనవి ఇది!

వాఙ్మయ మొక మహావృక్షమైతే దానిఫలములే కావలె నని ఆశించేవారు తొందరపడి మనకు అనుభవయోగ్యము కాదని దానిబెరడు ఒలిచివేస్తే అసలువృక్షమే నశిస్తుంది.

సాహిత్య మొక ప్రపంచమైతే కవు లందులో ప్రజాపతులు. భగవంతుడు సృష్టించిన ఈ జగత్తు 'మనసా ప్యచింత్యరచనారూప' మైనది. అట్టి ఈ జగత్తులోనే మనకు అనుపాదేయమైనవి అనేకము కనిపిస్తున్నవే, ఇక కవి సృష్టించిన కావ్యజగత్తులో అటువంటివి ఉండడములో ఆశ్చర్య మేమిటి? జగత్తు స్థితికే భంగము కలిగించే అపాయము తటస్థించినప్పుడు తప్ప అటువంటి పదార్థాలను నాశనముచేయమనడము ధర్మము కాదు.

సారస్వత మొక క్షీరాబ్ధి. దానిని మథించినప్పుడేకాని అమృతోత్పాదనము కాదు. అమృతముకంటె ముందు హాలాహలము అవతరిస్తుంది. దానిని సహృదయుడు సదాశివునివలె కంఠములో స్తంభించి అమృ

తము దివ్యలోకానికి అందజేయవలె! దేవాసుర లుభ కలుగుతుంది. ఈ వ్యాసరచయితకుకూడా కలుగుతున్న యిలూ మథించనిది అమృతోత్పాదనము కాదని మనస్సంక్షోభమూ అటువంటిదే! మనశ్శాంతికూడ హృదయకుహరములో స్మరించుకుంటే మనశ్శాంతి అటువంటిదే!

# పడవ ప్రయాణం

[కథానిక]



= 'పాప' =

పొద్దు కుంకిన తరవాత లోకమంతా దిగులుగా ఉంది. పడవ మెల్లగా నీటిమీద జారుతోంది. నీరు పడవపక్కని కలకలమంటూ రాసుకుంటోంది. చూపుమేరలో జీవసంచలనం లేని ప్రపంచకం నిశ్శబ్దంగా జుమ్మంటోంది. ఆధ్వని చెవులకు వినపడక దేహాన్నంతనీ తాకుతుంది. మనస్సు లోలోపల అది నిండుగా కంపిస్తున్నట్టు ఉంటుంది. అప్పుడు ఏదో బ్రతుకుచివరకి ఆఖరయిపోతున్న నిస్పృహా, ప్రశాంతమయిన నిరాశ మనస్సులో నిండుకుంటాయి. దూరంగా చెట్లు అస్పష్టంగా, మాయగా పడవతోకూడా నిశ్చలంగా ముందుకి సాగుతాయి. దగ్గరగా ఉన్న చెట్లు తలలు విరబోసుకున్న పెద్ద దెయ్యాల్లాగ జీబురుమంటో వెనక్కి నడుస్తాయి. పడవ కదలదు. కాలవగట్టు కదులుతుంది. నాచూపులు చొచ్చుకుని చొచ్చుకుని నీటిలోకి చూస్తాయి. అందులో ప్రతిబింబించిన చీకటిని చీల్చుకుని చూస్తాయి. నక్షత్రాలు మెల్లగా కెరటాలమీద వివశంగా ఉయ్యాలలూగుతాయి. కన్ను తెరిచి నిద్రపోతాయి.

గాలి లేదు. పడవలాగేతాడు, మునిగ్రర చప్పుడయినప్పుడల్లా బిగువుగా, వాదులుగా అవుతోంది. పడవ వెనకభాగంలో పొయ్యిలో నిప్పు మండుతోంది. అప్పుడప్పుడు రప్పుమంటోంది. అప్పుడప్పుడు తగ్గిపోతోంది. లోపలికి ఊరిన నీరు చేదతోతోడి ఒక కుర్రవాడు కాలవలోకి పారబోస్తున్నాడు. పడవలోపల ఏవేవో బస్తాలున్నాయి. ధాన్యం, బెల్లం, ఉప్పు, తౌడు వగైరా. పడవ టాపుమీద నేను వెల్లగిల పడుకున్నాను. పడవలోపలనించి చుట్టపొగలు, ఏదో సంభాషణ కలిసి మెల్లగా తాపీగా అన్ని దిక్కులికీ వ్యాపిస్తున్నాయి. గుమాస్తా కూచున్న గదిలో గుడ్డిదీపం కొద్దిగా కునుకుతోంది. పడవ సాగుతోంది.

"ఏయి పడవా? ఈ గట్టుకి రానీ! ఈ గట్టుకి!" అని ఎవరో పిలిచారు.

పడవ గట్టుకి చేరడంతోనే ఇద్దరు ఎక్కారు. పడవ ఆపక్కకి కొంచెం వొరిగింది.

"టాపుమీదకూకుంటాం లే!" అంది ఆడగొంతుక.

"ఇన్నాళ్ళూ ఏడ పోయావే? కన

మట్టం లేదు" అన్నాడు చుక్కాని కాస్తున్న మనిషి.

"ఇజానగరం, ఇశాకపట్టం, మా వోడూ నేనూ కలిసి తిరిగొచ్చాం. అప్పన్న కొండ కెల్లాం."

"ఏడ బోతన్నా?"

"మండపాక పోతన్నాం మరిదీ! కులాస గున్నావా? గుమాస్తాగారు పాతోరేనా?"

"ఆ!"

మగవాడు టాపుమీద అడ్డదిడ్డంగా పడుకుని ఉన్నాడు. అతని నోట్లో చుట్ట పక్కకి పడిపోతే ఆడమనిషి తీసి ఆర్పేసింది.

"ఒరేయి! నెగిసి కూకోరా!"

"నోరు ముయ్యి......నెంజా! నేను తాగా ననుకుంటన్నావా? మక్కు లిరగదంతాను" ఒక పక్కనించి ఇంకోపక్కకి తిరిగి పడుకున్నాడు. ఆడది అతని వొంటిమీద గుడ్డ కప్పింది. తనో చుట్ట దీసి అంటించింది. అగ్గిపుల్ల రప్పుమన్నప్పుడు ఆమె ముఖం చూశాను. నల్లగా ఉన్న ముఖం ఎర్రగా వెలిగింది.

ఆమెగొంతుకలో మగజీర ఉంది. ఆమె మాట్లాడుతున్నప్పుడు చనువుగా ఒప్పిస్తున్నట్టుగా ఉంటుంది. ముఖం అందమయినది కాదు. జుట్టు చెదిరిపోయినా ముఖంలో ఏదో పెద్దమనిషితరహా ఉంది. నల్లటి రవిక ఉన్నట్టు తెలియడం లేదు. చీకట్లోకూడా ఆమెకళ్లు మేలుకున్నట్టు మెరుస్తున్నాయి. అగ్గిపుల్లవెలుగులో పక్కని పడుకున్న నన్ను చూసింది.

"ఈపక్క నెవరో పడుకున్నార్రా!" అని మగవాణ్ణి తట్టి లేపింది.

"తొంగోయే నెంజా. గొడవెడితే డొక్క లూడదంతాను" మగవాడు అతి ప్రయత్నంమీద కొంచెం దూరంగా జరిగాడు.

ఇంతలో దీపం పైకెత్తి గుమాస్తా పడవపక్కని నిలబడి చూశాడు. "ఏమే రంగీ, ఈడెవడు?" అని అడిగాడు.

"మావోడండి, బాబ్బాబు, రిమార్కు రాయించండి" అంది రంగి.

"పద్దాలే! దింపెయ్యి! దొంగతొత్తు కొడుకుని. నీకు బుద్ధిలేదూ! మళ్లీ ఆణ్ణి పడవెక్కించావ్? తాగుబోతోణ్ణి."

"నే తాగండే. ఎవరంట నే తాగానంటా?" అన్నాడు పద్దాలు.

"ఒరే దింపెయ్యండర్రా! ఎందుకెక్కనిచ్చా రీణ్ణి! చిత్తుగా తాగున్నాడు"

"చిత్తుగా నేదు. కొంచెందావత."

"ఊరుకోరా! గుమాస్తాగార్రా! బాబ్బాబు, మండపాకాడ దిగిపోతాం."

"గుమాస్తాగారూ! దండాలండి! తమ దయండి. నేను తాగనేదు బాబూ!"

"ఏమన్నా అల్లరిచేస్తే కాలవలోకి తోయించేస్తాను. జాగ్రత్త!" గుమాస్తా గది

లోకి వెళ్లిపోయాడు. పద్దాలు లేచి కూర్చు న్నాడు. నిజానికి ఆట్టే తాగినట్టు లేడు.

"కాలవలోకి తోయించేత్తాడంట! నా కొడుకు" అన్నాడు మెల్లగా.

"ఊరుకోరా! ఇనమడద్ది"

"రేప్పొద్దున్న పడవ సూసుకోమను. యాసా లేత్తాడు. నాకొడుకు"

"ఉస్సు! ఆపక్క నెవరో పడుకున్నారు."

"ఎవరు?... నిద్దరోతన్నారు." పద్దాలు చుట్ట అంటించాడు.

పద్దాలుకి బొద్దుమీసాలు. కోలముఖం. చాతీ ఎప్పుడూ విరుచుకుని ఉంటుంది. వెన్నెముక ఉండీలుబద్దలాగ వంగి నిలబడు తుంది. మొత్తంమీద మనిషి కొంచెం సన్నంగా, నిర్లక్ష్యంగా ఉంటాడు.

పడవ మళ్లీ నిశ్శబ్దంగా సాగుతోంది. పడవ వెనకభాగంలో నిప్పు రగలడం లేదు. సరంగులు తిండితిన్న గిన్నెలు తాపీగా మాట్లాడుకుంటో కడుక్కుంటున్నారు.

గాలి చలిగా లేదు. అయినా నేను కండువా కప్పుకున్నాను. అనంతమయిన ఆ చీకటికి అసహాయంగా శరీరాన్ని అప్పగించ డానికి నాకు భయం వేసింది. గాలిమాత్రం చురుకుగా ఉంది- మెత్తని స్త్రీస్పర్శలాగ. పడవ నీటిమీద ఎంత మృదువుగా రాసుకు పోతోంది! చెప్పలేనంత మృదుత్వం, విశాల మయిన స్త్రీత్వం ఆ రాత్రిలో నిండుగా ఆవ రించుకునిఉంది. ఆకౌగిలిలో నాకు చిరకాలం నాటి విషాదగాథలు మెల్లగా ఆప్యాయంగా జ్ఞాపకమొస్తున్నాయి — అనాదినించీ మగ వాణ్ణి లాలించి పోషించిన స్త్రీత్వపు గాథలు.

నాకు కొంచెం దూరంలో రెండుచుట్ట లూ ఎర్రగా కాలుతున్నాయి. జీవితం బరువు గా అక్కడ కూర్చుని ఆలోచించుకుంటూ చుట్టకాలుస్తున్నట్టు నాకు అనిపించింది.

"వొచ్చీ దేపూరు?" అన్నాడు పద్దాలు.

"కాల్దారి" అంది రంగి.

"ఇంకా శానాదూర ముంది."

"ఇయ్యాల జాగత్తుంద్రా. వొద్దు. వొద్దు ఈలు సూసుకుని తరవాత? ఏరా నామా టినవ్వా?" రంగి జాలిగా బతిమాలుతూ అడిగింది.

"బెదురు. నెంజకి". అన్నాడు పద్దాలు. అంటూ ఆమెపక్కలో వేలెట్టి పొడిచాడు.

"అమ్మో!" అంది రంగి. అని తన్మ యంగా ఆకాశంలోకి ముఖమెత్తి చీకట్లోకి చూసింది. ఆ స్పర్శ శాశ్వతంగా ఉండిపోవా లని కోరుతున్నట్టుగా ఆమె ముఖమెత్తింది.

నాకు క్రమంగా నిద్రపట్టింది. పడవంతా కూడా నిద్రపోతో, నీటివాలుకి మెల్లగా జారిపోతోంది. నాకు కొంచెందూరంలో ఆ ఇద్దరు వ్యక్తులూ కొంతసేపు గుసగుసలాడు కున్నారు. నాకు నిద్ర పట్టినా, పూర్తిగా పట్టలేదు. పడవ నడుస్తున్నట్టు, నీరు జాగు తున్నట్టు, చెట్లు వెనక్కి పోతున్నట్టు తెలు సును. పడవ నెవరూ లాగడం లేదు. పడవ లోపల అంతా కునుకుతున్నారు. రంగి నా పక్కనించి నడిచి చుక్కానిదగ్గరకు వెళ్లి కూచుంది.

"మరిదీ! ఎల్లాగున్నా?" అంది.

"నువ్వెల్లాగున్నా?" అన్నాడు చుక్కాని కాసేవాడు.

"ఎన్నెన్ని సిత్తరాలు సూపించా డను కున్నా మావోడు! చినీమా కెళ్లాం! ఓడల్ని సూశాం! ఓడంటే ఓడకాదు మరిదీ! మా వూరంతుంది. మరి సుక్కా నెక్కడుందో గాని!" రంగి అల్లా ఏదో చాలాసేపు కబుర్లు చెపుతో కూర్చుంది. ఆకబుర్లు నన్ను జోకొ డుతున్నట్టున్నాయి.

"పిల్లా! నాకు నిద్దరొత్తందే!" అన్నాడు చుక్కాని కాసే మరిది.

"సుక్కాని నే సూత్తాలే. నువ్వల్లా తొంగో మరిదీ!" అంది రంగి.

పడవ మళ్లీ మెల్లగా జారిపోతోంది-నిశ్శబ్దంగా. రంగి ఆనిశ్శబ్దాన్ని కదపకుండా తన గొంతుకెత్తి చల్లగా పాట పాడింది.

"యాడున్నాడో! - నావోడు -
యాడున్నాడో!
కూడు గిన్నెలో యెట్టి -
కూకుని సూత్తుంటె
సీడల్లె మావెల్లి నిదరే కంటికిరాదు -
యాడున్నాడో॥
తేలల్లే కొండెత్తి - తెగకుట్టే సలిగాలికి
నాలోపలంతా బిగిసినాదో మరిదీ!
యెచ్చని సీవోళ్లు నన్నొత్తితేగాని
నచ్చిపోతానేమొ!......యాడున్నాడో॥

రంగిగొంతుకలోని మగజీరలో సంగీతముంది. ఆపాటలో పడుకుని ఉన్న అన్ని ప్రాణులూ ఒక్కసారి కునికాయి. గడిచిన యుగాల ప్రేమగాథలు వింతగా, మెల్లగా, విషాదంగా ఆ పాటలో కంపించాయి. ఆ పాట నీటివెల్లువై పొంగితే అందులో లోకం చిన్న పడవలాగ తేలిపోయింది. మానవజీవితం ఈప్రణయంతోటి, ఈవిషాదంతోటి మాయగా, వింతగా, బరువుగా అనిపించింది.

నాకు కొంచెం దూరంలో పద్దాలు నెత్తిని ముసుగు మూసుకొని కూర్చున్నాడు. కాని అతనికీ రంగికీ మధ్య కొన్ని యుగాల అంతర మేదో ఉన్నట్టు తోచింది. అతను టాపుదిగి పడవలోకి పోయాడు. నేను ఒంటరిగా వెల్లగిల పడుకొని చూస్తున్నాను. రంగి అల్లాగే పాడుతోంది.

"గుడిమెనక నందులో గుంటున్నా దాని
నడిసెయ్యక నువ్వు దగ్గరజేరితే
గుడిమెనక గుంటెవరు? బావా?
నడివయసులో నేను కానా!"

నాకు నిద్రపడుతోంది. రంగిపాట అల్లా లోకాలు తిరిగివచ్చి మళ్లీ మెల్లగా నాగుండెల్లో తగులుతోంది. నాకు నిద్ర పట్టింది. నిద్రలో ప్రాకృతికమయిన ప్రణయం నా ముందు గంతులు వేసింది. పల్లెటూళ్లలో కాపు పడుచులు తమ ప్రియులతో దాగుడుమూతలాడుకుంటూ పాటలో కలిసిపోయారు. నేనెరగని ఒకానొక స్వాప్నికలోకం నాముందు నిద్రలో తెరుచుకుంది. అందులో రంగి, పద్దాలు అనేకరూపాలతో తిరుగుతున్నారు. పాట క్రమంగా నాజ్ఞప్తిలోనించి పోయింది. నిద్ర నామనస్సుతలుపులు మూసింది.

* * *

పడవలో కొంచెం గొడవయింది. నేను కళ్లు నులుపుకుంటూ లేచాను. పడవ గట్టుకి చేర్చిఉంది. రెండు లాంతర్లు పట్టుకుని సరంగులు కంగారుగా పడవ ఎక్కి దిగుతున్నారు. గట్టుమీద రంగిని ఇద్దరు గట్టిగా పట్టుకున్నారు. అందులో ఒకడు గుమాస్తా. అతని చేతులో మడిచిన తాడుంది. రంగికి అప్పుడే దెబ్బలు తగిలుంటాయి. నేను చటుక్కుని పడవ దిగి గట్టుమీదికి గెంతాను. ఏం జరిగిందని అడిగాను.

"ఆ దొంగనాకొడుకు పారిపోయాడు. సరుకు ఎత్తుకుపోయాడు. ఈ లంజ ఎక్కడో గట్టుకి తార్చింది పడవని. సుక్కాని పట్టుకుంది లంజ!" గుమాస్తా కోపంగా, చిరాకుగా, నిస్పృహతో అన్నాడు.

"ఏం పోయాయి?" అని అడిగాను.

"రెండు బెల్లంబుట్టలు, మూడు చింతపండుబుట్టలు. నేనందుకే ఎక్కని వొద్దన్నాను. యజమాని నాక్కడతాడు నష్టమంతాను. ఎక్కడ దింపుకుపోయాడే?"

"కాల్దారికాడండి! బాబయ్యా!"

"ఛీ! లంజా! కాల్దారికాడ మేం మేలుకునుంటేనే?"

"అయితే నిడదోలుకాడేనండి!"

"ఇదిప్పుడు చెప్పదు. రేపు అత్తిల్లో పోలీసోళ్ల కప్పగిద్దాం! ఎక్కు, పడవెక్కు."

"నన్నిక్క డొగ్గెయ్యండి బాబ్బాబు!"

"ఆట్టే యేసాలెయ్యకు. ఎక్కెక్కు!" గుమాస్తా ఆమెను ప[illegible]తోశాడు. ఇద్దరు సరంగులు ఆమెను పడవెక్కించారు.

"నిద్దర మొకాలు! జేరారు! సూసుకోవొద్దూ! దాని చేతులో సుక్కాని ఎవరెట్టమన్నారు! బుద్ధి లేదూ!" గుమాస్తా అందరిమీదా విసుక్కుని గదిలోకి పోయాడు. రంగిని టాపుమీదికి ఎక్కించారు. ఒక సరంగు ఆమె పారిపోకుండా కాపలావున్నాడు. నేను కూడా టాపుమీదికి ఎక్కాను. పడవ మళ్లీ కదిలింది. నేను చుట్ట ముట్టించాను.

"అయ్యగో రోసుట్ట ఇప్పించరూ!" రంగి చనువుగా అడిగింది. నే నోచుట్ట, అగ్గిపెట్టి ఇచ్చాను. ఆమె చుట్ట ముట్టించింది. "మరినీ! నన్ను పోలీసోళ్ళ కప్పగించి ఏం లాబం?"

"గుమాస్తా వొదలడు!" అన్నాడు సరంగు.

"పద్దాలు నీ మొగుడా?" అని అడిగాను.

"మావోడు" అంది రంగి.

"దీన్ని నెగదీసుకుపోయాడండి! పెళ్ళాడలేదు. ఆడికి ఇంకొకత్తుంది. ఇప్పుడది ఎక్కడుందే?" అన్నాడు సరంగు.

"కొవ్వూరులో ఉంది. రంగూ, పొంగూ బాగుం దిప్పుడు. నేను తిన్నన్ని తన్నులు తింటే అదీ నాలాగే అవుద్ది. గుడిశేటి నెంజ."

"మరి నీ కింకా వాడితో ఎందుకు?" అన్నాను నేను.

"ఆడు నావోడండి!" అంది. అంతా అందులో ఉన్నట్టుగా.

"మరి ఇంకొకత్తితో పోతున్నా డన్నావుగా?"

"నాదగ్గరికి రాకుండా ఎక్కడ పోతాడు? మొగోడి కెంతమందయితేమాత్ర మేం? ఆడండి, అయ్యాగోరూ! మారాజండి, అల్లాంటి మనిసి లేడండి మల్లీని."

"బాబో! ఆడి సంగతి మీరింకా ఎర గరు. ఇ దెంత రంగుగా ఉండే దనుకు న్నారు? ఓ తూరండి, దీన్ని గుడిసిలో పెట్టి గుడిసి అంటించేశాడు. మగ్గిపోయిం దను కోండి! ఇంకా దీనికి భూమ్మీది నూక లున్నాయిగాని" అన్నాడు సరంగు.

"అయ్యాగోరు! అప్పుడు ఆడు కనమ డితే పీకి నులి మేద్దా మనుండేది. కాలిన గడోటి ఈపుమీద పడిందండి." ఆమె వెనక్కి తిరిగి రవిక కొంచెం పైకెత్తింది. తెల్లటి మచ్చఆ చీకట్లోకూడా స్పష్టంగా కన బడింది.

"మరి నిన్నిల్లా చేస్తుంటే ఇంకా వాణ్ణి పట్టుకు దేవులాడుతా వేం?" అని అడి గాను.

"ఏంచెయ్యను ? ఆడు కంటబడితే అన్నీ మరిచిపోయి కరిగిపోతాను. ఎంత జాలిగా మాట్లాడతాడని ! ఈనందాల కొ ప్వూరులో బయలుదేరాం. దార్లో నన్ను ఎంతో జాలిగా బతిమలాడాడు. ఈ పడవలో ఎక్కి చేతికి చిక్కిన సరుకు దించిపారెయ్యా లని. నేనుంటేగాని సాగదు. అడ్డదోవని నడిచి మడుగు జేరుకున్నాం..."

"ఎక్కడ దింపేశాడు సరుకు?"

"ఎక్కడో నాకూ గుర్తునేదండి "

"దొంగనెంజ!" అన్నాడు నవ్వుతూ సరంగు.

రంగి మొగం చూడాలని నాకు ఎంతో కుతూహలం వేసింది. కాని ఆ కటికచీకట్లో ఆమె మాయమనిషిలాగ అవ్యక్తంగానే ఉండిపోయింది.

పడవ మెల్లగా పాకుతోంది. నడిరాత్రి గడిచినకొద్దీ గాలి చిరుచలిగా తగులు తోంది. చెట్ల ఆకులు కొద్దిగా కదులు తున్నాయి. మళ్లీ పడవని సరంగులు లాగు తున్నారు. నా కింక నిద్రపట్టలేదు. కొంత సేపటికి కాపలా ఉన్న మనిషి కునికి ఒరిగి చివరకి నిద్రపోయాడు. రంగిమాత్రం ఇంక పారిపోయే ప్రయత్నం మానుకుంది. తాపీ గా చుట్ట కాలుస్తూ కూర్చుంది.

"నీ కసలు పెళ్లి అవలేదా?" అని అడిగాను నేను.

"లేదు. సిన్నతనంలోనే పద్దాలు నన్ను లెగేసుకొచ్చాడు."

" మీ దేవూరు ? "

"ఈంద్రపాలెం.... అప్పుడు తాగుతా డని నాకు తెలదు.........ఇప్పుడు నేనూ తాగుతా ననుకోండి. తాగితే తప్పు లేదు. తాగి సావగొడతాడు."

"మరి వాడిలి వెళ్ళిపోకపోయావా?"

"తన్నులు తిన్నప్పు డల్లాగనిపిత్తది. అయినా అంతటి మనిసి లేడండి. మీ రెర గరు. ఉత్తప్పుడండి, మెన్నలా కరిగిపోతాడు. వొందమందితో పోయినాసరే ఆడు నాకాడి కొచ్చితీరతాడు. నేను లేకపోతే గుండగిలి నచ్చిపోడూ?"

నాకు వింతగా అనిపించింది ఆ అమ్మి తత్వం. వాళ్లిద్దరికీ మధ్య ఉన్న అనుబంధ

ఎల్లాంటిదో నాకు అర్థంకాలేదు. రంగి మళ్లీ చెప్పడం మొదలుపెట్టింది.

"మాకిద్దరికీ ఏపనీ సరిపడింది కాదు. సిగురుకి ఇల్లా దొంగతనాల్లోకి దిగాం. మా యమ్ముండేది, మొన్నే సచ్చిపోయింది. నన్ను తిడుతుండేది. ఓనాడండి, నాగుడిసికి ఆనెంజని తీసుకొచ్చాడు."

"ఎవరిని?"

"ఇప్పుడున్న గుంటని. నామొదురు గుండా, నా ఇంటో దాంతో తొంగున్నాడు. నాకళ్లెదర! చిత్తుగా తాగొచ్చాడు. అదీ తాగింది. నాసయితే! దానిమీద పడి పీకాను. ఆడు నన్ను సావదన్నాడు. అర్ధరేత్తిరికాడ దాన్నెక్కడకో తీసుకుపోయాడు. మళ్లీ వొచ్చాడు. నేను తిట్టాను. ఇంటోకి రావొద్దన్నాను. గుమ్మంకాడ కూకుని పిల్లోడికన్నా జాలిగా ఏడిచాడు. నాగుండె కరిగిపోయింది. నేను దగ్గరగా జేరితే నన్ను వాళ్లోకి తీసుకుని నా నానుపేట ఇమ్మన్నాడు. ఎందుకన్నాను. ఆగుంట తెమ్మంటన్నాడు. నాకు ఒళ్లు తెలదు: నానాతిట్లు తిట్టాను. ఏడిచాడు. ఆగుంట లేకపోతే బతకలేనన్నాడు. నా కోపం ఎక్కువయిపోయింది. గుమ్మంలోంచి గెంటి తలుపేసుకున్నాను. తలుపు గుంజిగుంజి సివరికి ఎల్లిపోయాడు. నాకు శానాసేపు నిద్దర రాలేదు. కొంచెం కునుకు పట్టేకలికి ఇల్లంటుకుంది. తలుపు పైన గొళ్లమేసి నడికొప్పంటించాడు. ఎవరూ రాలేదు. నడిరాత్తిరి. నా వొళ్లంతా మగ్గిపోయింది. తలుపు గుంజీగుంజీ ఇంక తెలివి తప్పింది. ఇంతలో ఎవరో అవతల్నించి తలుపు తెరిచారు. మన్నాడు ఆణ్ణి పోలీసోళ్లట్టుకున్నారు. ఎవరిమీద అనుమాన ముందో నన్ను చెప్పమన్నారు. ఆడుమాత్రం కాదని కచ్చితంగా చెప్పేశాను. సందేల నా కాడ కొచ్చి, ఎంతో జాలిగా ఏడిచాడు. తాగినప్పుడల్లా ఏడుస్తాడు. ఉత్తప్పు డసలు ఏడుపే రాదు. నవ్వుతుంటాడు. సుక్కడితే సాలు, ఏడుపే. పిల్లోడికన్నా ఎక్కువగా ఏడుస్తాడు. నా నానుపేట లిచ్చేశాను."

"నువ్వింకా వాడితో ఎందుకు దిగుతావు ఈ దొంగతనాల్లోకి?"

"న... ఏమంటారు ? ఆడొచ్చి గోలెడితే?

మరి నిన్ను విజయనగరం అక్కడికీ తీసుకునివెళ్లా డన్నావు?"

"వొట్టిది. ఊరికే అలా సెప్పాను. నే నంటే కొంచెం నరంగులికి నమ్మకం. ఇది గాక రెండుతూర్లు ఈ పడవలో దొంగతనం జరిగింది.

నిన్ను పట్టుకుంటే పోలీసులు ఏం జేస్తావు?'

ఏమీ చెయ్యను. నన్ను పట్టుకు నేం జేత్తారు? నాకాడ దొంగసొమ్ము లేదు. ఏమో ఎవరెత్తుకుపొయ్యారో. ఓరోజు కొడతారు. మన్నా డొగ్గేత్తారు."

"పద్దాలుని పట్టుకుంటే? ఆ దొంగ సొమ్ముతో దొరికిపోతే?'

"ఆడు దొరకడు. ఈపాటి కంతా అయిపోద్ది. ఆడు దొరక్కుండానే నేను పడవలో ఉండిపోతా."

ఆమె నిట్టూర్పు విడిచి మళ్లీ మెల్లగా తనలో తను అనుకున్నట్టు చెప్పింది.

"ఈ సొమ్మంతా మళ్లీ ఆ గుంటకే దక్కుడు. దానిమీద మోజు తగ్గేదాకా దా న్నొదలడు. నేను ఈ కట్టా లన్నీని. దొంగనెంజ! నా ఉసు రోసుకుంటంది."

ఆమాటల్లో నిజంగా ఉద్రేక మేమీ లేదు. ఆమె అతన్ని ఉన్నవాణ్ణి ఉన్నట్టుగా అంగీకరించింది. పద్దాలుకోసం ఆమె ఎల్లాంటి పనన్నా చెయ్యాడానికి సిద్ధంగా ఉంది. అది ఒక ఆదర్శమూ కాదు. భక్తి కాదు. ప్రేమా కాదు. ఎన్నో చిత్రమయిన సంకీర్ణ భావాలతో, ఈసులతో, అనురాగాలతో ఎన్నిటి తోనో కలిసిన స్త్రీ హృదయం! అయినా ఆహృదయం అన్నిటికీ ఫలితంగా ఒకేచోట లగ్నమయిఉంది. తన మగవాడికోసం ఆమె నిరంతరం తపిస్తుంది. కాని అతడు నిర్దుష్టంగా, నీతిగా నడుచుకోవాలని ఆమెకు పట్టింపు లేదు. అతని సుగుణాలతో, అవగుణాలతో అతన్ని ఆమె అంగీకరించింది. నా కామె బ్రతుకు బరు వనిపించింది. నిజానికి నా బ్రతుకే బరువేమో అంతకంటే.

గాలి అంతకంతకి బాగా వీస్తోంది. పడవ కొంచెం వేగంగా పోతోంది. అలసట తీర్చు కున్న లోకం నిద్ర మేలుకోబోతోంది. అక్క డక్కడ పాలికాపులు పొలంగట్లని నడుస్తూ కనబడుతున్నారు. వేగుచుక్క ఇంకా పొడవ లేదు. రంగి మోకాళ్లు ముడుచుకుని ఎటో అవ్యక్తంగా చూస్తోంది.

"ఆడు నావోడు! ఎన్ని తిరుగుళ్లు తిరి గినా నావోడు నాదగ్గరకే వొస్తాడు." అని తనలో తను అనుకుంది. అందులో ఒక ఆశ, ఒక ధైర్యం, ఒక విశ్వాసం తొణికిసలాడా యి. ఆమాట ఆమెజీవిత సర్వస్వానికీ కేంద్రంలాగ అవుపించింది. నేను భయంతో, భక్తితో, జాలితో ఆమాట విని ఊరుకు న్నాను. అల్లాగ తెల్లవారేదాకా మేమిద్దరం కూర్చున్నాం.

నేను పడవ దిగిపోయేముందు జేబు లోంచి ఒక రూపాయి తీసి చటుకుని ఆమె చేతులో పెట్టి తొందరగా ఊళ్లోకి పోయాను. ఆమె జవాబు చెప్పేదాకా నేను నిలబడలేదు. ఆమెసంగతి తరవాత ఏంజరిగిందో నాకు తెలియదు.

# కలగూరగంప

## నా సమాధానము

ర్గశీర్ష మాససంచికలో వే. సు. అను పొడి అక్షరములతో ఒక సహృదయ మహాశయులు కార్తీకమాససంచికలో శాకుంతల నిర్మాణన శిల్పమునుగూర్చి నేను వ్రాసిన వ్యాసమును సమీక్షించిరి. నావ్యాసములు సహృదయుల సవిమర్శదృష్టి నాకర్షించుట సంతోషావహము. వీరి ప్రశంసను నా యుద్యమమునకు పారితోషికముగ గ్రహింతును.

చతుర్థాంకముకంటె సప్తమాంకము మిన్న యను నాసిద్ధాంతముతో వీ రేకీభవింపక చతుర్థాంకమును మరల నొకసారి చదువవలసినదిగ నన్ను కోరిరి. చతుర్థాంకమునేకాక సప్తమాంకమును గూడ పునః సత్యాన్వేషణతత్పరబుద్ధితో పఠించితిని. నా యభిప్రాయము మారలేదు. రెండింటి తారతమ్యమును ఇంచుక దీర్ఘముగ చర్చింతును.

“ఏకైక మత్ర దివసే” అను శ్లోకమునుబట్టి దుష్యంత నిష్క్రమణమునకును, దుర్వాసశ్శాపమునకును అంతరము దీర్ఘము కాదని అదివరలోనే నేనును గుర్తింపకపోలేదు. శకుంతల మైమరపునకు కారణమేమి అను ప్రశ్నకు సమాధాన మిచ్చుటలో వే. సు. గారితో నాకు భేదాభిప్రాయ మున్నను ప్రకృతాంశమున కది యప్రస్తుత మగుటచే నిట చర్చించుటలేదు.

చతుర్థాంకమునందలి ముఖ్యాంశములు మూడు (౧) దుర్వాసశ్శాపము; (౨) కణ్వాగమనము; (3) శకుంతలా నిష్క్రమణము. ఈ మూడింటిలోను మొదటి రెండింటిని అతిక్షిప్తముగ చిత్రించి కాళిదాసు మూడవదానిని మాత్రము విపులముగ చిత్రించినాడు. శకుంతల నత్తవారింటికి బంపు సమయమున కలిగిన లలితవిషాదమును, ఆశ్రమమునకును ఆమెకును గల యపురూపస్నేహమును రసచక్షువుతో దిలకించి దాని రామణీయమును కాళిదాసు విపులపరచినాడు. అయితే రసదృష్టితో దీని కున్న ప్రాధాన్యము కథాదృష్టిలో లేదు. కథాదృష్టిలో దుర్వాసుని శాపమున కున్న ప్రాముఖ్యము ఏ యితరాంశమునకును ఉండనేరదు. కణ్వాగమమును, శకుంతలానిష్క్రమణమును సూచించి విడిచిపెట్టినను కథానిర్వహణమున నౌచిత్యము స్ఫురించెడిది కాదు. కాని దుర్వాసశ్శాపమన్ననో ఇదిశాకుంతలవస్తువున కెల్ల కీలకము (Pivot) ఇట్టి ప్రధానాంశమును శకుంతలానిష్క్రమణమునకు అనుయాయిగ చిత్రించుటలో అతుకు కనబడిపోవుచుండుటయే కాక ఈ యంకమున కథాదృష్టియు సమన్వయ మందకపోవుట కూడ జరుగుచున్నది. సప్తమాంకములో నట్లుగాక కథానిర్వహణమును, రససంచారమును ఒకే రథమునకుపూన్చిన రెండుగుఱ్ఱములవలె నడుచుచున్నవి.

“కణ్వుడు శకుంతలావివాహమునుగూర్చి తెలిసికొనుటకును, ఆమె నత్తవారి యింటికి బంపుటకును నడుమ కొంత యవకాశము కావలసియున్నది” అని నావ్యాసమున వ్రాసితిని. “అద్యైవ రాజర్షి పరిగృహీతాం త్వాం భర్తు స్సకాశం విసర్జయామీతి” అను వాక్యము శకుంతల మంచి వరుసే చూచుకొన్న దను సంతోషముచేతగాని, భర్తృసమాగమమునకయి పరితపించుచున్న దని గ్రహించుటచేతగాని వెలువడిన దని సమర్థింపవచ్చునుగాని కళాదృష్టితో జూచినపు డీసం

దర్భమున నొక యిబ్బంది కలుగుచున్నది. శకుంతలా వివాహమునుగూర్చి కణ్వు డేయభిప్రాయమునకు వచ్చునో యను సంశమున చెలికత్తెలకును, శకుంతల కును ఎంత యాత్రతగనుండునో చదువరికి (ప్రేక్షకు నకు) గూడ అంత యాత్రతగను ఉండును. కణ్వుడు ఆమెవివాహము నామోదించినాడు అను భావ మింకను మనకు జీర్ణముకాకుండగనే ఆమె నత్తవారింటికి బంపుచున్నా డను వార్తను దీనితో జోడించుట సమీచీనముగ లేదేమో. ఒకవేళ శకుంతలమనస్సులోని యారాటమును గనిపెట్టినను "అమ్మా నాలుగు నెలల నుండి చూచుచుంటివిగదా. ఇంకను కొన్ని దినము లోపికపట్టరాదా" అనుట స్వభావమునకు సన్నిహిత మనిపించుచున్నది. "ఆలస్యం చేస్తే మళ్లీ వుంగరం ఎక్కడ బయలుపడుతుందో" అను సహృదయ మహాశయుల సమర్థనము నాకు నచ్చలేదు. నాలుగు నెలల వరకు బయలుపడకుండనున్న ఉంగరము మరి ఒకటి రెండు నెలలలో తొందరపడదుగదా!

ఇంతకు చతుర్థాంకమున ఒక్క యనౌచిత్యము కూడ లేకపోయినను చూపిన కళాప్రాగల్భ్యమునుబట్టి నాకు చతుర్థాంకముకంటె సప్తమాంకము మిక్కిలి మేలైనదిగ గనవచ్చుచున్నది. రెండు ఉత్తమమైన సన్నివేశములలో తారతమ్యము నిరూపించుట అంత సుకరమయిన పని గాదని నేనును అంగీకరింతునుగాని రథారూఢుడయి రాజు ప్రవేశించుట మొదలుకొని భరతవాక్యము చెప్పువరకును ఈయంకమున కాళిదాసు చూపిన ఘటనాప్రాగల్భ్యము ఏ యితరఘట్టమునందును చూపలేదని నాకు తోచుచున్నది. నిజముగ సప్తమాంకము శాకుంతలమునకు రాణి.

సహృదయ మహాశయులు నాతో నేకీభవింప జాలకున్నచో వారి మతమును నేను మన్నింతును. విమర్శనమున- గణితమునందువలె- ఒకరు తప్పని నిర్ధారణ చేయుటకు వలనుపడదుగదా. రసాభిరామమగు సాహిత్యోపాసనమున మతాంతరములు హర్షదాయకములుగాని అమర్షాస్పదములు కానేరవుగదా!

నండూరి బంగారయ్య.

## సృష్టివైపరీత్యములు

౧. ఏనుగులు ఎక్కడకు పోయి చచ్చునో ఎవరికిని తెలియని విషయము. ప్రతిసంవత్సరము ఆఫ్రికాదేశములో రెండువేల ఏనుగులు అగుపడవు. అవసాన కాలమందు ఏనుగు లోతునదికి పోయి వాటి కళేబరములలో నొక్కటైనను గాన్పించదు. అందులో మునిగి చచ్చు నని చెప్పుదురు.

౨. పెంపుడు ఏనుగులు కొన్ని సమయముల యందు చనిపోయిన తరువాతకూడా నిలబడియుండును. న్యూయార్కు జంతుప్రదర్శనశాలలో ఒక యేనుగు ౨౦ సం.లు పండుకొనలేదు.

౩. ఏనుగు తన నోటితో వాసనచూచును గాని ముక్కుతో వాసన చూడదు.

౪. ఎనాబ్లెప్స (Anableps) అనే దక్షిణఅమెరికా చేపకు నాలుగు కళ్లుండును. దీని కళ్లు రెండు భాగము లయియుండును. పైభాగపు కళ్లు నీటిపైని క్రిందిభాగపుకళ్లు నీటిలోపలను చాలదూరము వరకు చూచుటకు ఉపయోగపడును.

౫. తేనెటీగ ఒక సారి తన నోటను తెచ్చే తేనెకొరకు ౧౬ మైళ్ల వరకు తిరుగును.

౬. సిఫెన్‌మియా (Cephenmyia) అనే ఒక జాతిఈగ గంటకు ౮౧౬ మైళ్లు ప్రయాణము చేయును. ఒక సెకెండులో ౪౦౦ గజములు వెళ్లును.

౭. ౧౭౪౬ సం॥ ఫిబ్రవరి౧౩-వ తేదీని "జీన్ మేరీడన్‌బెరీ" (Jean Marie Dunbarry) అనే ఫ్రెంచి దేశస్థుడు తన తండ్రిని చంపినందుకు ఉరి తీయబడెను. సరిగా ౧౦౦ సం॥ల తరువాత, ౧౮౪౬ సం॥ ఫిబ్రవరి ౧౩-వ తేదీని మొదట ఉరి తీయబడిన డన్‌బెరీ తాలూకు మునిమనుమడు "జీన్ మేరీ డన్‌బెరీ" అను వాడు తన తండ్రిని చంపినందుకు ఉరితీయబడెను.

౮. ౧౬౬౪ సం॥ డిసెంబరు ౫-వ తేదీని మినే (Menai) జలసంధిలో ౮౧మంది ప్రయాణీకులతో పడవ మునిగిపోయెను. అందులో ఒక్కడుమాత్రమే బ్రతికెను.

అతని పేరు హగ్ విలియమ్స్ (Hugh Williams). ౧౭౮౫ సం|| డిసెంబరు ౫-వ తేదీని మరియొక పడవ ఆ స్థలముననే మునిగిపోయెను. దానిలో నున్న ౬౦ మంది ప్రయాణీకులలో బ్రతికినవాడు ఒక్కడే. వానిపేరుకూ హగ్ విలియమ్స్. ౧౮౨౦ సం|| ఆగస్టు ౫-వ తేదీని అచటనే మరియొక పడవ మునిగిపోయెను. అందులో నున్న ౨౫ గురు ప్రయాణీకులలో ఒక్కడే బ్రతికెను. వాని పేరుకూడా హగ్ విలియమ్స్. మూడు పడవలు ఒకే జలసంధిలో ౫-వ తేదీనే మునిగిపోయెను. ఆయా పడవలలో బ్రతికినవాడు ఒకొక్కడుమాత్రమే. ప్రతిపడవలో బ్రతికినవాని పేరు హగ్ విలియమ్స్.

౯. ఇంగ్లీషు భాషయందలి ౨౬ అక్షరములను ౬౨౦, ౪౪౮, ౪౦౧, ౭౩౩, ౨౩౯, ౪౩౯, ౩౦౦, ౦౦౦ విధములుగా మార్చి వ్రాయవచ్చును.

౧౦. ఎలెన్ (Allen) సోదరీమణులకు చెందిన ఒక బాతు ౧౦౬ సం||లు (౧౮౨౪-౧౯౩౦ వరకు) జీవించెను.

౧౧. ౧౯౧౮ సం||లో ఓడ్‌పూల్ (Ode-pool) పొలమువద్ద ఒక పెద్దచెట్టు గొప్ప గాలిచే నేలకు వొరిగిపోయెను. వారమురోజుల తరువాత మరియొక గొప్పగాలి పడిపోయిన చెట్టుకు ఎదురుగా వీచి ఆ చెట్టును తిరిగి యథాస్థానమునకు తెచ్చినిలబెట్టెను. ఆచెట్టు ఇప్పటికిని బలముగా నున్నది.

౧౨. టెన్నిసీ (Tennessee) అను పట్టణములో హిరాస్టోక్ అనునామెకు ౫౮ రోజులు ఎడతెరపి లేకుండా ఎక్కిళ్లు కలిగెను.

ఆచంట కృష్ణారావు.

ఆంధ్రాభ్యుదయం



## భాగవతుల శేషాచలపతిరావుగారు

గుంటూరుజిల్లా నండూరు గ్రామవాస్తవ్యులైక వీరు మద్రాసు విశ్వవిద్యాలయమునందు యం. ఏ. పట్టభద్రులు. అంతతో తృప్తి చెందక వీరు 1937 లో ఉన్నత విద్యాభ్యాసమునకై ఇంగ్లాండువెళ్లి, అక్కడి ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయములోని యం. ఏ. పట్టమునుగూడ పొందిరి. అటుపిమ్మట వైమానిక విషయములలో ప్రత్యేక పరిశోధనలుచేసి, అక్కడి శాస్త్రజ్ఞులచేత మెప్పులుపొంది 1941 నుండి 1944 వరకు జూనియరుసైంటిఫిక్ ఆఫీసరుగా ఇంగ్లాండులో పని చేసిరి. ఈమధ్యనే స్వదేశమునకు తిరిగి వచ్చినారు. ఈ ఉద్యోగమును చేయుటకు ఆంధ్రులలో వీరే ప్రప్రథములు.



# విమర్శనము



## 'గోవిందరామాయణము, అను ఉత్తరరామచరితము

గ్రంథకర్త: ఆత్మకూరి గోవిందాచార్యులుగారు, ఎమ్. ఎల్. సి. డబుల్ క్రౌన్ సైజు, ౩౬ + ౧౫౩ + ౫ పుటలు. వెల రు ౨-౦-౦ లు. ప్రతులు గ్రంథకర్తగారి యొద్ద (ఏలూరు) లభించును.

పూర్వకవు లెందరో శ్రీరామచరిత్రను గాన మొనర్చి తమ వాక్కునకు ధన్యత నాపాదించుకొన గల్గిరి. కొందఱిగానము గీర్వాణపథగామి యైనది; మఱి కొందఱి వాక్కుమాతృభాష నాశ్రయించినది. ఎవ రెంద రెన్ని కావ్యములను వ్రాసినను, నాటకములను గూర్చినను, పదములనాలాపించినను, ఆదికవి 'పుట్టతేనె'యే మాతృక. 'రామయ్య' తండ్రియే తెలుగువారికి ఇష్టదైవము. ఆ శ్రీరామచంద్రుని 'ఆర్యధర్మరక్షణశీలత్వ' మును వర్ణించి, తమ వాక్కునకు ఆచంద్రతారకస్థాయిత్వము నబ్బజేసుకొను కోర్కెగూడ పెక్కుమంది కవులకు కలదనిపించుచున్నది. ఆంధ్రమున నున్నన్ని రామాయణములు మఱి ఏ ఇతర భారతదేశభాషల లోను లేవు.

ఇందు అయిదాశ్వాసములలో ఉత్తరరామగాథ వర్ణింపబడినది. చక్కని రసవంతమైనభాష. వ్యర్థమైన పలుకొక్కటియును లేదు. ఇదియే కవిగారి ప్రథమ కావ్య మను విషయముఆశ్చర్యమునుకలిగింపకమానదు. ఆంధ్రమునకు ఆనుపూర్వికముగ వచ్చు ఛందస్సు ఎంత సహజమైనదియు వారి పద్యములను చవిచూచిన తెలియగలదు.

కవిగారు ఇతోధికమగు భాషాసేవను సల్పుదురుగాక !

నిర్వికల్పానందస్వామి.

## శ్రీ శారదాప్రసంగములు

అనువాదకులు : శ్రీ వెదురుమూడి వెంకటకృష్ణారావుగారు. ప్రకాశకులు: శ్రీ రామకృష్ణమఠమువారు, మైలాపూరు, మద్రాసు. వెల రు. ౨-౮-౦.

ఇది అసలు వంగభాషలో లిఖింపబడినది. శ్రీ నిఖిలానందస్వామివారు (అమెరికాయందలి శ్రీ రామకృష్ణమఠాధ్యక్షులు) ఆంగ్లములోనికి మార్చిరి. దానికి ఇది ఆంధ్రానువాదము.

ఇందు మూడు భాగములు కలవు. మొదటిభాగమునందలి ప్రసంగములన్ని శ్రీ శారదాదేవి శిష్యురాలొకరు వ్రాసినవి. రెండవ భాగమునందలివివారిశిష్యులనొక సన్యాసి వ్రాసినవి. మూడవ భాగమునందలివి సన్యాసులూ, గృహస్థులూనగు శిష్యులనేకులు లిఖించినవి.

ఈమూడు భాగములందును వేర్వేరు ప్రసంగములు కలవు. కేవలము ఆధ్యాత్మిక విషయమైన ప్రసంగములేకావు. సంసారులకుకూడతమజీవనయాత్రను సుఖముగా గడపుటకు నేర్పుకొనతగిన ప్రసంగములిందు కలవు. కొందరికి వేదాంత ప్రసంగములంటే అంతగా రుచించవు. కాని ఇందలి ప్రసంగము లట్లుగాక ఎట్టివారికైనను పఠింప పురికొల్పునట్టివి.

ఈ ప్రసంగములును 'ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః' అన్నట్లు ఎన్ని జన్మజన్మాంతరముల అనుభవమువల్లనో ఆ సాధ్వికి లభించియుంటవి . గాని గొప్ప గొప్ప విద్యాలయాలయందు చదివిన మాత్రాన పుట్టుకొచ్చేవిగావు. స్త్రీలు దీనిని ముఖ్యముగా చదువవలయును. వారి కిది ఉల్లాసమును గూర్చుకథలపుస్తకము వలెనుండును. అంతేగాక సంసారనిర్వహణమున వారి

దుర్కొనవలసిన కష్టములనుగూడ నెట్లు సౌఖ్యములుగ మార్చుకొనగలరో అట్టి ప్రసంగములును ఇందుగలవు. పురుషులపతనమునకును మహోపకారియైన గ్రంథము.

## మదాంధ్ర ఆనందరామాయణము

గ్రంథకర్త: శ్రీ సోమరాజు వెంకటసుబ్బరాయ కవిగారు. ప్రకటనకర్త: శ్రీ సోమరాజు ఆంజనేయులు గారు, పూర్ణానందం పేట, బెజవాడ, వెల రు. ౫-౦-౦.

మౌలికమైన వాల్మీకిరామాయణానికీ, దీనికీ ఏమీ భేదములేదుగాని అందలి ముఖ్యపాత్రల పూర్వ జన్మవృత్తాంతములు వెల్లడించుటయందు ఈ రెండింటికీ పోలికే లేదు. ఇందులో సారకాండము, యాత్రాకాండము, యాగకాండము, విలాసకాండము, లవకుశజన్మకాండము, వివాహకాండ మని ఆరుకాండలు గలవట. అందు మొదటి సారకాండలోనే ఉత్తరకాండ సహితంగా షట్కాండలవృత్తాంతము వచ్చినది. ఈషట్కాండలలోనూ, ఉత్తరకాండలోనూ గల ముఖ్యపాత్రల గతజన్మవృత్తాంతములకును, ప్రచలితరామాయణపాత్రలవృత్తాంతములకును సంబంధమే లేదు. మచ్చుకు సీతాపూర్వజన్మవృత్తాంతములో వేదవతీ ఉపాఖ్యానమునకుమారుగ పద్మాక్ష ఉపాఖ్యాన మిందులో నున్నది. కలహాది వృత్తాంతములు ప్రచలితరామాయణములో అసలే లేవు. మైరావణ మహిరావణుల వృత్తాంతములూ అట్టివే. ఇట్టి విచిత్రాంశముల వర్ణనలతో ఇది కేవలము ఆనందము నేకాదు, ఆశ్చర్యమునుగూడ గలిగించును.

గ్రంథకర్తగారి రచననుగురించీ, శైలినిగురించీ వ్రాయుట అనవసరము. గ్రంథముచదువునపుడు నన్నయ పోతనాది ప్రాచీనకవులు అడుగడుగునా జ్ఞాపకమునకు వచ్చుచుందురు.

భావకవిత్వము చెలరేగుతున్న ఈరోజులలో ఇటువంటి ప్రాచీనకవిత్వముగూడ బయలువెడలుచుండుటచూడ మన యాంధ్రీమతల్లి అన్నివిధాలా విస్ఫూర్తినిగలిగి తాండవించుచున్నదని చెప్పవచ్చును. ఈ నూతన రామాయణమును పఠించి ఆంధ్రులందరూ ఆనందమగ్ను లగుదురుగాక.



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.







చక్కని రుచి, ఘుమ ఘుమలాడే సువాసన, నేత్ర పర్వంగావుండే రంగు, తక్కువధర, వీటి అన్నింటి నిబట్టి లిప్టన్స్ వైట్ లేబుల్ మిగతా వాటిని తలదన్ని అత్యాధిక గౌరవాన్ని తెచ్చుకున్నది.

# లిప్టన్స్
# వైట్ లేబుల్

మృదు మధురమైన ఇండియన్ లీఫ్ టీ

LTK 84 WTG

# భారతీయ సంప్రదాయము



భారతదేశము, కళ, అతిథి సత్కారము—యీ ద్వివిధ సంప్రదాయములకును ప్రసిద్ధిగన్నది. ఇవి రెండును జీవితానందముతో అతి సామీప్యమైన సన్నిహితత్వము కలిగి వున్నవి. సున్నితమైన యీ చోళ శిల్పకళను చూస్తూ వుంటే—మీ ఆప్త మిత్రులను "టీ" తో సత్కరిస్తూ వున్నప్పుడు కలిగే ఆనందము మీకు కలుగుతుంది. ఏ సమయమున వచ్చినప్పటికీ రుచికరమైన పానీయమును మించిన అతిథి సత్కారము మరొక్కటి వున్నదా? మీ సంప్రదాయమును విడువకుండా అనుసరించుతూ ప్రతివారూ స్వగృహమున ఉన్నట్లు భావించులాగున ఇండియా టీ పానీయమును అందించడముతో సత్కరించండి.



"నిత్యానుష్ఠానము"—గృహములో "టీ" త్రాగుటకు యెటువంటి సమయములు అనుకూలమైనవో తెలియజేయుటకు మేముకొత్తగా వెలువరించి ముచ్చటైన సచిత్ర పుస్తకముయొక్క శీర్షికయిది. ఈ ప్రకటన కత్తిరించి మీ పేరు, పూర్తివిలాసము (విడి అక్షరములలో)తో సహా కమిషనర్ ఫార్ ఇండియా, ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డ్, పోస్టు బాక్సు నెంబర్ 2172, కలకత్తా విలాసానికి పంపితే, ఆయన మీకు చిన్న పుస్తకాన్ని ఉచితముగా పంపగలరు.



## ఒకేయొక కుటుంబ పానీయము



# ఇండియాటీ

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డువారిచే ప్రకటింపబడినది

IK. 204





Directed by
**B. N. REDDI**

CAMERA... BARTLEY
SOUND...... DINSHAW
ART......... NAGOOR
Studio. NEWTONE

నాగయ్య · జయమ్మ · భానుమతి
నారాయణరావు · లింగమూర్తి · శివరావు
నటించిన
వాహిని వారి

# స్వర్గసీమ

వస్తున్నది.....



**THE VAUHINI PICTURES Ltd.**
MADRAS... BEZWADA... TADPATRI